# శ్రీ మద్భగవద్గీతా మననము

గ్రంథకర్త:
శ్రీ కామరాజుగడ్డ రామచంద్రరావు





ప్రకాశకులు:
తారామాంజనేయ శర్మ ఎం. ఏ.
న్యూనల్లకుంట, హైదరాబాదు-44

# శ్రీ మద్భగవద్గీతా మననము

(మొదటి ఆరధ్యాయములు)

గ్రంథకర్త:

శ్రీ కామరాజుగడ్డ రామచంద్రరావు

ప్రథమ ముద్రణము 1000 ప్రతులు

దుందుభి సం॥ జ్యేష్ఠము- కలి. ౫౦౮౩

ప్రకాశకులు:

బోడపాటి సీతారామాంజనేయ శర్మ ఎం.ఏ.

2-2-1136/1, న్యూనల్లకుంట, హైదరాబాదు-44



[రు. 6-50

# శ్రీ కృష్ణాష్టకమ్

౧. వసుదేవసుతం దేవం కంస చాణూర మర్దనం।
దేవకీ పరమానందం కృష్ణం వందే జగద్గురుమ్॥

౨. అతసీకుసుమ సంకాశం హార నూపుర శోభితం।
రత్నకంకణ కేయూరం కృష్ణం వందే జగద్గురుమ్॥

౩. కుటిలాలక సంయుక్తం పూర్ణచంద్ర నిభాననం।
విలస త్కుండలధరం కృష్ణం వందే జగద్గురుమ్॥

౪. మందారగంధ సంయుక్తం చారుహాసం చతుర్భుజం।
బర్హి పింఛావ చూడాంగం కృష్ణం వందే జగద్గురుమ్॥

౫. ఉత్ఫుల్ల పద్మపత్రాక్షం నీల జీమూత సన్నిభం।
యాదవానాం శిరోరత్నం కృష్ణం వందే జగద్గురుమ్॥

౬. రుక్మిణీకేళి సంయుక్తం పీతాంబర సుశోభితం।
అవాప్త తులసీగంధం కృష్ణం వందే జగద్గురుమ్॥

౭. గోపికానాం కుచద్వంద్వ కుంకుమాంకిత వక్షసం।
శ్రీనికేతం మహేష్వాసం కృష్ణం వందే జగద్గురుమ్॥

౮. శ్రీవత్సాంకం మహోరస్కం వనమాలా విరాజితం।
శంఖ చక్రధరం దేవం కృష్ణం వందే జగద్గురుమ్॥

౯. కృష్ణాష్టక మిదం పుణ్యం ప్రాతరుత్థాయ యః పఠేత్।
కోటిజన్మ కృతం పాపం స్మరణేన వినశ్యతి॥

# తొలిపలుకు

శ్రీ కామరాజుగడ్డ రామచంద్రరావుగారు 'లా' పట్టభద్రులు. వీరు ఆం. ప్ర. ప్రభుత్వము సెక్రటేరియట్ లా డిపార్టుమెంటులో డిప్యూటీ సెక్రటరీగాపనిచేసి, రిటైరయి ప్రస్తుతము అడ్వొకేట్ వృత్తి నవలంబించియున్నారు. వీరు లౌకిక వృత్తిలోనుండియు, సత్సాంగత్యముగలవారగుటవలనను, ఆధ్యాత్మికచింతనాపరు లగుటవలనను, విశేషించి శాంతస్వభావులును జిజ్ఞాసువులును అగుటచేతను శ్రీమద్భగవద్గీతాభాష్య ప్రవచనమెచట జరుగుచున్నను అచటికేగి శ్రద్ధాభక్తులతో విని, వినినదానిని మననము చేసికొని, వారి యనుభూతిని ఈ గ్రంథరూపమున వెలువరించిరి. అందువలననే దీనికి "శ్రీమద్భగవద్గీతామనన" మని పేరిడిరి. సర్వసామాన్యులకు సులభముగా బోధపడునుద్దేశముతో వ్యావహారిక శైలిలో వ్రాసిరి. విషయప్రదర్శన కూడ నట్లే సామాన్యునకు అందుబాటులో నుండునట్లు తేటతెల్లముగా జేసిరి. 1980 ఫిబ్రవరిలో వీరు నావద్దకువచ్చి వీరి రచనను చూపిరి. రచయిత లౌకికవృత్తియందున్నవారు గనుక, వైదిక సంప్రదాయానుగుణముగా వ్రాసిరో తద్వ్యతిరిక్తముగా వ్రాసిరోయను శంకవలన, దీనిని పత్రికలో ప్రచురించుటకు వెనుకాడితిని. కాని చదివిచూడగా అట్టిసందేహమునకవకాశము కన్పించలేదు. ఇట్టిపరిస్థితిలో పత్రికలో ముద్రించుటయేగాని, వేరుగా ప్రతులను తీసియుంచలేదు. కొన్ని మాసములయిన పిమ్మట పాఠకులు తమ సదభిప్రాయములు వ్రాయసాగిరి. ఒకరు తమ లేఖలో "భగవద్గీతామననము వేరు పుస్తకములుగా తీసియుంచుచున్నారా? అట్లు చేసియుంటే నాకొక ప్రతి పంపండి—ఒకసారి చదివితే మరల మరల చదువవలెననిపించుచున్నది"

అనియు, మరొకరు "వేదాంతమంటే విసుగు జనించేవానికి కూడా అభిరుచి కలిగే రీతిలో పామరులకు సహితము బాగుగా తెలిసేటట్లుగా వ్రాయబడినది. బాగున్నది. (శ్రీ మాదిరాజు శ్రీరామమూర్తి బి.ఏ. సాహిత్య విశారద) అనియు వ్రాసిరి. ఇట్టివి అనేకమందిచే వ్రాయబడిన అభిప్రాయములు చూచి, పుస్తకముగా ప్రచురించుట సమంజసమని గ్రహించి, పత్రికలో ఒకసారి ముద్రించినదానిని, మరల కంపోజ్ చేయించితిని. అందుచేత దీనిమూల్యము కొంచెమధికముగా నిర్ణయించవలసి వచ్చెను. మిగిలిన 12 అధ్యాయములు త్వరలో వెలువడును.

శ్రీరామచంద్రరావుగారు వ్రాసిన యితర గ్రంథములు కలవు. వానిలో "శ్రీ హనుమద్వ్రతకల్ప" మొకటి. మహాభారతమును "మహాభారత మహితకథలు" అను పేరుతో వ్యావహారిక శైలిలో వ్రాయుచున్నారు. మేము స్వధర్మ ప్రకాశినిలో క్రమముగా ముద్రించుచున్నాము. అందు గాంచగలరు.

న్యూ నల్లకుంట, హైదరాబాదు.
శ్రీ దుందుభి సం-ఉగాది కలి ౫౦౮౩

డా. సి. ఆంజనేయశర్మ
ప్రకాశకుడు.

# ఉపోద్ఘాతము

మానవుడు తనను గురించి నేర్చుకొనవలసినదీ, తెలిసికొనవలసినదీ చేయవలసినదీ అంతా శ్రీమద్భగవద్గీతలో వున్నది.

అంత గొప్పగా ఎలావుంటుంది అని సందేహం కలుగవచ్చు. కాని శ్రీమద్భగవద్గీత మానవుని స్థితిగతిని సంపూర్ణంగా చెప్తుంది. అందులో సందేహం వుండనక్కరలేదు.

సరె. పోనీ అలా చెప్తుతుందనె అనకొందాం. మరి మానవుడి సంగతి మానవ శరీర శాస్త్రంలో ఇంకా ఎక్కువ చెపుతారేమోకదా అని సందేహం. ఆమాటకొస్తె మానవ మనస్తత్వ శాస్త్రంలో ఇంకా సమగ్రంగా చెప్పటంకద్దు. వీటికంటె శ్రీమద్భగవద్గీతలో ఇంకా ఎక్కువ చెప్తారా? లేకపోతె ఈభగవద్గీత ప్రత్యేక తేమిటి?

ప్రాథమిక తరగతుల నుంచి పదితరగతుల వరకూ మానవ శరీరశాస్త్ర సంబంధమైన విషయాలు భోధింపబడుతూనే వుంటవి పిల్లలకు. ఈవిషయాలే డాక్టర్లకు కావలసిన ప్రత్యేకమైన చదువుకూడాను. కాని ఈపిల్లల చదువులకూ వైద్యవిద్యలో పట్టభద్రులు కావటానికి చదివేచదువులకూ తేడావున్నదా? లేదా? ఎంతోవున్నది. అలాగే ఈశారీరక శాస్త్రాలు మనస్తత్వ శాస్త్రాలు చదవటానికి అంతకంటె పైఅంతస్థులో నున్న ఈభగవద్గీతను చదివి అర్థం చేసికొనటానికి కూడ అంత తేడా వున్నది.

శరీరశాస్త్రంలో వట్టి శరీరానికి సంబంధించిన జ్ఞానం వుంటుంది. మనస్తత్వ శాస్త్రంలో మనసుకూ బుద్ధికీ సంబంధించిన విషయజ్ఞానం

క రించబడి వుంటుంది. కాని శ్రీమద్భగవద్గీతలో ఈశరీరానికీ మన
కూ బుద్ధికేగాక వాటికి భిన్నమై ఉన్న ఒకానొక ఆత్మ విషయం
్రకషంగా చర్చించటం కనపడుతుంది.

ఆత్మ అనే దాని విషయం మనం తెలిసికొనక పోతే ఏం అని
సందేహం కలగటం కద్దు. ఆమాటకొస్తె ప్రతి మనుష్యుడూ వైద్య
్రకయిన చదువులోని విషయం నేర్వవలెనని ఎక్కడయినా ఆదేశ
దా? లేదు. అయినా విజ్ఞానాన్ని పెంపొందించు కొనవలెనను
వారు వైద్యులకు తెలియదగిన అనేక విషయాలు తెలిసికొని జ్ఞాప
వుంచుకొంటూ వుండటం చూస్తూనే వుంటాం. ఇలా ఎందుకని?
విజ్ఞానలక్షణం గనుక.

ఈవిధంగా చూస్తె శ్రీమద్భగవద్గీతలోని విషయాలు కూడ
క ముంచుకొని పరిశోధించి నాకిది తెలిసింది అని నిశ్చయించు
టం విజ్ఞాన విషయమె.

అంతేకాదు. శ్రీమ ద్భగవద్గీతలోని విషయం మానవుని నిత్య
తంలో క్షణక్షణానా ఉపయోగపడే విషయం అనేది ముఖ్యం. తన్ను
ను తెలిసి ఉద్ధరించుకొనే విషయాన్ని మానవుడు నేర్వటానికి తగిన
నం—భగవద్గీతలో వున్నది.

వైద్య శాస్త్రం చదివిన వానికి వ్యాధీ—దాని కారణం—దానికి
న్న—తెలియటంవల్ల తన శరీరాన్ని ఆరోగ్యంగా జాగ్రతగా వుంచు
గలగటం తేలిక. అలాగే భగవద్గీత నెఱిగి తెలిసికొన్నందువల్ల
తంలో తన మన్నికను సమ్యగ్విధానంలో వుంచుకొనడానికి అపార
వ అవకాశంవుంది.

కనుక భగవద్గీతను విజ్ఞాన దృష్టితో చదవాలి. పారాయణంతో
ను అర్థం తెలిసి మననంచెయ్యాలి. అలాచేస్తేకొన్నాళ్ళకు ఆతెలిసిన

విషయాన్ని జీవితంలో పాలిస్తె మంచిదా కాదా అనే విషయం చర్చకు వస్తుంది మనసులోనె. అప్పుడు బుద్ధి చెపుతుంది—'ఇలా చెయ్యాలి అలాచేయరాదు' అని. ఈబుద్ధి చెప్పినసలహాను పాటించడానికిమనసూ, ఇంద్రియాలూ సహకరించటమూ కద్దు. అలా సహకరించక చుట్టూ గండభేరుండాల్లా చేరి ముక్కులతో కరుచుకు పోవటమూకద్దు. అలా అవి కరుచుకొని పోకుండా సాధనచేసి కాపాడుకోవాలి. అప్పుడు శ్రీమద్భగవద్గీత యొక్క ప్రయోజనాన్ని జీవుడు పొందగలుగు తాడు

అందుచేత తెలివి అనేది కలిగిన మనుష్యులు ఆతెలివిని భగవద్గీతా సందేశాన్ని తెలిసికొనటంలో ఉపయోగించాలి. 'ఆత్మ'కి అనగా 'నేను' కు సంబంధించిన విషయాన్ని విమర్శనంచేసి జ్ఞానాన్ని గడించటం మానవుని కర్తవ్యం. అలాగాక—చెట్టుకు ఆకులెన్నో లెక్క పెట్టుతాను.నాతెలివినందు కుపయోగించి పరిశోధన చేయకూడదా? అంటే—చేయవచ్చు చెట్టుకు మొదట్లోనీళ్లు పోసినట్లయితే ఆకుల సంరక్షణం చేయగలమని తెలియడానికి ఆకులు లెక్కించి యేయాకు ఎంత కాలం ఎందుకు వికసించి వుంటున్నదని తెలియడానికీ ఎంతతేడా వుందో—బుద్ధియొక్క శక్తిని ప్రాపంచిక విషయాల గురించి వెచ్చించడానికీ మానవుని బ్రతుకును గూర్చి విషయవిమర్శనం చేయడానికీ అంత తేడా వుంటుంది.

కాని మనుష్యుల సంస్కారం ఒకే విధంగా వుండదు. మనసు విషయవిమర్శనం చేయటానికి ఉన్ముఖంకాదు—ఒకప్పుడు. అబ్బోఅంత శ్రమ ఎవరు పడతారు. నీవు చెప్పే బ్రతుకు నేనెరుగనుగాక. నేను నౌకరీచేసి తిండి సంపాదిస్తాను. బ్రతుకు వెళ్లిపోకేంచేస్తుందిఅనుకొనటం కద్దు కొందరి విషయంలో. వారు ఈభగవద్గీత జోలికి రావలసిన పని లేదు. ఎక్కడో కృష్ణ-రామ-అనుకొంటూ వుంటే చాలు. పత్రికల్లోని,

ప్రపంచంలోని కథలు నీతులు, ఇతర విజ్ఞాన విషయాలు తెలిసికొంటూ వుండేచాలు. కొన్నాళ్ళకైనన్నాళ్ళకో వారి సంస్కారం మెరుగవుతుంది గాక. వారు శ్రీమద్భగవద్గీతను చదవాలనే వారిని ఉపేక్షచేస్తేచాలు నిరసించకుండా.

ఇంకో సందేహం రావడంకద్దు. "పవిత్రమైన భగవద్గీతను శ్రీశంకరాచార్యులో లేక మతగురువులో భాష్యం వ్రాసిందే చదివి నేర్వాలిగాని ఏపుస్తకం పట్టితే దానినె చదివితే ఎక్కడకు పోతామో-" అని. కాని మీరు చదివేది, వినేది, మనసుతో, బుద్ధితో. అర్థంచేసికొన బడేది భగవద్గీత. ఈరచనలు పరికరాలు మాత్రమే. పరికరాన్ని చూసి, ఇది ఇనుపది, ఇదిరాగిది, బంగారముకాదుఅని నిరసించడం తెలివైనపని కాదేమొ. ఇది కేవలం పరికరంగా మీకు ఉపయోగించాలి. అలాపనికి రాని ఇది,-అదె-అది,- దండుగని చెప్పి పారేయాల్సింది.

శ్రీమద్భగవద్గీతా పఠనం చేయాలి; శ్రవణంచేయాలి; ఇంకా మననం చేయాలి కాగా ఈమననంలో పేరాల మొదట్లో గల అంకెలు శ్లోకాల సంఖ్యలు అని తెలియవలసింది.

కా. రామచంద్రరావు

ఓం

# శ్రీ మద్భగవద్గీతా పారాయణ విషయం

శ్రీమద్భగవద్గీతా పారాయణ ప్రతి దినమూ చేయాలి. ఒకే సమయాన్ని ఏర్పరచుకొని ఆ సమయంలోనే పారాయణకు కూర్చొనటం మంచిది. అభ్యాసము వలన ఆ సమయము వచ్చేటప్పటికి మనసు శాంతిగా పారాయణం చేయుటకే ఉన్ముఖమై ఉంటుంది.

పారాయణ చేసేటప్పుడు శ్లోకముయొక్క అర్థంకూడ తెలిసికోటానికి ప్రయత్నించుతూ వుండడం రెండో మెట్టు. ఆ అర్థాన్ని మనసులో వుంచి దానిని విశృంఖలంగా వ్యాపించే స్థితిలో వుంచాలి. అప్పుడు కలిగే భావాలు ఒకనాటి కంటె మరొకనాడు విశేషమై నిశితమై వుంటాయి. అవన్నీ క్రోడీకరించి ఆలోచించినట్లయితె అదె భగవద్గీతా మననమై వెలుస్తుంది అనిపిస్తుంది. అలాటి మననములో అదివరకు విన్న విషయాలేగాక ఏవో ఊహకు క్రొత్త అంతస్థులందుతూ వుంటవి. వాటిని సన్మార్గంలో అర్థంచేసికొనటం చాల అవుసరం. అందుకొరకై అనుభవజ్ఞులూ సాధనపరులూ అయిన వారిదగ్గర శ్రవణం చేయవలె. వారి పుస్తకములు చదవటంకంటెకూడ వారి దగ్గరచేరి వినటంలో సన్నిహితమైన ఆత్మపరిచయం కలుగుతుంది అనిపిస్తుంది. అప్పుడుకూడ పారాయణ చేయటం మననం చేయటం మనసులోని భావాలు స్థిరపరచుకోవటం మానకూడదు.

పారాయణ అయింతరువాత మహాత్మ్యము చదవాలని అంటారు.

ఇంతకూ వేదాంత విషయం ఈ భగవద్గీతలో చెప్పేది. లౌకిక ఫలితం కొఱకు భగవద్గీతచదివేవారు తప్పక మహాత్మ్యం చదవాలి. వేదాంత విషయజ్ఞానం కొఱకు మాత్రం చదివేవారు ఒకవేళ మహాత్మ్యాన్ని చదువకపోయినా సేగి లేదు.

ఓం తత్సత్

# పారాయణ క్రమము

ఆచమనం అనంతరం దేశకాల సంకీర్తనం చేసి గోత్ర నామధేయములు చెప్పి మమ ఉపాత్తదురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం చిత్తశుద్ధి ద్వారా సుజ్ఞాన ప్రాప్త్యర్థం శ్రీ మద్భగవద్గీతా పారాయణాఖ్యం కర్మ కరిష్యే అని సంకల్పించవలెను.

విఘ్నేశ్వర ప్రార్థన, గురుస్తుతి చేసి వ్యాసమహర్షిస్తోత్రం శ్రీ కృష్ణస్తుతి గీతాస్తుతి చేయవలె.

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వ విఘ్నో పశాంతయే

సరస్వతి నమస్తుభ్యం వరదే కామరూపిణీ
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరం బ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః

వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే
నమోవై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమః

కృష్ణాయ వాసుదేవాయ హరయే పరమాత్మనే
ప్రణతక్లేశ నాశాయ గోవిందాయ నమోనమః

సర్వోపనిషదోగావో దోగ్ధా గోపాలనందనః
పార్థోవత్స స్సుధీర్భోక్తాదుగ్ధం గీతామృతం మహత్

అస్యశ్రీ భగవద్గీతా శాస్త్ర మహామంత్రస్య, భగవాన్ వేదవ్యాస ఋషిః అనుష్టుప్ ఛందః శ్రీ కృష్ణ పరమాత్మా దేవతా –

అశోచ్యా నన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే– ఇతిబీజమ్. సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజేతిశక్తిః అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ఇతికీలకమ్ నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః ఇతి అంగుష్ఠాభ్యాంనమః నచైనం క్లేదయంత్యాపో నశోషయతి మారుతః ఇతి తర్జనీభ్యాన్నమః అచ్ఛేద్యోయ మదాహ్యోయ మక్లేద్యో శోష్యయేవచ– ఇతి మధ్యమాభ్యాన్నమః. నిత్యః

స్సర్వగతః స్థాణు రచలో యం సనాతనః ఇతిఅనామికాభ్యాంనమః పశ్య మే పార్థ రూపాణి శత శోధ సహస్రశః ఇతి కనిష్ఠికాభ్యాంనమః నానావిధాని దివ్యాని నానావర్ణా కృతీనిచ ఇతి కరతలకరపృష్ఠాభ్యాంనమః నైనం ఛిందంతి శస్త్రాణి నైనందహతి పావకః ఇతి హృదయాయ నమః. న చైనం క్లేదయంత్యాపో నశోషయతిమారుతః ఇతి శిరసే స్వాహా అచ్ఛేద్యోయ మదాహ్యోయ మక్లేద్యోశోష్య ఏవచ_ఇతి శిఖాయైవషట్ నిత్య స్సర్వగతః స్థాణు రచలోయంసనాతనః ఇతికవచాయహుమ్. పశ్యమే పార్థరూపాణి శతశోథసహస్రశః ఇతి నేత్రత్రయాయ వౌషట్ నానా విధాని దివ్యాని నానావర్ణా కృతీని చ ఇతి అస్త్రాయఫట్.

భూర్భువస్సువరో మితి దిగ్బంధః

## అథ ధ్యానమ్

కరకమల నిదర్శితాత్మముద్రః
  పరికలితోన్నత బర్హి బర్హ చూడః
ఇతర కరగృహీత వేత్రతోత్రః
  మమ హృది సన్నిధి మాతనోతు కృష్ణః

ఆతామ్రపాణి కమల ప్రణయ ప్రతోదం
ఆలోల హార మణికుండల హేమసూత్రమ్
ఆ విశ్రమాంబుకణ మంబుదనీల మవ్యాత్
ఆద్యం ధనంజయ రథాభరణం మహో నః

అగ్రే కృత్వా కమపి చరణం జానునైకేన తిష్ఠన్
పశ్చాత్పార్థం ప్రణయసజుషా చక్షుషా వేక్షమాణః
సవ్యేతోత్రం కరసరసిజే దక్షిణే జ్ఞానముద్రాం
ఆబిభ్రాణో రథ మథివసన్ పాతు నస్సూతవేషః

పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం
వ్యాసేనగ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతమ్
అద్వైతామృత వర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీం
అంబత్వా మనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్.

ఇప్పుడు పారాయణ చేయవలెను.

ఓం నమో భగవతే వాసుదేవాయ

# శ్రీమద్భగవద్గీతా

## ప్రథమోఽధ్యాయః

## అర్జున విషాదయోగః

ధృతరాష్ట్ర ఉవాచ :-

శ్లో. 1 ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ.

సంజయ ఉవాచ :

2 దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా
ఆచార్యముపసంగమ్య రాజా వచనమబ్రవీత్

3 పశ్యైతాం పాండుపుత్రాణామాచార్య మహతీం చమూమ్
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా

4 అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః

5 ధృష్టకేతుశ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్
పురుజిత్ కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః

6 యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః

7 అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే

8 భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తిర్జయద్రథః

శ్రీ మద్భగవద్గీతా పఠనము.

శ్లో. 9 అన్యేచ బహవః శూరాః మదర్థే త్యక్త జీవితాః
నానా శస్త్ర ప్రహరణాః సర్వే యుద్ధవిశారదాః.

10 అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితం
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితం

11 అయనేషు చ సర్వేషు యథాభాగ మవస్థితాః
భీష్మమే వాభి రక్షంతు, భవంతః సర్వఏవ హి.

12 తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః
సింహనాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్.

13 తతః శంఖాశ్చ భేర్యశ్చ పణవానక గోముఖాః
సహసై వాభ్య హన్యంత సశబ్ద స్తుములో ఒ భవత్.

14 తతః శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యందనేస్థితౌ
మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః

15 పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః

16 అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః
నకులః సహదేవశ్చ సుఘోష మణిపుష్పకౌ.

17 కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీ చ మహారథః
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చా పరాజితః॥

18 ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే
సౌభద్రశ్చ మహాబాహుః శంఖాన్దధ్ముః పృథక్పృథక్.

19 సఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్
నభశ్చ పృథివీంచైవ తుములో ఒభ్యను నాదయన్.

శ్రీ మద్భగవద్గీతా పఠనము.

20 అథవ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః
ప్రవృత్తే శస్త్రసంపాతే ధను రుద్యమ్య పాండవః

21 హృషీకేశం తదావాక్య మిదమాహ మహీపతే

అర్జున ఉవాచ :—

సేనయోరుభ యోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత.

22 యావదేతా న్నిరీక్షేఽహం యోద్ధుకామానవస్థితాన్
కైర్మయా సహ యోద్ధవ్యమస్మిన్ రణసముద్యమే

23 యోత్స్యమానా నవే క్షేఽహం య ఏతే ఽత్ర సమాగతాః
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచి కీర్షవః

సంజయ ఉవాచ :—

24 ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత
సేనయో రుభయోర్మధ్యే స్థాపయిత్వారథోత్తమమ్.

25 భీష్మ ద్రోణ ప్రముఖతః సర్వేషాంచ మహీక్షితాం
ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి.

26 తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్
ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీం స్తథా
శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయో రుభయో రపి

27. తాన్ సమీక్ష్య సకౌంతేయః సర్వాన్ బంధు నవస్థితాన్
కృపయా పరయా విష్టో విషీద న్నిద మబ్రవీత్॥

అర్జున ఉవాచ :—

శ్లో.28. దృష్ట్వేమాన్ స్వజనాన్ కృష్ణ యుయుత్సూన్ సముపస్థితాన్
సీదంతి మమ గాత్రాణి ముఖంచ పరిశుష్యతి॥

## శ్రీమద్భగవద్గీతా పఠనము

29. వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే,
గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే

30. న చ శక్నో మ్యవస్థాతుం భ్రమతీవచ మే మనః
నిమిత్తానిచ పశ్యామి విపరీతాని కేశవ॥

31. నచ శ్రేయోఽను పశ్యామి హత్వా స్వజనమాహవే
న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖానిచ॥

32. కింనో రాజ్యేన గోవింద కిం భోగైర్జీవితేన వా
యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగాః సుఖానిచ॥

33. త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనానిచ
ఆచార్యాః పితరః పుత్రా స్తథైవచ పితామహాః॥

34. మాతులాః శ్వశురాః పౌత్రాః శ్యాలాః సంబంధిన స్తథా॥

35. ఏతా న్న హంతు మి చ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే॥

36. నిహత్య ధార్తరాష్ట్రాన్ నః కా ప్రీతిః స్యాజ్జనార్దన
పాపమేవాశ్రయే దస్మాన్ హత్వైతా నాతతాయినః॥

37. తస్మా న్నార్హావయం హంతుం ధార్తరాష్ట్రాన్ సబాంధవాన్
స్వజనం హి కథం హత్వా సుఖినః స్యామ మాధవ॥

38. యద్యప్యేతే న పశ్యంతి లోభోపహత చేతసః
కులక్షయ కృతం దోషం మిత్రద్రోహేచ పాతకం॥

39. కథం నజ్ఞేయ మస్మాభిః పాపాదస్మా న్నివర్తితుం
కులక్షయ కృతం దోషం ప్రపశ్య ద్భిర్జనార్దన॥

## శ్రీమద్భగవద్గీతా పఠనము

40. కులక్షయే ప్రణశ్యంతి కులధర్మాః సనాతనాః
ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోఽభి భవత్యుత॥

41. అధర్మాభి భవాత్ కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః॥

42. సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదక క్రియాః॥

43. దోషై రేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః ॥

44. ఉత్సన్న కులధర్మాణాం మనుష్యాణాం జనార్దన
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ ॥

45. అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితావయం
యద్ రాజ్యసుఖలోభేన హంతుం స్వజనముద్యతాః॥

46. యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః
ధార్తరాష్ట్రారణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్॥

సంజయ ఉవాచ :—

శ్లో.47.ఏవ ముక్త్వార్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్

విసృజ్య సశరం చాపం శోకసంవిగ్న మానసః ॥

ఇతి శ్రీమద్భగవద్గీతాసు, ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
అర్జున విషాదయోగోనామ ప్రథమోధ్యాయః

ఓం శ్రీకృష్ణార్పణమస్తు.

ఓం నమోభగవతే వాసుదేవాయ

# శ్రీమద్భగవద్గీతా

## ద్వితీయోఽధ్యాయః

## సాంఖ్యయోగః

సంజయ ఉవాచ :—

శ్లో.1. తం తథా కృపయావిష్ట మశ్రుపూర్ణాకులేక్షణం
విషీదంత మిదం వాక్యమువాచ మధుసూదనః॥

శ్రీభగవానువాచ :—

శ్లో.2. కుత స్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితం
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున॥

3. క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్ త్వయ్యుపపద్యతే
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప॥

అర్జున ఉవాచ :—

శ్లో.4. కథం భీష్మమహం సంఖ్యే ద్రోణంచ మధుసూదన
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరిసూదన॥

5. గురూనహత్వాహి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్య మపీహలోకే
హత్వార్థకామాంస్తు గురూనిహైవ
భుంజీయభోగాన్ రుధిర ప్రదిగ్ధాన్॥

6. నచైతద్విద్మః కతరన్నో గరీయో
యద్వాజయేమ యదివానోజయేయుః

యానేవ హత్వా న జిజీవిషామః
తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః ॥

7. కార్పణ్య దోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసంమూఢచేతాః
యచ్ఛ్రేయః స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధిమాం త్వాం ప్రపన్నం॥

8. నహి ప్రపశ్యామి మ మాపనుద్యాత్
యచ్ఛోక ముచ్ఛోషణమి ంద్రియాణామ్
అవాప్య భూమా వసపత్న మృద్ధమ్
రాజ్యం సురాణా మపిచాధిపత్యమ్ ॥

సంజయ ఉవాచ :—

9. ఏవ ముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః
నయోత్స్య ఇతి గోవింద ముక్త్వా తూష్ణీం బభూవహ॥

10. తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత
సేనయో రుభయోర్మధ్యే విషీదంత మిదం వచః॥

శ్రీ భగవానువాచ :—

11. అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాం శ్చభాషసే
గతాసూ నగతాసూంశ్చ నానుశోచంతి పండితాః ॥

12. నత్వే వాహం జాతు నాసం, నత్వం నేమే జనాధిపాః
నచైవ నభవిష్యామః సర్వేవయ మతః పరమ్॥

13. దేహినోఽస్మిన్ యథాదేహే కౌమారం యౌవనం జరా
తథా దేహాంతరప్రాప్తి ర్ధీర స్తత్ర నముహ్యతి॥

14. మాత్రా స్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణ సుఖదుఃఖదా
ఆగమాపాయినోఽ నిత్యా స్తాంస్తితిక్షస్వ భారత॥

15. యం హి నవ్యథయం త్యేతే పురుషం పురుషర్షభ
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే॥

16. నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః
ఉభయో రపి దృష్టోఽ న్తస్త్వనయో స్తత్త్వ దర్శిభిః

17. అవినాశి తు తద్విద్ధియేన సర్వమిదం తతమ్
వినాశ మవ్యయ స్యాస్య న కశ్చిత్ కర్తుమర్హతి॥

18. అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తాః శరీరిణః
అనాశినోఽ ప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వభారత॥

19. య ఏనం వేత్తిహంతారం యశ్చైనం మన్యతే హతమ్
ఉభౌ తౌ నవిజానీతో నాయం హంతి నహన్యతే॥

20. న జాయతే మ్రియతే వా కదాచి న్నాయం భూత్వాఽభవితా
వా న భూయః
అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో నహన్యతే హన్యమానే శరీరే॥

21. వేదావినాశినం నిత్యం య ఏన మజమవ్యయం
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతి కం॥

22. వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ॥

23. నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః
న చైనం క్లేదయం త్యాపో నశోషయతి మారుతః॥

శ్రీమద్భగవద్గీతా పఠనము

24. అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచ
నిత్య స్సర్వగత స్థాణు రచలోఽయం సనాతనః॥

25. అవ్యక్తోఽయ మచింత్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే
తస్మా దేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి॥

26. అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతం
తథాపి త్వం మహాబాహో నైవం శోచితు మర్హసి॥

27. జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ
తస్మా దపరిహార్యేఽర్థే నత్వం శోచితు మర్హసి॥

28. అవ్యక్తాదీని భూతాని వ్యక్త మధ్యాని భారత
అవ్యక్త నిధనా న్యేవ తత్రకా పరిదేవనా॥

29. ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చిదేనం ఆశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః
ఆశ్చర్యవ చ్చైన మన్యః శృణోతి శ్రుత్వాప్యేనం వేద న చైవకశ్చిత్

30. దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్యభారత
తస్మా త్సర్వాణి భూతాని నత్వం శోచితు మర్హసి.

31. స్వధర్మ మపి చావేక్ష్య నవికంపితు మర్హసి
ధర్మ్యాద్ధియుద్ధా చ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య నవిద్యతే॥

32. యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతం
సుఖినః క్షత్రియాః పార్థ లభంతే యుద్ధ మీదృశం

33. అథచే త్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి
తతః స్వధర్మం కీర్తిం చ హిత్వాపాప మవాప్స్యసి॥

34. అకీర్తించాపి భూతాని కథయిష్యంతితేఽవ్యయాం
సంభావితస్యచా కీర్తిర్మరణా దతి రిచ్యతే॥

శ్లో.35. భయాద్రణా దుపరతం మన్యంతే త్వాం మహారథాః
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్॥

36. అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యంతి తవాహితాః
నిందతస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిం॥

37. హతోవా ప్రాప్స్యసి స్వర్గం జిత్వావా భోక్ష్యసే మహీం
తస్మా దుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః॥

38. సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి॥

39. ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు,
బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబంధం ప్రహాస్యసి॥

40. నేహాభి క్రమ నాశోఽస్తి ప్రత్యవాయో నవిద్యతే
స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్॥

41. వ్యవసాయాత్మికాబుద్ధిః ఏకేహ కురునందన
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽ వ్యవసాయినాం॥

42. యా మిమాం పుష్పితాం వాచం ప్రవదం త్యవిపశ్చితః
వేద వాదరతాః పార్థ నాన్య దస్తీ తి వాదినః॥

43. కామాత్మానః స్వర్గ పరా జన్మకర్మ ఫలప్రదాం
క్రియావిశేష బహుళాం భోగైశ్వర్య గతిం ప్రతి॥

44. భోగైశ్వర్య ప్రసక్తానాం త యాపహృత చేతసామ్
వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌన విధీయతే॥

45. త్రైగుణ్య విషయావేదా నిస్త్రైగుణ్యో భవార్జున
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥

శ్రీమద్భగవద్గీతా పఠనము

46. యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే
తావా న్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥

47. కర్మణ్యే వాధికార స్తే మాఫలేషు కదాచన
మా కర్మ ఫలహేతు ర్భూర్మాతే సంగోఽ స్త్వకర్మణి॥

48. యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥

49. దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః॥

50. బుద్ధియుక్తో జహా తీహ ఉభే సుకృత దుష్కృతే
తస్మా ద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలం॥

51. కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః
జన్మబంధ వినిర్ముక్తాః పదం గచ్ఛం త్యనామయం॥

52. యదాతే మోహకలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి
తదా గం తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్యచ॥

53. శ్రుతి విప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా
సమాధా వచలా బుద్ధిః తదా యోగ మవాప్స్యసి॥

అర్జున ఉవాచ :—

శ్లో.54. స్థిత ప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ
స్థితధీః కిం ప్రభాషేత కి మాసీత వ్రజేత కిం॥

భగవానువాచ :—

శ్లో.55. ప్రజహాతి యదాకామా న్సర్వా న్పార్థ మనోగతాన్
ఆత్మన్యే వాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే॥

56. దుఃఖే ష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః
వీతరాగ భయ క్రోధః స్థితధీ ర్మునిరుచ్యతే॥

శ్రీ మద్భగవద్గీతా పఠనము.

57. యః సర్వత్రానభిస్నేహః తత్తత్ప్రాప్య శుభాశుభం
నాభి నందతి నద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥

58. యదా సంహరతే చాయం కూర్మోఽంగానీవ సర్వశః
ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥

59. విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే॥

60. యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః॥

61. తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః
వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥

62. ధ్యాయతో విషయాన్పుంసః సంగస్తేషూపజాయతే
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే॥

63. క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః
స్మృతి భ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి॥

64. రాగ ద్వేష వియుక్తైస్తు విషయా నింద్రియై శ్చరన్
ఆత్మ వశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి॥

65. ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే
ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే॥

66. నాస్తి బుద్ధి రయుక్తస్య నచాయుక్తస్య భావనా
న చా భావయతః శాంతి రశాంతస్య కుతః సుఖమ్॥

67. ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽను విధీయతే
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివాంభసి॥

68. తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః
ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥

69. యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః॥

70. ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం సముద్ర మాపః ప్రవిశంతి యద్వత్
తద్వత్కామా యం ప్రవిశంతి సర్వే
సశాంతి మాప్నోతి న కామకామీ॥

71. విహాయకామా న్యః సర్వా న్పుమాం శ్చరతి నిఃస్పృహః
నిర్మమో నిరహంకారః సశాంతి మధిగచ్ఛతి॥

72. ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి
స్థిత్వాఽస్యా మంతకాలేఽపి బ్రహ్మ నిర్వాణ మృచ్ఛతి॥

ఇతి శ్రీమద్భగవద్గీతాసు, ఉపనిషత్సు,
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే
సాంఖ్యయోగో నామ ద్వితీయోఽధ్యాయః.
ఓం శ్రీకృష్ణార్పణమస్తు.

ఓం నమోభగవతే వాసుదేవాయ

# శ్రీమద్భగవద్గీతా

## తృతీయోఽధ్యాయః—కర్మయోగః

అర్జున ఉవాచ :—

శ్లో.1. జ్యాయసీ చే త్కర్మణ స్తే మతాబుద్ధి ర్జనార్దన
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ॥

2. వ్యామి శ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహ యసీవమే
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహ మాప్నుయాం॥

## శ్రీ మద్భగవద్గీతా పఠనము.

శ్రీభగవానువాచ :—

శ్లో.3. లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం॥

4. న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే
న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధి గచ్ఛతి॥

5. నహి కశ్చిత్ క్షణ మపి జాతు తిష్ఠ త్యకర్మకృత్
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతి జైర్గుణైః

6. కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్
ఇంద్రియార్థా న్విమూఢాత్మా మిథ్యాచారః స ఉచ్యతే॥

7. య స్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున
కర్మేంద్రియైః కర్మయోగ మస క్తః సవిశిష్యతే॥

8. నియతం కురు కర్మత్వం కర్మజ్యాయోహ్య కర్మణః
శరీర యాత్రాపి చ తే నప్రసిద్ధ్యే దకర్మణః॥

9. యజ్ఞార్థా త్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః
తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగః సమాచర॥

10. సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః
అనేన ప్రసవిష్యధ్వ మేషవోఽస్త్విష్ట కామధుక్॥

11. దేవా న్భావయ తానేన తేదేవా భావయంతువః
పరస్పరం భావయంతః శ్రేయః పర మవాప్స్యథ॥

12. ఇష్టా న్భోగాన్హి వోదేవా దాస్యంతే యజ్ఞభావితాః
తై ర్దత్తా నప్రదా యైభ్యోయో భుంక్తే స్తేన ఏవ సః॥

13. యజ్ఞ శిష్టాశినః సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః
భుంజతే తే త్వఘం పాపా యే పచం చాత్మకారణాత్॥

14. అన్నా ద్భవంతి భూతాని పర్జన్యా దన్న సంభవః
యజ్ఞా ద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః॥

15. కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవం
తస్మా త్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితం॥

16. ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః
అఘాయు రింద్రియా రామో మోఘం పార్థ స జీవతి॥

17. యస్త్వాత్మ రతి రేవస్యా దాత్మతృప్తశ్చ మానవః
ఆత్మ న్యేవచ సంతుష్టః తస్య కార్యం నవిద్యతే॥

18. నైవ తస్య కృతే నార్థో నాకృతేనేహ కశ్చన
న చాస్య సర్వభూతేషు కశ్చి దర్థవ్యపాశ్రయః॥

19. తస్మా దసక్తః సతతం కార్యం కర్మ సమాచర
అసక్తో హ్యాచరన్కర్మ పరమాప్నోతి పూరుషః॥

20. కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకా దయః
లోకసంగ్రహ మేవాపి సంపశ్య న్కర్తుమర్హసి॥

21. యద్య దాచరతి శ్రేష్ఠః తత్తదే వేతరో జనః
స యత్ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే॥

22. నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి॥

23. యదిహ్యహం న వర్తేయం జాతుకర్మణ్యతంద్రితః
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః॥

24. ఉత్సీదేయు రిమే లోకా న కుర్యాం కర్మచేదహం
సంకరస్య చ కర్తాస్యా ముపహన్యా మిమాః ప్రజాః॥

## శ్రీమద్భగవద్గీతా పఠనము

25. సక్తాః కర్మణ్య విద్వాంసో యథా కుర్వంతి భారత
కుర్యా ద్విద్వాం స్తథాఽసక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహాం:

26. నబుద్ధిభేదం జనయేత్ అజ్ఞానాం కర్మసంగినాం
యోజయే త్సర్వకర్మాణి విద్వాన్యుక్తః సమాచరన్॥

27. ప్రకృతేః క్రియ మాణాని గుణైః కర్మాణి సర్వశః
అహంకార విమూఢాత్మా కర్తాహ మితి మన్యతే॥

28. తత్త్వ విత్తు మహాబాహో గుణకర్మ విభాగయోః
గుణాగుణేషు వర్తంత ఇతిమత్వా న సజ్జతే॥

29. ప్రకృతేర్గుణ సంమూఢాః సజ్జంతే గుణకర్మసు
తాన కృత్స్న విదోమందా న్కృత్స్న విన్న విచాలయేత్॥

30. మయిసర్వాణి కర్మాణి సన్న్యస్యా ధ్యాత్మ చేతసా
నిరాశీః నిర్మమో భూత్వా యుధ్యస్వ విగత జ్వరః॥

31. యేమే మత మిదం నిత్య మనుతిష్టంతి మానవాః
శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేపి కర్మభిః

32. యే త్వేత దభ్యసూయంతో నానుతిష్ఠంతి మేమతం
సర్వ జ్ఞానవిమూఢాం స్తా న్విద్ధి నష్టా నచేతసః॥

33. సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్ జ్ఞానవానపి
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి॥

34. ఇంద్రియ స్యేంద్రియ స్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితా
తయో ర్నవశ మాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపంథినా॥

35. శ్రేయా న్స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥

## శ్రీమద్భగవద్గీతా పఠనము

అర్జున ఉవాచ :—

శ్లో.౩౬.అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః॥

శ్రీభగవానువాచ :—

37. కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణం॥

౩౮. ధూమేనావ్రియతే వహ్ని ర్యథాదర్శో మలేన చ
యథోల్బే నావృతో గర్భ స్తథా తేనేద మావృతం॥

౩9. ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా
కామరూపేణ కౌంతేయ దుష్పూరేణా నలేన చ॥

40. ఇంద్రియాణి మనోబుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే
ఏతై ర్విమోహయ త్యేష జ్ఞానమావృత్య దేహినం॥

41. తస్మా త్త్వమింద్రియా ణ్యాదౌ నియమ్య భరతర్షభ
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞాన విజ్ఞాన నాశనమ్॥

42. ఇంద్రియాణి పరాణ్యాహుః ఇంద్రియేభ్యః పరం మనః
మనసస్తు పరాబుద్ధిర్యో బుద్ధేః పరతస్తుసః॥

4౩. ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదం॥

ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే
కర్మయోగోనామ తృతీయోఽధ్యాయః

శ్రీకృష్ణార్పణమస్తు.

ఓం నమో భగవతే వాసుదేవాయ

# శ్రీమద్భగవద్గీతా

## చతుర్థోఽధ్యాయః జ్ఞానయోగః

శ్రీ భగవానువాచ :-

శ్లో. 1 ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహమవ్యయమ్
వివస్వాన్ మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్.

2. ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః
సకాలే నేహ మహతా యోగోనష్టః పరంతప

3 స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః
భక్తోఽసిమే సఖాచేతి రహస్యం హ్యేతదుత్తమం.

అర్జున ఉవాచ :—

4 అపరంభవతో జన్మ పరంజన్మ వివస్వతః
కథమేత ద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి.

శ్రీభగవానువాచ :—

5 బహూనిమే వ్యతీతాని జన్మాని తవచార్జున
తాన్యహం వేద సర్వాణి నత్వం వేత్థపరంతప.

6 అజోఽపి స న్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపిసన్
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా

7 యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య త దాత్మానం సృజామ్యహం

8 పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే.

9 జన్మకర్మచ మే దివ్యం ఏవం యోవేత్తి తత్త్వతః
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతిమామేతి సోఽర్జున !

10 వీతరాగ భయక్రోధా మన్మయా మా ముపాశ్రితాః
బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః

11 యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థసర్వశః

12 కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః
క్షిప్రం హి మానుషేలోకే సిద్ధిర్భవతి కర్మజా.

13 చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తార మవ్యయం.

14 నమాం కర్మాణి లింపంతి నమే కర్మఫలే స్పృహా
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్నసబధ్యతే.

15 ఏవం జ్ఞాత్వా కృతంకర్మ పూర్వైరపి ముముక్షుభిః
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరంకృతం.

16 కింకర్మ కి మకర్మేతి కవయోప్యత్ర మోహితాః
తత్తేకర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్.

17 కర్మణోహ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యంచ వికర్మణః
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణోగతిః

18 కర్మ ణ్యకర్మ యః పశ్యే దకర్మణిచ కర్మయః
స బుద్ధిమా న్మనుష్యేషు సయుక్తః కృత్స్నకర్మకృత్.

19 యస్య సర్వే సమారంభాః కామసంకల్ప వర్జితాః
జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం తమాహుః పండితంబుధాః

20 త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తోనిరాశ్రయః
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతిసః

21 నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వ పరిగ్రహః
శారీరం కేవలం కర్మకుర్వ న్నాప్నోతి కిల్బిషం.

22 యదృచ్ఛాలాభ సంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః
సమః సిద్ధా వసిద్ధౌచ కృత్వాపి న నిబధ్యతే.

23 గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థిత చేతసః
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే.

24 బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతం
బ్రహ్మైవ తేనగంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా.

25 దైవమే వాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే
బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞేనై వోపజుహ్వతి.

26 శ్రోత్రాదీ నీంద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి
శబ్దాదీ న్విషయా నన్య ఇంద్రియాగ్నిషు జుహ్వతి.

27 సర్వాణీంద్రియ కర్మాణి ప్రాణకర్మాణి చాపరే
ఆత్మ సంయమ యోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే.

28 ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాపరే
స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః

29 అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాపరే
ప్రాణాపాన గతీరుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః

30 అపరే నియతాహారాః ప్రాణాన్ప్రాణేషు జుహ్వతి
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపిత కల్మషాః

31 యజ్ఞశిష్టామృతభుజో యాంతిబ్రహ్మ సనాతనం
నా యంలోకోఽస్త్య యజ్ఞస్య కుతోఽన్యః కురుస త్తమ.

32 ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణోముఖే
కర్మజా న్విద్ధితా న్సర్వా నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే.

33 శ్రేయా న్ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే.

34 తద్విద్ధిః ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞాని న స్తత్త్వదర్శినః

35 యజ్జ్ఞాత్వా నపునర్మోహ మేవం యాస్యసి పాండవ
యేన భూతా న్యశేషేణ ద్రక్ష్య స్యాత్మన్యథో మయి.

36 అపి చే దసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః
సర్వం జ్ఞానప్లవే నైవ వృజినం సంతరిష్యసి.

37 యథైధాంసి సమిద్ధోఽగ్నిః భస్మసాత్కురుతేఽర్జున
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా.

38 నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే
త త్స్వయం యోగ సంసిద్ధః కాలేనాత్మని విందతి.

39 శ్రద్ధావాం ల్లభతే జ్ఞానం తత్పరః సంయతేంద్రియః
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరే ణాధిగచ్ఛతి.

40 అజ్ఞశ్చా శ్రద్ధ ధానశ్చ సంశయాత్మా వినశ్యతి
నా యం లోకోఽస్తి నపరో న సుఖం సంశయాత్మనః

41 యోగసన్న్యస్త కర్మాణం జ్ఞాన సంఛిన్న సంశయం
ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ.

42 తస్మా దజ్ఞాన సంభూతం హృత్స్థం జ్ఞానాసి నాత్మనః
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత.

ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
జ్ఞానయోగోనామ చతుర్థోఽధ్యాయః
శ్రీకృష్ణార్పణమస్తు.

—0—

ఓం నమో భగవతే వాసుదేవాయ

# శ్రీమద్భగవద్గీతా

## పంచమోఽధ్యాయః సన్న్యాస యోగః.

అర్జున ఉవాచ :-

శ్లో. 1. సన్న్యాసం కర్మణాం కృష్ణ పున ర్యోగంచ శంససి
యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మే బ్రూహి సునిశ్చితం.

శ్రీభగవానువాచ :-

2 సన్న్యాసః కర్మయోగశ్చ నిఃశ్రేయస కరావుభౌ
తయోస్తు కర్మసన్న్యాసా త్కర్మయోగో విశిష్యతే.

3 జ్ఞేయః స నిత్యసన్న్యాసీ యో నద్వేష్టి నకాంక్షతి
నిర్ద్వంద్వోహి మహాబాహో సుఖం బంధా త్ప్రముచ్యతే.

4 సాంఖ్యయోగా పృథగ్బాలాః ప్రవదంతి న పండితాః
ఏక మప్యాస్థితః సమ్య గుభయో ర్విందతే ఫలం.

5 యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే
ఏకం సాంఖ్యంచ యోగంచ యః పశ్యతి సపశ్యతి.

6 సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః
యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధిగచ్ఛతి.

7 యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః
సర్వ భూతాత్మ భూతాత్మా కుర్వన్నపి న లిప్యతే.

8 నైవకించిత్కరోమీతి యుక్తోమన్యేత తత్త్వవిత్
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్ గచ్ఛన్
స్వపన్ శ్వసన్.

9 ప్రలపన్ విసృజన్ గృహ్ణన్ ఉన్మిషన్ నిమిషన్నపి
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్.

10 బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతియః
లిప్యతే న స పాపేన పద్మపత్ర మివాంభసా.

11 కాయేన మనసా బుద్ధ్యా కేవలైరింద్రియైరపి
యోగినః కర్మకుర్వంతి సంగంత్యక్త్వాత్మశుద్ధయే.

12 యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతిమాప్నోతి నైష్ఠికీం
అయుక్తః కామకారేణ ఫలేసక్తో నిబధ్యతే.

13 సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ
నవద్వారే పురే దేహీ నైవకుర్వన్న కారయన్.

14 న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః
న కర్మఫల సంయోగం స్వభావస్తు ప్రవర్తతే.

15 నాదత్తే కస్యచి త్పాపం న చైవ సుకృతం విభుః
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః

16 జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః
తేషా మాదిత్యవజ్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్.

17 తద్బుద్ధయ స్తదాత్మానః. తన్నిష్ఠా స్తత్పరాయణాః
గచ్ఛంత్య పునరావృత్తిం జ్ఞాననిర్ధూత కల్మషాః.

18 విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని
శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః

19 ఇహైవతైర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణితే స్థితాః

20 న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్యనోద్విజేత్ప్రాప్యచా
ప్రియం
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణిస్థితః

21 బాహ్యస్పర్శే ష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖం
స బ్రహ్మ యోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే.

22 యేహి సంస్పర్శజాభోగా దుఃఖ యోనయ ఏవతే
ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః

23 శక్నోతీహైవ యః సోఢుం ప్రాక్ శరీర విమోక్షణాత్
కామక్రోధోద్భవం వేగం సయుక్తః స సుఖీ నరః

24 యోఽన్తస్సుఖోఽన్తరారామః తథాన్తర్జ్యోతిరేవయః
సయోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి,

25 లభంతే బ్రహ్మనిర్వాణం ఋషయః క్షీణకల్మషాః
ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితేరతాః

26 కామక్రోధ వియుక్తానాం యతీనాం యతచేతసాం
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనాం

27 స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాం శ్చక్షుశ్చైవాంతరే భ్రువోః
ప్రాణాపానౌ సమౌకృత్వా నాసాభ్యంతరచారిణౌ

28 యతేంద్రియ మనోబుద్ధిః ముని ర్మోక్షపరాయణః
విగతేచ్ఛా భయక్రోధోయః సదాముక్త ఏవ సః

29 భోక్తారం యజ్ఞతపసాం సర్వలోక మహేశ్వరం
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వామాంశాంతి మృచ్ఛతి

ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
సన్న్యాసయోగోనామ పంచమోఽధ్యాయః.
శ్రీ కృష్ణార్పణమస్తు.

—0—

ఓం నమో భగవతే వాసుదేవాయ

# శ్రీ మ ద్భ గ వ ద్గీ తా

## షష్ఠోఽధ్యాయః ఆత్మసంయమయోగః

శ్రీ భగవానువాచ :-

శ్లో. 1. అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతియః
స సన్న్యాసీచ యోగీచ ననిరగ్ని ర్నచాక్రియః

2 యం సన్న్యాస మితి ప్రాహుః యోగం తం విద్ధి పాండవ
న హ్యసన్న్యస్త సంకల్పో యోగీ భవతి కశ్చన

3 ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మకారణ ముచ్యతే
యోగారూఢస్యతస్యైవ శమః కారణ ముచ్యతే.

4 యదాహి నేంద్రియార్థేషు నకర్మస్వనుసజ్జ్యతే
సర్వ సంకల్ప సన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే

5 ఉద్ధరే దాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్
ఆత్మైవ హ్యాత్మనో బంధుః ఆత్మైవ రిపురాత్మనః

6 బంధు రాత్మాత్మన స్తస్య యేనాత్మై వాత్మ నాజితః
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్.

7 జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః
శీతోష్ణ సుఖదుఃఖేషు తథా మానాపమానయోః

8 జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః

9. సుహృన్మిత్రా ర్యుదాసీన మధ్యస్థ ద్వేష్యబంధుషు
సాధుష్వపిచ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే.

10. యోగీ యుంజీత సతతం ఆత్మానం రహసిస్థితః
ఏకాకీ య తచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః

11. శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః
నా త్యుచ్ఛ్రితం నాతి నీచం చేలాజిన కుశో త్తరం

12. తత్రై కాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియ క్రియః
ఉపవిశ్యాసనే యుంజ్యా ద్యోగ మాత్మవిశుద్ధయే

13. సమం కాయ శిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్

14. ప్రశాంతాత్మా విగతభీః బ్రహ్మచారివ్రతేస్థితః
మనః సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః

15. యుంజన్నేవం సదాత్మానం యోగీ నియతమానస
శాంతిం నిర్వాణ పరమాం మత్సంస్థా మధిగచ్ఛతి.

16. నాత్య శ్నతస్తు యోగోఽస్తి నచైకాంత మనశ్నతః
నచాతి స్వప్న శీలస్య జాగ్రతోనైవ చార్జున

17. యుక్తాహార విహారస్య యుక్తచేష్టస్య కర్మసు
యుక్త స్వప్నావ బోధస్య యోగో భవతి దుఃఖహా

18. యదా వినియతం చిత్తం ఆత్మన్యేవావ తిష్ఠతే
నిస్ప్రహః సర్వకామేభ్యః యుక్త ఇత్యుచ్యతే తదా

19. యథా దీపో నివాతస్థో నేంగతే సోపమాస్మృతా
యోగినో యతచిత్తస్య యుంజతో యోగమాత్మనః

20. యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా
యత్ర చైవాత్మ నాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి

21. సుఖ మాత్యంతికం యత్తద్ బుద్ధిగ్రాహ్యమతీంద్రియం
వేత్తియత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః

22. యంలబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే

23. తం విద్యా దుఃఖసంయోగ వియోగం యోగసంజ్ఞితం
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా

24. సంకల్ప ప్రభవా న్కామాం స్త్యక్త్వా సర్వా న శేషతః
మన సైవేంద్రియగ్రామం వినియమ్య సమంతతః

25. శనైః శనై రుపరమేత్ బుద్ధ్యాధృతి గృహీతయా
ఆత్మ సంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్

26. యతో యతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరం
తత స్తతో నియమ్యైత దాత్మన్యేవ వశంనయేత్

27. ప్రశాంతమనసం హ్యేవం యోగినం సుఖము త్తమం
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూత మకల్మషం

28. యుంజన్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః
సుఖేన బ్రహ్మ సంస్పర్శ మత్యంతం సుఖమశ్నుతే

29. సర్వభూతస్థ మాత్మానం సర్వభూతానిచాత్మని
ఈ క్షతేయోగ యుక్తాత్మా సర్వత్ర సమదర్శనః

30. యోమాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయిపశ్యతి
తస్యాహం న ప్రణశ్యామి సచమేన ప్రణశ్యతి

31. సర్వభూతస్థితం యోమాం భజత్యేకత్వ మాస్థితః
సర్వథా వర్తమానోఽపి సయోగీ మయి వర్తతే

32. ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున
సుఖం వా యదివా దుఃఖం సయోగీ పరమోమతః

అర్జున ఉవాచ :—

33. యోఽయం యోగస్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన
ఏ తస్యాహం న పశ్యామి చంచలత్వాత్థ్సితిం స్థిరాం

34. చంచలం హి మనః కృష్ణ ప్రమాధి బలవద్దృఢం
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరం

శ్రీభగవానువాచ :—

35. అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలం
అభ్యాసే నతు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే

36. అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతిమేమతిః
వస్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః

అర్జున ఉవాచ :-

37. అయతిః శ్రద్ధయో పేతో యోగాచ్చలిత మానసః
అప్రాప్య యోగ సంసిద్ధిం కాంగతిం కృష్ణ గచ్ఛతి.

38. కచ్చిన్నోభయ విభ్రష్ట శ్ఛిన్నాభ్రమివ నశ్యతి
అప్రతిష్ఠో మహాబాహోవిమూఢో బ్రహ్మణః పథి

39. ఏతన్మే సంశయం కృష్ణ ఛేత్తు మర్హస్యశేషతః
త్వదన్యః సంశయ స్యాస్య ఛేత్తాన హ్యుప పద్యతే

శ్రీభగవానువాచ :-

40. పార్థ నై వేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే
నహి కల్యాణకృ త్కశ్చి ద్దుర్గతిం తాతగచ్ఛతి.

41. ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీః సమాః
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే

42. అథవా యోగినా మేవ కులే భవతి ధీమతాం
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మయ దీ దృశమ్

43. తత్రతం బుద్ధి సంయోగం లభతే పౌర్వదేహికం
యతతేచ తతో భూయః సంసిద్ధౌ కురునందన

44. పూర్వాభ్యాసేనతే నైవ హ్రియతే హ్యవశోఽపిసః
జిజ్ఞాసు రపి యోగస్య శబ్ద బహ్మాతివర్తతే

45. ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః
అనేకజన్మ సంసిద్ధస్తతోయాతి పరాంగతిం

46. తపస్విభ్యోధికో యోగీ జ్ఞానిభ్యోఽపిమతోఽధికః
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున

47. యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా
శ్రద్ధావాన్భజతే యోమాం సమేయుక్తతమోమతః

ఇతి శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే
ఆత్మసంయమయోగోనామ షష్ఠోధ్యాయః
శ్రీకృష్ణార్పణమస్తు.

శ్రీకృష్ణ పరమాత్మనే నమః

# శ్రీమద్భగవద్గీతా మననము

## ఉపక్రమణము

బ్రతుకులో ఎన్నో తమాషాలు - బాధలు, సుఖాలు, అన్నీ అనుభవిస్తూనే వుంటాం.

కాని బాధ అనుభవించేటప్పుడు సుఖం వుండదు అనిపిస్తుంది. సుఖం అనుభవించేటప్పుడు బాధ సంగతి తెలియదు. ఈ సుఖం, దుఃఖం రెండూ ఒకదానికొకటి వ్యతిరేకం.

అయితే సుఖంగాని, దుఃఖంగాని అనుభవించటంలో తటస్థంగా వుండే సమయాలు కొన్ని వుంటాయి. ఈ సమయాలుచాలా శుభదమైన సమయాలు. సుఖంగాని, దుఃఖంగాని వుండని సమయాలవి. ఆ సమయాల్లో ఎవరైనా చెప్పే మాటల్లోని అంతర్యం యథాతథంగా గ్రహించగలం. పుస్తకాలు చదివి అనిర్వచనీయమైన తాదాత్మ్యంతో ఆనందించగలం. శిల్పం దర్శింపగలం. ఈ పనిచేస్తే ఈఫలం వస్తుందని చేయముగాక అప్పుడు.

ఆ క్షణానికి మన మనసున కున్న సంస్కారానికి అనుగుణ్యమైన పనిచేస్తాము. ఈ సమయాల్లోనే మనం మనసునే పదును బెట్టి ముందుమార్గాన్ని తీర్చిదిద్దటానికి సిద్ధంచేయగలిగేది.

ఈ తటస్థ సమయాలు శుభేచ్ఛా సమయాలు. ముందు మార్గాన్ని సుగమం చేయటానికి వీలయినవిగదా మరి ! అందుకనే శుభేచ్ఛా సమయాలనటం.

ముందు రావలసిన శుభంకోసం ప్రణాళికలను ఆలోచిస్తూ కాలం గడపటంలో కూడా రెండుమార్గాలున్నాయి. ఒకటి శ్రేయోమార్గం, రెండవది ప్రేయోమార్గము. ఈ రెండిలో దేనిని అనుసరిం

చాలి అనే నిర్ణయం మనసుది. శ్రేయోమార్గం మంచిదనీ, శుభమైన దనీ ప్రేయోమార్గం కోరదగిందికాదనీ దుఃఖదమైనదనీ ఉపనిషత్తులు చెప్తవి.

శ్రేయోమార్గమేదో చెప్పే ఉద్గ్రంథాలు అనేకమున్నవి. చదవాలి లేదా పెద్దలవల్ల ఆ విషయాలు వినాలి. అవి తత్త్వాన్ని విశదీకరించి చెప్పే గ్రంథాలు అని తెలియాలి. ఉపనిషత్తులు బ్రహ్మ సూత్రాలు భగవద్గీత అనేవి ఈ సందర్భంలో ప్రధానమైనగ్రంథాలు. వీటిని అన్నిటినీ ఉద్దేశించి ప్రస్థానత్రయమని వ్యవహరిస్తారు. వీటి అన్నిటిలో మనిషి బ్రతుకుసంగతి చెప్పేది అనిపిస్తుంది భగవద్గీత. ఈ గ్రంథాలను చదవాలి, వినాలి, మననం చెయ్యాలి.

ఇక ప్రేయోమార్గమనేది ఏది? ఇది కార్యకారణ సంబంధం మీద ఆధారపడి వుంటుంది. చుట్టూ నున్న వస్తువులు మనుషులు మాటలు వంటి వాటి నన్నిటినీ అనుభవిస్తూ క్షణక్షణానికీ తన తెలివి నుపయోగించి వ్యక్తి లోని మనసు కనుగొనే మార్గమిది. ఇంద్రియ విషయాలమీద ఆధారపడి వుంటుందని అనవచ్చు. ఇంద్రియ విషయా లంటే వినటంద్వారా, స్పృశించటద్వారా చూడటం ద్వారా రుచి చూడటంద్వారా వాసన చూడటంద్వారా అనుభవింపబడేవి.

మరి శ్రేయోమార్గము ఈ విషయాల మీద ఆధారపడక పోతే వేటిమీద ఆధారపడివుంటుంది అని ప్రశ్న. ఇంద్రియాతీతమైన విషయాలమీద ఆధారపడివుంటుంది. ఇంద్రియాతీతమైన విషయా లంటే ఇంద్రియాలద్వారా మాత్రమే ఎఱుగబడేవికాదని అర్థము.

ఒక మహారాజు ఎంతో ధర్మంగా పరిపాలించాడు రాజ్యాన్ని. అది తెలిస్తే అ విషయం వింటే మనకు సంతోషము. ఎందుకని? అతడి ధర్మం యథాతథంగా మనకు సంతోషాన్నిస్తుంది. ఇలా ధర్మం పాలించినాడు అనే విషయం తెలియటం 'మనసు' అనే అంతరింద్రియ విషయం కాదా? మనసును ఉపయోగిస్తూనే వున్నాంకదా అని సందే హం. మనసు పనిచేయక తప్పదు. శ్రేయో మార్గంలోనూ ప్రేయో మార్గంలోనూ కూడ. అంతకంటె ముఖ్యమైన విషయం, మనసే

నిర్ణయించాలి ఈ శ్రేయోమార్గాన్ని అనుసరించాలా ప్రేయో మార్గాన్నే అనుసరించాలా అనే సమస్యను.

ఈ మనసుకు రెండు అంతస్థు లున్నాయి. ఈ విషయంలో యథాతథంగా సంతోషించటం కద్దు దర్మపరిపాలనం చూసి-అది ఒక రకం. ఇంకొకటి స్వార్థంతో కూడుకొన్నది. మన ప్రభువు మనను బాగా పరిపాలిస్తున్నాడు అనుకొందాం. ఈ "మన" "మనను" అనేది ప్రధానమైవుంది ఇక్కడ. దీని వల్లనే ఈ రెండు రకాలుగా కావటం యీ మనసు, మొదటి రకం మనసు వల్ల కలిగే ఆనందం ఇంద్రియాతీతమైంది-అని ఒక విధంగా-అనవచ్చు. ఈ రెండవ రకమైన మనసు వట్టి అంతరింద్రియంగా ఉండిన భాగం-అంటే 'స్వ' కు ఉపయోగించటానికి ఎలా ఇతర ఇంద్రియాలు పనిచేస్తవో అలాగే పనిచేసే భాగంగా వుంటుంది అని అర్థం. ఈ భాగం వల్ల కలిగే ఆనందం-అందుకనే—అది ఇంద్రియాధిభూత మైనదనటం.

ఉదాహరణకు శ్రీరాముడు పూర్వకాలంలోని యాతడు. అతడు అప్పుడెంతో బాగా రాజ్యం చేసి రామరాజ్య మనిపించుకొన్నాడు. శ్రీరాముడు అందుచేత మనకు ప్రియుడు. అతడి పరిపాలనం మన ఇంద్రియాలకు పుష్టి నిచ్చేది కాకపోయినా అది మనసునకు ఆనందాన్నిస్తున్న మాట కాదనటానికి లేదు. ఇలాటివి అతీంద్రియ విషయాల వైపుకు తీసికొని పోగలిగిన ఊహాలు.

అలాగే ఒకడు సమయం తప్పకుండా తన ఆఫీసునకు వెళ్ళి తన పని తాను సమర్థుడై చేసికొంటూ వుంటాడు. అతడిని గురించి ఆలోచనల వల్ల మనసు సంతోషం ఏర్పడుతుంది, అసమర్థుడు, అధర్మపరుడూ అయిన వానిని జ్ఞాపకం చేసికొనటం వల్ల దుఃఖం అనటం సరికాదు కాని- ఒకానొక జుగుప్స కలుగుతుంది. ఈ సంతోషం ఈ జుగుప్సలు స్వార్థానికి చెందినవి కావు. అందుకని ఇంద్రియ విషయములు కావని తెలియాలి.

స్థూలంగా ఏమని పిస్తుందంటే స్వార్థపూర్వకమైన మన సుతో చేసిన పని ప్రేయోమార్గమైనదనీ నిస్వార్థ పరమైన మన సుతో చేసిన పని శ్రేయోమార్గమైనదనీ అనుకొంటే సరిగా అర్థమవుతుంది అనిపిస్తుంది.

కాగా, సుఖంగాని దుఃఖంగాని మనసు నావరించని తటస్థ సమయాల్లో ప్రేయోమార్గమునసరించకుండా శ్రేయోమార్గాన్ని అనుసరించటం కర్తవ్యం అనేది ముఖ్యమైన విషయం. అది చెప్పటానికే ఇన్ని మాటలు చెప్పటమయింది.

పుస్తకాలు అందులోనూ ప్రస్థానత్రయమునకు చెందిన విజ్ఞానపూర్వకమైన పుస్తకాలు చదివితే శ్రేయోమార్గాలను గ్రహించవచ్చు. తటస్థసమయాల్లో లేదా ప్రశాంతసమయాల్లో ఈ పుస్తకాలు చదవటం, ఈ విషయాలు వినటం వల్ల బాగా అర్థం అవుతవి. అంతేకాదు అలా చేస్తూ మనసున కలవాటు చేసినట్లయితే ఈ పుస్తకాలు చదవటంగాని ఈ విషయాలు వినటంగాని వాటిని మననంచేయటంగాని ఆరంభించంగానే మనసులో ఏ లేశమాత్రమైన దుఃఖసంఘర్షణగాని వుంటే అది తొలగిపోతుంది. ఇంద్రియ విషయికమైన సుఖ సంఘర్షణంవున్నా అలాగే తొలగిపోతుంది.

అందుకని సుఖం దుఃఖం, తీవ్రంగా అనుభవించుతున్నప్పుడు కుదరక పోవచ్చు గాని వాటి సంఘర్షణ లేని సమయాలు వృథా చేయక ఇలాంటి పుస్తకాల పఠనం లేదా వాటిలోని విషయాల మననం చేయటం తేలిక. అలా చేయాలి కూడాను. పెద్దలవల్ల వినాలి. వారితో కలిసి తిరగాలి. ఇది శుభేచ్ఛ. పఠనం, శ్రవణం ఇవి సాధనకయిన మార్గాలు. ఈ రెండూ కూడ 'శ్రవణ' మనే సాధన క్రింద చెప్పబడుతవి. ఈ శ్రవణం అనేదాని తరువాతి సాధనం మననం.

మననం అంటే విన్నదీ చదివినదీ యేదో - అది తిరిగి మనసులో మథించి చర్విత చర్వణంచేయటం. ఈ మననం అనే దాంట్లో అదివరకు చదివిందీ విన్నదేగాక వినియుండదగినదేదో కూడ తోస్తూ వుంటుంది. ఎలా తెలుస్తుంది అనవచ్చు! ఎలాగంటె మనసు చాలా

గొప్పది. తనకు ఇంద్రియాల ద్వారా తెలిసిన వాటినే గాక వాటి ద్వారా తెలియని కొన్నిటిని ఊహించి తెలిసికొనగలదు. మనను సంకల్ప వికలాత్మకమైనది గదా మరి !

ఉదాహరణకు లండన్ ఇలాఇలా వుంటుందని చదువుతాము. వింటాము. దానిని ఆధారంగా తీసికొని ఊహిస్తున్నప్పుడు అనేక వివరాలను ఊహిస్తాము. ఆ ఊహాలతో నవలలు కథలు వ్రాస్తుంటాము. ఎలా వ్రాస్తాము ? మనసుకు ఈ శక్తి వుంది గనక వ్రాస్తాము.

ఈ శక్తి మనసుకు వుందిగనకనే శ్రవణం అనే సాధనకంటె మననం అనే సాధన ఉన్నతమైన మెట్టు అని అనిపిస్తుంది. శ్రవణం మననం నిధిధ్యాస లవల్ల, ఆవరణ దోషాలుపోతే అప్పుడు ధ్యానం, ధారణ ఉపరతి సమాధీ అనే మెట్లు పైకి ఎక్కించే మెట్లు వరస ప్రకారం ఎక్కవచ్చు.

మహాత్ములైన కొందరి వద్ద భగవద్గీత విన్నమీదట మననం చేయగా కలిగిన ఊహాలను ఈ పుస్తకములో శ్రీమ ద్భగవద్గీతా మనన మనే పేరుతో కొన్ని వ్రాయటం జరిగింది. శ్రీ వేలూరి సహజానందగారి ముఖంగా విన్న విషయాలు మనసుకు తరణి పెట్టినవనీ-మననంచేస్తే అవి మనసులో స్థిరం చెయ్యవచ్చు ననీ అనిపించింది. ఇలా మననం చేస్తూంటేనే ఎప్పటికో తత్ పదార్థాన్ని బ్రతుకులో దర్శించ గలగటం కలుగుతుందని అనిపిస్తుంది. ముందుగా శ్రీమ ద్భగవద్గీతా పఠనానికిగాను శ్లోకాలు చేర్చి ఆ తరవాత మననం సమకూర్చటమైంది ఈ పుస్తకంలో.

ఓం

నమో భగవతే వాసుదేవాయ

# శ్రీమద్భగవద్గీతా మననము

## మొదటి అధ్యాయము

### విమర్శ కారణంగా అర్జునునకు విచారము

ధృతరాష్ట్రుడు మహారాజు. రాష్ట్రాన్ని పరిపాలిస్తూ ఉండటం ఈయన పని. పాలించడం అంటే ధర్మం పాలించటం అని అర్థం. ధర్మం అంటే ఏమిటి? పరిపాలనలో ఎవరెవరు ఏయే పరిస్థితులలో వుండి ఎలా ప్రవర్తించి సమాజానికి హితాన్ని చేస్తూ ఉండాలో ఆధర్మం. అంటే రాజు రాజుగా, మంత్రి మంత్రిగా, సేనాపతి సేనాపతిగా. తండ్రి తండ్రిగా, సోదరుడు సోదరుడుగా, భర్త భర్తగా, సేవకుడు సేవకుడుగా ఎలా ప్రవర్తన కలిగి ఉండాలో ఆవ్యవహారాన్ని తీర్చిదిద్ది తెలియజెప్పేది ధర్మం. ఇదిమహారాజు నిశ్చయం చేసి నడిపించవలసినట్టిది. దీనిని అమలు జరిపేది మహారాజు—తన రాజ్యంలో.

ఆ ధర్మాన్ని ప్రజలు అనుసరించక పోతే రాజు శిక్షిస్తాడు. తనరాజ్యంలో ధర్మం సరిగా నడప బడుతోందా లేదా అని తెలిసికోవలసినవాడు రాజు. ధ్రుతరాష్ట్రుడు సంజయుని పిలిచి "ధర్మం" ఎలా నడప బడుతున్న దనే విషయం తెలిసికొంటున్నా డిప్పుడు.

శ్రీమ ద్భగవద్గీతను ధ్రుతరాష్ట్ర మహారాజు పరిపాలనలోని కథగా చెప్పినా, అది మానవుడి కథ అనే సంగతి మర్చిపోకూడదు. మానవుడంటె ఎవరు? మానవుడు మనసులోకి రాగానే అతడి శరీరం, కాళ్ళు చేతులూ అవయవాలు అన్నీ స్మరిస్తాం. అంతేకాదు మానవుడంటె మనసు బుద్ధులూకూడ ఉన్నాయి. ఇంకా ప్రాణం, తెలివి, బాధ, రాగం, ద్వేషం, సుఖం,దుఃఖం, కోపం ఇవన్నీ

మానవుడిలో ప్రత్యంగమైన భాగాలే. ఈ మానవుడనేది ఒక రాజ్యం అనీ, ఇవన్నీ అందులో ఉన్న ప్రత్యంగాలనీ అనవచ్చు. రాజ్యాన్ని ధృతరాష్ట్రుడెలా పరిపాలించి ధర్మాన్ని స్థాపించాలో, అలాగే మానవుడనే యీ రాజ్యంలోని భాగాలన్నిటిని తమ తమ ధర్మానుసారం సమ్యగ్ స్థితిలో నడపగలిగిన వాడు ఒకడున్నాడు. ఎవరతడు? అతడు మానవుడే. మానవుడిలోని భాగాల్లో ఒకడే. రాజుమాత్రం రాజ్యంలోనిఒకభాగం కాదూ? అలాగే. ఐతే, ఈ పై చెప్పిన రాజ్యభాగాలకు వాడు చాలా భిన్నమైన వాడు అనేది ముఖ్యమైన విషయం.

మనం పల్కరిస్తే అతడు "నేను" అని సమాధానం చెబుతూ ఉంటాడు. ఈ "నేనే" మానవుడిలో ఉన్న రాజు. అతడే ఈ కర చరణాది అవయవాల ప్రవృత్తినీ మనోబుద్ధుల చాకచక్యాన్ని అదుపులో పెట్టుకొనేవాడు. ఈ ఇంద్రియాలకంటె మనసూ బుద్ధుల కంటె కూడ పరమయినవాడు.

కాగా—ధృతరాష్ట్రుడు సంజయుని పిలిచి తన రాజ్యంలో జరిగే ధర్మవర్తనం ఎలాగున్నదనే విషయం సంజయునితో ప్రస్తావించుతున్నాడు. అలాగే మానవునిలోని "నేను" అనే రాజు, తనలోని అవయవాలు, వికారాలు. మనసు, బుద్ధి, అన్నీ మంచి స్థితిలో ప్రవర్తిస్తున్నవా లేవా అనే విమర్శనం చేయటం కూడ అవసరం అనేది గమనించాలి.

1. ఇంతకూ ధృతరాష్ట్రుడడిగిన ప్రశ్న యేమని? "మామకాః పాండవాశ్చైవ కిమ కుర్వత" అని. అంటే నాకు సంబంధించిన వాళ్ళూ, ఆ తెల్లటివాళ్ళయిన ధర్మరాజాదులూ ఒకరికొకరు వ్యతిరేకులై యుద్ధం చేయబూని ఏం చేశారు? అని. విమర్శ చేస్తే సరిగ్గా ఇలాంటి సంఘర్షణం మానవునికి తనలో కలుగుతుంటుంది. ముఖ్యంగా మానవుడు విమర్శాత్మకుడై ఉన్న సమయాలలో. అలాంటప్పుడు అతడు తనని తను ఇలాటి సమస్యకు గురి చేసికొని విచారణ చేస్తాడు. ఈ ప్రశ్న విజ్ఞాన విషయాన్నిగూర్చిన ప్రశ్న అనేది జ్ఞాపకం పెట్టుకోతగింది

మానవునిలో సంఘర్షణ మేమిటి— అనచ్చు. ఉంది
ఈ సమాజంలో బ్రతుకుతున్నాం. సమాజంలో అనేకమందిమి
మున్నాం అందరం ఈ సమాజ శ్రేయస్సును కోరుతూఉంటాం
హం లేదు. సమాజ శ్రేయస్సును అంటంలో అందులోని
శ్రేయస్సుఅనే తత్త్వం ఇమిడియే యున్నదిగాక.

కాని సమాజానికి ప్రత్యేక ప్రతిపత్తి ఉన్నది. దేనికంటే
కము? వ్యక్తికంటె ప్రత్యేకము అందులోనిసభ్యునికంటే ప్రత
అంటే-వ్యక్తిలాభము వేరుగా సమాజ లాభము వేరుగా గ
తెలిచుగల మన్నమాట. దేని కది విడివిడిగా ఎల్లప్పుడూ మెదు
వుంటేసమస్య ఉండదుగాక. కాని ఒక్కోసారి ఈ ప్రత్యేక
పత్తులు వ్యతిరేకించి నిలచినవై ఒకే విషయాన్ని గురించే పో
నికి తలబడతవి.

వ్యక్తి తనశ్రేయస్సును చూసుకోవాలంటూ ఉండట
ఒక్కొకప్పుడు ఆశ్రేయస్సు సమాజ శ్రేయస్సునకు వ్యతి
నిలుస్తుండటం కద్దు. ప్రభుత్వోద్యోగి లంచంపుచ్చుకోవటం వా
బ్లాకుమార్కెట్ చేసిడబ్బు దోచటం లాంటివి, ఈ పనులువి మ
దానికి గురిచేయకుండా చేసే వారి ప్రసక్తి మన ఈ భగవద్గీ
నవిషయంలోచేరవదు. అది ప్రభుత్వ పరిపాలనావిషయం. కాని
తలోని సంఘర్షణవంటి సం

ద్ధ సంబంధమయినప్రశ్న,
యిస్తుంది అనేది తెలియాలి

ంగా నావారు అని దుర్యో
ప్రత్యర్థం. "మామకాః"
గా అంటూ ఉండే స్వార్థభూ
ం. నిజానికి దుర్యోధన
టి పాండవులు అని అర్థం.

తెల్లని వాళ్ళని అర్థం. తెల్లటివారనటంలో సత్త్వగుణాత్మకులనే అర్థం చెప్పాలి. వారిలో ఈ "స్వార్థం" ఉండదు. తమకొరకు ఎలాగో పరులకోసం కూడ అలాగే వీరు బ్రతుకుతుండే వారన్నమాట. సమాజ శ్రేయస్సు కోసం వ్యక్తి లాభాలను త్యాగం చేసేవాళ్లు వీరు. ఈ ఇద్దరికీ ఎల్లప్పుడూ సంఘర్షణమే.

2. అంతట దుర్యోధనుడు, సత్త్వగుణ ప్రధానులైన పాండవులు సమాయత్త పరచిన యుద్ధ వ్యూహం చూసి గురువైన ద్రోణాచార్యుని సమీపించి అంటున్నాడు—

3. నీ శిష్యుడే అయిన ధృష్టద్యుమ్నుడు ఆ వ్యూహాన్ని ఎలా రచించాడో చూడు, అని.

'నీ శిష్యుడే అయిన' అనటంలో, అహంకారం, రోషం లేవ గొట్టటం కోసం పలికిన మాటలివి అని తెలుస్తున్నది, మనసూ బుద్ధి ఏకమై ఇంద్రియాలను అనుసరించుతూ ఉంటే అది అహంకారము అంటాము. అంటె, నేను అనేది బుద్ధి మనస్సులతో క్రిందికి దిగి ఇంద్రియాలు అనే ఇరుకు ప్రదేశంలోకి వచ్చి "ఇంతవరకే నేను" అనే భ్రమపడుతూ ఉంటున్నప్పుడు అహంకారం అనుభవిస్తున్నాడు ఆ "నేను" అని చెప్పవచ్చు. అహంకారము అంటె ఈ 'నేను' అనేవాడు 'పరిమితిని'- అంటే— ఆ ఇరుకుతనాన్ని - limitedness ను — అనుభవించటమె – అనేది జ్ఞాపకంపెట్టుకొంటె విషయం బాగా అన్వయం అవుతుంది.

దుర్యోధను డనె మనస్సు గురువైన - బుద్ధి అనె ద్రోణాచార్యుని చేరి 'స్వ' శక్తిని ప్రశంసిస్తూ ఇంద్రియాలకు అనుగుణ్యంగా మాట్లాడి ఈ అహంకారాన్ని (ఈ limitedness ను) ఆపాదింపచేస్తున్నాడు. బుద్ధి నిజానికి నిశ్చయాత్మకమైనది. అంటె-ఇది మంచి—ఇది చెడు అనే నిర్ణయం చేయగలిగినది కాని మనసు రజోగుణంలో మసలుతూ బుద్ధినిచేరి నెమ్మదిగా మెత్తబరచి తనతో ఏకీభవింప జేసికొంటున్నది. సత్త్వగుణులైన పాండవులలోని లోపా

లను చూపుతూ ఉంటుంది, ఇదే అంతస్సంఘర్షణకు కారణం. సత్త్వగుణానికీ రజోగుణానికీ మానవుడిలో ఈ విధమైన సంఘర్షణం కలుగుతూ ఉంటుంది.

అనగా సమాజం కోసం బ్రతకడానికి బదులుగా వ్యక్తి తన కొరకే పనిచేయాలనుకొని సన్మార్గాన్ని రాజ్యం నుంచి త్రోసివేయజూచే స్థితి ఇది.

4-6. దుర్యోధనుడు చెపుతున్నాడు. అక్కడున్న వారిని చూడండి—భీముడు, అర్జునుడు, యుయుధానుడు, విరాటుడు, ద్రుపదుడు, ధృష్టకేతు, చేకితానుడు, కాశీరాజు, పురుజిత్తు, కుంతిభోజుడు, శైబ్యుడు, యుధామన్యుడు, సుభద్ర కొడుకు, ద్రౌపది కొడుకులు వీళ్ళంతా మహారథులు.

7-9. ఇక మనవారి సంగతి. మీ పరిగణన కొరకు చెబుతానుగాక. మీరూ, భీష్ముడూ, కర్ణుడూ, కృపుడూ, అశ్వత్థామ, వికర్ణుడు, సౌమదత్తి, జయద్రథుడు, ఇంకా ఎంతమందో ఉన్నారు. అన్నిటినీమించి వీరంతా "మదర్థే త్యక్త జీవితాః" అంటే "మదర్థం" "త్యక్తజీవులు". నాకొరకు వారి జీవితాలను కూడ త్యజించేవారు. చిత్రమైన విషయం ఒకటుందిక్కడ. ఈ మాటలనే ఇలా చెప్పచ్చు. 'నా' , 'నాది' అనే ఊహకొరకు జీవితాన్నే పోగొట్టుకోగలిగిన పట్టుదలను కలిగినవారు అని అర్థము. స్వార్థం కొరకు జీవితాన్నే వదులుకొనేవారు. వారిచేత "నావి" "నావి" "మావి" అనుకొనబడే ఈ ప్రపంచ వస్తువులే వాళ్ళకు ప్రధానం తమ జీవితాలను ప్రధానమైనవిగా వాళ్లు,భావించరు. జీవితం నశించినా సరె నావి నావిగానే ఉండాలనే వాళ్ళు. చచ్చినా నావి నీకియ్యను అనే పట్టుదల ఉంది వీళ్ళకి. పాండవులకు అదిలేదు. వాళ్లు పరార్థం అనగా సమాజం కోసం పనిచేస్తుంటారు. స్వార్థం ప్రకోపించదక్కడ.

10. అందుకని భీష్మాభిరక్షితమైన బలం అంతులేని పట్టుదలతో కూడుకొని ఉన్నది. భీమాభిరక్షితమైన వారి బలంలో

ఆ పట్టుదల లేదు. అందుచేత వారు తప్పకుండా మనచేత ఓడింప బడుతారు అని ధ్వని.

11. ఇంకా అంటున్నాడు దుర్యోధనుడు. ఇంద్రియాలలో నేత్రమెంత ప్రాధాన్యమైనదో ఈ భీష్ముడు మన సైన్యంలో అంత ప్రాధాన్యమైనవాడు. అతడు మనకోసం మాత్రమే దృష్టినిల్పి యుద్ధం చేస్తే ఫరవాలేదు. కాని ఈయనకు అప్పుడప్పుడూ సాత్త్వికలక్షణాలు పుట్టుతూ వుంటవి. శిఖండిలాంటి ప్రతిబంధకాలు వస్తూ ఉంటవి. (అంబకు తనవల్ల ఎప్పుడో బాధ కలిగినందుకు భీష్ముడు కించపడుతున్నాడు, అందుకని ఆ దయ కారణంగా తనకు హాని కలిగినా సరె తాను ఆమెకు వ్యతిరేకంగా యుద్ధం చేయడు. ఈ సంగతి యథాతథంగా అప్పుడు దుర్యోధనునికి తెలుసునో తెలీదో మన కక్కర లేదు కాని) దుర్యోధనుని భయంమాత్రం, ఎదుటివాళ్ళమీద దయకలిగి యుద్ధం సరిగా చేయడేమోననే. ఎందుకంటె భీష్ముడు అలా పరార్థం కోసం పాటుపడుతుండడం నిజం. అందుకని అంటున్నాడు.—అలాంటి ప్రమాదం కలగకుండా అతడిని మనం రక్షించుకోవాలి అని. మీమీ స్థానాల్లో ఉండి ఆయనను రక్షించ వలసింది అన్నాడు

12–13. భీష్ముడు ఇదివిని 'మనసు' అయిన దుర్యోధనుని కోసం——అతడి సంతృప్తి కోసం- తన జబ్బ తాను చరచి, శంఖం పూరించాడు. ఇంద్రియాలు ఆవిధంగా మనసునకు ఊతమిస్తున్నాయి. ఇక ఆ మీదట శంఖాలు, భేరీలు, ఢక్కలు, మృదంగాలు, రణశృంగాలు వెంటవెంటనే మ్రోయింపబడ్డవి. తుములమైన శబ్దం యేర్పడింది.

14-18. అప్పుడు హఠాత్తుగా తెల్లని గుఱ్ఱాలతో ఉన్న రథం వచ్చింది, అందులో శ్రీకృష్ణుడూ అర్జునుడూ ఉన్నారు. వారు దివ్యమైన శంఖాలను విశృంఖలంగా పూరించారు. శ్రీకృష్ణుడు పాంచజన్యాన్ని ధనంజయుడు దేవదత్తాన్ని భీముడు పౌండ్రమునూ, యుధిష్ఠిరుడు, అనంత విజయమనే శంఖమునూ,

నకుల సహదేవులు సుఘోష మణిపుష్పకాలను పూరించారు. అ కాశీరాజు, శిఖండి, ధృష్టద్యుమ్నుడు, విరాటుడూ, సా పదుడూ, ద్రౌపదీపుత్రులూ అభిమన్యుడూ అంతా తమ ద్ర శంఖాలను వేరువేరుగా పూరించారు.

19. ఇలా చేయబడిన శంఖనాదాలు పృథివినీ ఆకా ధ్వనితో ముంచెత్తినవై కౌరవుల హృదయాలను చీలగొట్టి మరి ఆ ధ్వని ఒక్క దుర్యోధన పక్షంలోని వారికి మాత్రమే భ కలిగించిందట. ఎందుకని? వారుమామకీయులై యుండటంచే –నాది అనే వికారాల మీదనే భేదపూర్వకమైన మనసు పెట్టుక వారలు కావటంచేత, ఆ పెద్ద మోతలో–ఉన్నది పోతుందేమో కావాలన్నది రాదేమోననీ, భయంకలగటం సహజంకదా!

20–23. అప్పుడు యుద్ధం చేయడానికి సంసిద్ధులై య కౌరవులను కపిధ్వజుడైన అర్జునుడు చూచి విల్లు నెత్తిపెట్ట శ్రీకృష్ణునితో అంటున్నాడు. "శ్రీకృష్ణా! ఈ సైన్యాలమ రథాన్ని నిలుపు. దుర్బుద్ధిఅయిన దుర్యోధనునికి సహాయంగా వరు యుద్ధం చేయడానికి వచ్చారో చూస్తాను' అని.

అర్జునుడు సత్త్వగుణ సంపన్నుడు, కౌరవులు రాజస తామసులూను, వారందరినిగూర్చిన సమాచారం తెలియాలని కోవడం–ఒక విషయం తెలియాలనుకోవటం—సత్త్వగుణల ధర్మయుద్ధం చేయాలనే వచ్చాడు అర్జునుడు రంగం మీదకు. క నిర్వహణకె వచ్చాడు. రాజులను పరిశీలిస్తున్నాడు విల్లునె కొన్నవాడై.

24-25. సంజయుడు చెప్తున్నాడు:- ధృతరాష్ట్రా! అ శ్రీకృష్ణుడు అలాగే రథాన్ని సేనలమధ్య నిలిపి అంతా క టట్లుంచి 'చూడవయ్యా ఇక్కడ సమకూరినట్టి నీ ప్రతిక నున్న యోధుల్ని' అన్నాడు.

26-27. అర్జునుడు చూస్తున్నాడు. అందరు బంధువులనూ, భీష్ముడు, ద్రోణుడు, పితృసమానులు, పితామహులు, గురువులు, మామలు, సోదరులు, పుత్రులూ, అందరూ ఉన్నారు. తన సైన్యంలో కూడ ఉన్నారు, స్నేహితులు, హితులు. తలతిరిగి పోతోంది. వెనుకటి నిశ్చయ బుద్ధి తప్పిపోతోంది. సంశయాలేర్పడినాయి. దుఃఖిస్తున్నాడు. అలా ఉండి - అంటున్నాడు :-

28-30. కృష్ణా! ఈ యుద్ధం చేయడానికి వచ్చిన వారిని చూస్తే, నా కళ్ళు తిరిగి పోతున్నాయి. అవయవాలు పట్టు తప్పుతున్నాయి. నానోరెండి పోతున్నది. వణుకు పుట్టుతున్నది. గగుర్పొడుస్తున్నది. గాండీవం జారిపోతోంది. శరీరం తగలడుతున్నట్లుగా ఉన్నది. నా మనసు మళ్ళుతున్నది, ఇదంతా ఏదో అపశకునంగా అనిపిస్తున్నది.

31-33 "నా మనసులో కలిగిన మలుపు ఇది-వీరంతా వ్యక్తిగతంగా "నా వారు". నా వారినే నేను చంపి విజయం పొందవలెనా? రాజ్యం పొందవలెనా? ఇదంతా సుఖాన్ని పొందటానికేనా! రాజ్యం, భోగం, సుఖం ఎవరి కొరకయితె మనం కోరుతామో వాళ్ళందర్నీ చంపుకొని ఇవి పొందటమెందుకు? స్వజనాన్ని చంపుకొనుటంలో గల మంచియేదో ధర్మమేదో నేను తెలియ లేకుండా ఉన్నాను. నాకు ఈ విజయం వద్దు. రాజ్యమూ వద్దు. సుఖమూ వద్దు. వీరంతా గురువులు, పితృసమానులు, పుత్రులు, మామలు, మనుమలు, బావలు, చుట్టాలు. ఎంత పట్టుదలగా తమ ప్రాణాలను సైతం లెక్క చేయక చావడానికి - ఇలా నిలిచి ఉన్నారబ్బా వీరు!

34-37 ఒకవేళ వీళ్లే నన్ను చంపినా సరేగాక-నేను వీళ్లను చంపడాని కిష్టపడను. త్రైలోక్యాధిపత్యం నాకిస్తాననన్నా సరే-నాకక్కర్లేదు. ఈ భూమిని సంపాదించటానికి గాను ఈ బంధువులను చంపుతానా? చంపనుగాక-చంపను. వీళ్లను చంపితె మనకు కలిగే దేమిటి? సంతోషం కలుగుతుందా? లేదే! మనను చంపటానికె

వచ్చిన వాళ్లు కాగాక వీళ్లు. అయినా వీళ్లను చంపితే మనకు క
పాపమేగా! నేనెందుకు వీళ్లను చంపనంటున్నానంటే వీరు
స్వజనము, మనవాళ్లు మనకు కావలసిన వాళ్లను చంపితే
సుఖమెట్లా కలుగుతుంది? గనక ఇది అర్జునుడు వేసిన
ప్రశ్న. శ్రీకృష్ణుడు దీనికి సమాధానం చెప్పవలసి ఉంది.

సత్త్వగుణ ప్రధానుడైన అర్జునునకు పాపం అంటె యే
పుణ్యమంటె ఏమిటో తెలుసు. మనసులో స్వార్థం పెట్ట
ఇతరులకు చేసిన అపకారమంతా పాపమె. స్వార్థం అలా వదలి
కారం చేసేదంతా పుణ్యమె. (పరోపకారః పుణ్యాయ పాపాయ
పీడనం). మనసుయొక్క పరిస్థితె ఈ పాపపుణ్యాల విషయం
టటు వంటిదనే నిశ్చయం మాత్రం అతనికి లేదు. ఇది శ్రీకృష్ణ
చేసిన సంవాదం వల్ల తెలిసికొంటాడు తరువాత.

38-39 ఇంకా అంటున్నాడు. ఈ యుద్ధంవల్ల రెండు
తులు జరగబోతున్నాయి-ఒకటి కులక్షయం. రెండు మిత్రద్రో
వల్ల పాతకమున్నూ. ఈ రెంటి సంగతీ ఆలోచించ కుండా
యుద్ధం చేద్దామని వచ్చారు గాక. వాళ్ల సంగతి అలా వుంచు.
తెలిసిన వాళ్లం-మనం చేసే పనేమిటి? ఈ పాపాన్నెలా
మంటావు నన్ను? ఇది రెండో ప్రశ్న.

40-46 కులక్షయం అయినప్పు డేమవుతుందో తెలుస
ధర్మము అని సనాతనంగా ఆచరింపబడుతున్న కులలక్షణాలు
పోతయి. తమతో తులతూగే వాళ్లను సమాన గుణముల
వారనీ పొందలేక భిన్నగుణాలు కలవారితో స్త్రీలు కలుస్తారు.
స్త్రీలు అలా వినష్టులై పోతారు. కేవలం స్వార్థపరులు పుట్టిన
కుల మంతటికి నరక కారకులవుతారు. పితరులుకూడ భిన్న క
లనబడినవారై పిండదానతర్పణములు లేని వారవుతారు. నరక
పడిపోతారు. అయ్యో ఎంత మహాపాపాన్ని చేయటాని
భించాం మనం! రాజ్యకాంక్ష సుఖకాంక్షల వల్ల బంధువులను

నున్నామే. నేను యుద్ధం చేయనుగాక. చేయకపోయినా ఒకవేళ నన్ను వాళ్లు చంపేటట్లయితే అది కూడ నేను మేలుగానే భావిస్తాను. అన్నాడు.

47. ఇలా చెప్తూ ఎక్కు పెట్టబడిన విల్లును అర్జునుడు వదలి వేసిన వాడై శోకసంవిగ్న మానసుడై కూలబడి పోయినాడు.

సత్త్వగుణుడై అర్జునుడు కర్తవ్యం చేసి తీరాల్సినవాడు. ధర్మయుద్ధం చేసి ధర్మపక్షం జయమందేటట్లు పోరాడి, ధర్మరాజు వంటి సత్వగుణుని పరిపాలన తెప్పించటం అతడి కర్తవ్యం. ధర్మ రాజు పాలించటమె దేశానికి క్షేమం. దుర్యోధనుడు పాలించటం దేశానికి, ప్రజలకు క్షేమం కాదు. యుద్ధం చేదామని సత్వగుణంతో రంగంలోకి వచ్చిన వానికి ఇప్పుడు తమోగుణం పట్టుకొన్నది. అజ్ఞా నం ఆవరించటం జరిగింది

మమకారం వ్యక్తిలక్షణం. సామాజకునకు ఈ వ్యక్తిగత మమ కారం అనేది సమాజానికి వ్యతిరేకంగా విజృంభించరాదు. ప్రతి సామాజకునకూ కొన్ని ధర్మాలుంటవి. అవి సమాజం పట్ల అతడు చేయక తప్పనట్టి నియత కర్మలు. అవె ఒతడి స్వధర్మాలు. స్వధ ర్మాలు అంటె స్వంత లక్షణాలనీ కాదు. అంతరంగంలో ఎక్కడో వున్న ఆత్మసంబంధమైన నిర్గుణ లక్షణాలూ కాదు. సమాజంలో వ్యక్తి సమాజానికిగాను ఎలా ప్రవర్తించి సేవ చేయాలో ఆధర్మాలే వాని స్వధర్మాలు. స్వధర్మమంటే కులధర్మమూ అనికూడా చెప్పే వీలు కనిపించదు. అలాఅయితే రాజులు బ్రహ్మర్షు లెలా అయినారు? వాల్మీకి బ్రాహ్మర్షి వ్యాసుడు బ్రాహ్మర్షి విశ్వామిత్రుడు బ్రహ్మర్షి ఇలా.

కాగా ప్రతిఒక్కరూ స్వధర్మం పాటించితీరాలి. సమాజంలో సమాజం కొరకు బ్రతకాలని అర్థం. స్వకీయమైన మమకారాలు పెంచుకున్నామంటే సమాజంలో పేచీ వస్తుంది. సమాజానికి వ్యతి రేకంగా తన స్వార్థానికై బ్రతకాలని ప్రయత్నిస్తే అది మన ఋషులు చెప్పిన దానికి వ్యతిరేకమై నిలుస్తుంది. అలాంటివాడు

భస్మాసురునిలా నశించి పోతాడు. హిరణ్యకశిపునిలా చివికి
పోతాడు. హిట్లరు ముసోలినీల లా నశిస్తాడు. ఇదీ సృష్టి కీలకం.
సమాజపు నడక.

అర్జునుడుడిప్పుడు స్వార్థం పెంచుకొని 'నావాళ్ళ'ను చంప
నంటాడు. ధర్మయుద్ధం మానేస్తానంటాడు. దీనిలో ధర్మం గెలవాలి
దుర్యోధనుడు ఓడాలి. సమాజం కోరుతున్న సంగతి అది. వ్యక్తి
లక్షణాలు (ధర్మాలు) సామాజిక ధర్మాలకు కట్టుబడి ఉండాలి. ఈ
సామాజిక ధర్మాలు అంతర్జాతీయ నీతికి లోబడి ఉండాలి. ఈవిధంగా
చూస్తేవ్యక్తి, ఆపైన సమాజం, ఆపైన జగత్తు' అంతకుపైన విశ్వం
మెట్లుగా కనిపిస్తవి. మానవునిలో 'నేనే' అనేవాడు ప్రధానుడు.
సమాజానికి కూడ ప్రత్యేక ప్రతిపత్తి ఉంది. అదె 'ధర్మం'. సమా
జానికి అది ప్రధానం. అలాగే జగత్తుకు 'జగత్తత్వం' ప్రధానం.
విశ్వానికి అలాగే 'ఈశ్వరుడు' ప్రధానం.

అర్జునుడు మమకారంలో ఇరుక్కొని పోయి వున్నాడు. దయ
అనే బంధంతో కట్టివేయబడి ఉన్నాడు. తాను యుద్ధం చేసేటట్లై
యితే, ఈశ్వరప్రేరణమైనట్టి ఈ సమాజ ధర్మాన్ని పాటించిన
వాడవుతాడు. మమకారం వల్ల యుద్ధం చేయకపోతే అధర్మపరుడయి
పాపం చేసిన వాడె అవుతాడు. దుర్యోధనుడినె రాజ్యంలో నిలిపి
సమాజానికి అవకారంచేసినందు వల్ల పాపం చేసిన వాడు కాడా!
మరి ఉరిశిక్ష వేసి చంపింపజేసిన న్యాయాధికారికి పాపమెలా లేదో
సమాజం కోసమయిన తన కర్తవ్యాన్ని అంటేస్వధర్మాన్ని చేసి
దుర్యోధనాదులను చంపేయడానికి కూడ పాపం ఉండదు.

కాని ఇప్పుడెలా? అర్జునుడు ఈ యుద్ధకర్మ వల్ల పాప
మొస్తుందంటూ అందుకు శాస్త్రప్రమాణ ముందంటాడు. శాస్త్రాన్ని
తిన్నిగా అర్థం చేసికొనుటల్లేదు. యుద్ధముఖంలో తాను సైనికుడై
ఉండికూడ వెనక్కు పోతానంటాడు. మన మక్కడుంటే కాల్చి
పారెయ్యి వీణ్ణి అనే పరిస్థితి. ఎంత అజ్ఞానంలో పడ్డాడు అర్జునుడు!!

పాపమేదో పుణ్యమేదో పాప పుణ్యాల కతీతమైన కర్మలేవో అది చెప్పితీరా లిప్పుడు శ్రీకృష్ణుడు. అప్పుడుగాని అతడి కూలి పడి పోయివున్న శరీరం లేచి పనిచేయజాలదు.

ఎంత గొప్ప శరీరం కలిగిన వాడీ అర్జునుడు! హఠాత్తుగా ఆ శరీరం నీరసించిపోయింది. నిర్వీర్యమై పోయింది. ఇలా ఇతనిని చేసిందేది? అజ్ఞానమా? రాయిలావున్న శరీరంకూడ మనసులో ఏదో వుండి విద్యుత్తువలె ప్రవహించి నడిపిస్తేనే గాని నడవడా? ఈసందేహం మనకు కలుగుతుందిపుడు. ఇదీ విమర్శకు ప్రాతిపదిక. ఆ తరువాత విచారణ.

శ్రీకృష్ణుడు నవ్వుతూ అపహసిస్తున్నవాడిలాగా సమాధానం ఆరంభిస్తాడు రెండో అధ్యాయంలో.

(ఇది మొదటి అధ్యాయం)



శ్రీకృష్ణ పరమాత్మనే నమః

# శ్రీమ ద్భగవద్గీతా మననము

## (రెండవ అధ్యాయం)

## సాంఖ్య యోగము

మానవుడు సమాజాన్ని ప్రధానం చేసి బ్రతకాలి,

1. సంజయుడు ధృతరాష్ట్రునికి చెప్తున్నాడు—'అర్జునుడు కృపయావిష్టుడైనాడు. దయ అనే సత్త్వగుణ బంధంవల్ల వ్యాకులుడైనాడు'. చనిపోవటానికి సిద్ధమై ఎదురుగా నిలిచిఉన్న బంధువుల మీద ఆతనికి దయ కలిగింది. ఆ మాత్రం కలిగితే ఫరవాలేదు. కాని ఆ దయ మమకారమనే దానితో కలిసిపోయి దుష్టమయమై అతడినె కాటువేసింది. చెడు అనె దానితో ముంచెత్తించిందని ధ్వని. అప్పుడు శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు—

2-3 "అర్జునా! మురికితో కూడిన ఈ మనఃస్థితి ఎలా వచ్చింది నీకు? పైగా యుద్ధం మొదలయ్యే యీ విషమ సమయాన వచ్చిందేమిటి? ధర్మయుద్ధం చేయవలసిన మహావీరుడవు! నిర్వీర్యునిలా హృదయ దౌర్బల్యంపొంది నపుంసకునివలె అయిపోతున్నావు ఇది చాల నీచమైన స్థితి అని ఎరుగవా? ఈ స్థితికి దిగజారకు" అన్నాడు.

శ్రీకృష్ణుడు చెప్పిన గీతను మూడురకాల స్థాయుల్లో అర్థం చేసికొనవచ్చు. మొట్టమొదటగ చదివేవారు—శ్రీకృష్ణుని అర్జునుని స్నేహితునిగ, దేవకీనందనునిగా మాత్రమే అర్థం చేసికొంటారు. ఆయన కొన్ని లోకధర్మాలు చెప్పటం తెలుస్తుంది. ఆ మాత్రంతో గీత అర్థం కావటం పూర్తి కాదు. కొంతవరకే వారు అర్థం చేసికో గలుగుతా రన్నమాట.

అర్జునుడు, యుద్ధంచేయటానికి వచ్చికూడ హఠాత్తుగా— ఈ 'యుద్ధంచేస్తే తనవాళ్ళు చచ్చిపోతారు'- అనే ఊహయొక్క తీవ్రతను పెంచి 'యుద్ధరంగం నుంచి వెళ్ళిపోతాను' అంటున్నాడు. ఇదీ పరిస్థితి. ఒక సిపాయి యుద్ధరంగంలో నిలచి యుద్ధంచేయను వెళ్ళిపోతాను వెనక్కి అంటే ఏంచేస్తాం మనం· 'వెనక్కి తిరిగితే కాల్చి పారేయి' అనమా? ఎందుకని? అతడి ధృతి ఆలోచన-అంత నికృష్టమైనవి. సమాజదృష్ట్యా సహింపబడజాలనివి. అందుకని అర్జునునకు వ్యక్తిగత ప్రేమవల్ల—యుద్ధం చేయ బుద్ధి కావటల్లేదు. సహజపరమైన ధర్మం. అతడికొకటి ఉన్నది- యుద్ధముఖంలో ఉంటె యుద్ధంచేయటం అనేది. అది అతడి స్వధర్మం. అంటే వ్యక్తియొక్క సమాజపరమైన ధర్మం అన్న మాట. స్వధర్మానికీ వక్తిలక్షణమైన-రాగము- అనేదానికి వచ్చిన సంఘర్షణలో స్వధర్మం బరువుతూగటల్లేదు. దానిని మాని వేస్తానంటున్నాడు అర్జునుడు. అది చాల నికృష్టమయిన పని. శ్రీకృష్ణుడామాటే అనేసి-మురికితో కూడిన మనస్తత్వం అది అన్నాడు.

ఇక రెండవస్థాయి ఏదంటే- శ్రీకృష్ణుడు భగవానుడై అలా మాట్లాడినాడని అర్థం. కాని భగవంతుడెవరనే సంగతి తెలియక ముందు అతడెవరో మహోత్కృష్ణుడు అనేది మాత్రమే మనసులో ఉంటూ, ఉండటం పరిపాటి· ఆయన చెప్పాడు అని చెప్పిన 'వాని మాటలె' యదాతథంగా నమ్మివేయటం జరుగుతుంది. విమర్శలేక పోవటం కూట కద్దు అప్పుడు. ఈ స్థాయిలో అప్రమాదముంది. ప్రమాదమని ఎందుకంటున్నానంటే - అలా పూర్తిగ నమ్మి భగవంతుని వాక్యాల్లోని విషయాలతో సర్వభావాలలో ఏకీభవించి తెలిసికొంటె- నమ్మితే- చింతలేదు. అలా జరగదే!!

సృష్టికర్త మనకు విమర్శాత్మకమైన బుద్ధి నొకదానిని ఏర్పాటు చేశాడు. ఆ బుద్ధి, విమర్శ చేస్తూ నిలుస్తుంది ఒకప్రక్కన. కార్యకారణ సంబంధాల నేస్నాయువులతో మనం కట్టబడ్డాం. అలా మనం ప్రపంచములో మసులుతున్నాం, ఆస్నాయువులు హఠాత్తుగా

తెగిపోవు. భగవంతుడన్న మాటలను కూడ మన మామూలు కార్య కారణ సంబంధమైన విమర్శ తొలగింప జేయాలని చూస్తాము. అది చేతకానప్పుడు నమ్మకం లేదంటాం. పరిపూర్ణమైన ఆత్మ సమర్పణం ఉండదు. కార్యకారణాల సంబంధం అడ్డు వస్తూంటుంది, సందేహాల్లో మునిగితేలట మవుతుంది. అందుకూ ప్రమాదం అంటున్నది. అందు చేత మొదటిస్థాయి చాలదు - ఈ స్థాయి నిలువదు. ఎలా? అందుకే మూడోస్థాయిని ప్రయత్నం చేయాలి ఆమాటకొస్తే అసలు ఆత్మ సమర్పణం ఎలాచేసికోవాలి అనేదే శ్రీమద్భగవద్గీతలో బోధచేయ బడిన విషయం. గీత చదవక ముందె ఆత్మసమర్పణం చేయగలిగిన మానవునకు గీతయొక్క ప్రయోజనం కొద్దిపాటిది.

ఈ మూడవస్థాయిలో-శ్రీకృష్ణుడే ఆత్మ అని అర్థం చేసికొన టం ఉంది. అంటే ఎవరికి వారు "తానే" వానిస్థితి నందుకొంటూ అర్థం చేసికొనటం, ఆత్మ అంటే ఏమిటంటే మానవుడు 'నేను' అంటూ ఉంటాడే ఆ'నేను' అనే వాడని అర్థం. సూక్ష్మంగా విచా రిస్తే ఈ"నేను" అనేది ప్రతిమనిషిలోనూ ఉన్నదే గనుక బుద్ధినుప యోగించి ఈ"నేను" అనేదాన్ని గూర్చి విమర్శచేసి నట్లయితే ఈ గీతలో విషయాలు తెలుస్తవి. ఆ"నేను" అనేవాడే ఆలోచించి, బుద్ధిద్వారా తానెవరో తెలిసికొనగలడు అని ధ్వని. శ్రీకృష్ణుడు నేను" 'నేను' అని భగవద్గీతలో చెప్పినది ఎలా అర్థం చేసికోవా లంటే "అధియజ్ఞోఽహమేవాత్ర" అని ఆయన ఎనిమిదవ అధ్యా యంలో సూచించిన విధంగా అర్థం చేసికొనాలి. అధియజ్ఞుడంటే తైత్తరీయోపనిషత్తులో చెప్పబడిన అధివిద్యుడు అనవచ్చు. ముక్త సరిగ, ఆ'నేను' అనేవాడు అనచ్చు. అంతేగాని శ్రీకృష్ణుని కేవలం రథసారథి మాత్రునిగ అర్థంచేసికొనటం సరికాదు.

అలానాలోని 'నేను' చెప్తున్న విషయాలివి అని అర్థం చేసి కొంటూ గీతను ఆస్వాదించుతూ వుంటే పడెనిమిది అధ్యాయాల వరకూ వెళ్ళేటప్పటికి భగవంతుడు అంటే అసలైన భావమేదో అర్థ మవుతుంది. ఈనేనెవరు ఆ భగవంతుడెవరు అనేవి తెలుస్తవి. 'నేను'

అనేది (అదె నీవుకూడాను)-త్వం. ఆయన-(భగవంతుడు అనేది) తత్. తత్త్వమసి అనే అర్థం ప్రపంచంలో ఎలా బ్రతాకాలో అలా బ్రతుకుతున్నప్పుడు అయేస్థితి. దానిని విశదీకరించడమె గీతా ధ్యేయం. ఇంతకూ శ్రీకృష్ణుడు అర్జునుని అథమ మనఃస్థితిని ఎత్తిచూపినాడు. "కల్మశమైన ఈస్థితి 'నీ' కొచ్చిందేమిటన్నాడు. సిపాయి వెనక్కువెళ్లేప్పుడు తనఅధికారిచేతనే చంపబడేస్థితి అని అర్థం. అర్జునుడికి తప్పుతెలిసింది. కానిదానికి మూలమేదో తెలీలేదు. అందుకని తన వాదం మార్చివేశాడు, నావాళ్లనుచంపి ఈ యుద్ధం నేనెందుకు చెయ్యాలి-అనె నికృష్టభావం ఇంక చెప్పలేదు. ఇలాఅంటున్నాడు.

4-8. పూజ్యులూ, గురువులూ అయిన భీష్మద్రోణులను యుద్ధంలో బాణాలతో కొట్టటం ఎలా? మహానుభావులూ గురువులూ అయిన వీరిని చంపి రాజ్యంపొంది రక్తపు కూడు తినటంకంటె భిక్షమెత్తుకోనటం మేలుకాదా? ఎవరికొఱకయితె బ్రతకాలని అనుకొంటూమో వారినిచంపి జయించటం మంచిదో, వారిచేతనే చంపబడటం మంచిదో తెలియలేకుండా ఉన్నాను- అన్నాడు. ఇంకాఇలా అన్నాడు.

'యుద్ధంచేయటం ధర్మమె. పూజ్యులూ గురువులూ అయిన వారిని చంపరాదనేదీ ధర్మమె. ఒకదానికొకటి వ్యతిరేకంగా అవపడుతున్నాయి ఈధర్మాలు. వీటిలోని వ్యత్యాసాన్ని విమర్శించి నాకు చెప్పవలసింది. నీకు నేను శిష్యుడను. నా మనసుకుమాత్రం యుద్ధం చేయడం అనేది ఏమాత్రం మంచిదిగా తోచటల్లేదు దాని వల్ల రాజ్యం సంపాదించటమనే వీలున్నా సరే. అని

9. ఇలా చెప్పి, అర్జునుడు నేను యుద్ధం చేయను అంటూ మాట్లాడటం మానేసి ఉండిపోయినాడు.

10. ఈస్థితిని చూసి శ్రీకృష్ణుడు అపహాసిస్తున్న వానివలె చిరునవ్వునవ్వి ఏదోఅన్నాడట.

అప్పటి పరిస్థితి పీకలు తెగవేసుకొనేస్థితి. పాండవపక్షసైన్య మంతా అర్జునునిపై ఆశలు పెట్టుకొని ఉన్నారు. అర్జునుడేమో దిగ జారి పోయినాడు శ్రీకృష్ణుడూ యుద్ధంలో పాల్గొంటున్నవాడె. సాధారణ మానవుడు ఆస్థితితో ఎంత గంద్రగోళపడి, చీకాకుపడి సతమతమయి పోయేవాడో! శ్రీకృష్ణుడొక్కడే అలాచిరునవ్వుతో మాట్లాడగలిగింది. అలా అతడెలా ఉండగలిగినా డనేది మంచిప్రశ్న. అలా చలించనితనం శ్రీకృష్ణునికి తప్పిస్తే ఎవరికీ ఉండదేమొ. స్థాణువులూ జంతువులూమాత్రం అలా ఉండవచ్చునుగాక ఈ శ్రీ కృష్ణుని మనసుకూడా స్థాణువులూ, జంతువులూ వీటికి సమా నంగానే ఉన్నదా?

ఒకరి మనసు "స్థైర్యం స్థిరతలనుకలిగి ఉన్నది" అన్నప్పుడు పోల్చటంలో స్థాణువుకు సమానంగానే ఉన్నది అనవచ్చు. కాని తిరిగి శ్రీకృష్ణుడు ఎన్ని బోధనలను చేస్తున్నాడు! ఆయన మనసు లోనికి ఈ పరిస్థితులగతి వెళ్ళటల్లేదనటానికి ఎలా వీలు? మనసు పని చేస్తునే ఉన్నదిగాక ఐనా ప్రతిచర్య అందరికివలే లేదు వానిలో. ఆయన మనసు చేస్తుండేపనికి ఈ బాహ్యవిషయాలు అడ్డురావటల్లేదు. ఈ పరిస్థితినె మనంకూడా మనసుకు కలిగించుకొంటే ఎంతటి బాధా పూర్వకమయిన సంఘటనల్లోకూడ కదిలింపబడకుండ ఉండవచ్చునని పిస్తుంది. గీతపరమార్థమిదే అనె సంగతి మరువవద్దు.

11-14 పై స్థాయిలోనున్న శ్రీకృష్ణుడు అర్జునునితోఅంటు న్నాడు. "వీరందరిని చంపటం పాపం అంటున్నావు. దానిమాట అలా ఉంచు, ఎప్పుడు పాపమవుతుంది ఎప్పుడుకాదు అనేది తరవాత చూద్దాం" అసలు వీళ్ళంతా చచ్చి నశించి పోయేవాళ్ళను కొంటు న్నావా? "వీళ్ళు" అంటున్నప్పుడు వాళ్ళ శరీరాలను జ్ఞాపకంచేసు కొనవద్దు. "నీవు" అన్నప్పుడు ఈశరీరం నీవు ఎలాకావో తెలిసికొను నీశరీరంలో ఎక్కడ నీవున్నావు. నీవు దానిలో చేరినప్పుడు అది ఎంతో చిన్నది. అది క్షణక్షణానికీ మారుతున్నది. ఇప్పటికి ఇంత

పెద్దదయింది. ఇంతకుముందు రొమ్ము విరుచుకొని విఱ్ఱవీగింది. ఇప్పుడీక్షణాన దిగాలు బడిపోయింది. ఇవన్నీ సహజంగా పరిస్థితులను ఇట్టి శరీరంలో వచ్చే మార్పులు.

కొంతకాలానికి ఈశరీరం చచ్చిపోతుంది. ఎవరో వచ్చిబాణాలతో కొట్టి చంపనక్కర్లేదు. కాని ఈశరీరంపోతె ఇంకొక శరీరం తయారు అవుతుందినీకు. ఈచావు పుట్టుకలు శరీరానివి. 'నీ'కు 'నా'కు 'వాళ్ళ'కి అనేవి లేవని తెలుసికోను. ఈ చావుపుట్టుకలనూ, ఈశీతోష్ణాలనూ శరీరంద్వారా సహించి ఊరుకొనటమె కావలసింది, వాటినె పట్టుకుకూర్చోనటం తెలివితక్కువ, శరీరంకూడ పోయేదే. కనకనె దానినే పట్టుకు కూర్చోవాలనుకోవటం శుద్ధవెఱ్ఱి. ఇకదానికి కలిగే బాధల మాటేమిటిగాక. అందుకని-ఏదో జరుగబోయే దానికిగాను దుఃఖపడటం, ఉన్నది పోతుందని చింతపడటం-అది పండితులు చేసేపని కాదని తెలిసికోను' అన్నాడు, అంటే కర్తవ్యం ఒకటే పట్టించుకొనవలసింది-అన్నమాట.

ఈనాలుగు శ్లోకాల్లో శ్రీకృష్ణుడు పండితుడెలా ప్రపంచంలో ప్రవర్తించాలో ఆన్థాయి చెప్పాడు, కాని ఇక్కడ ఒక మహత్తరమైన సత్యవిషయముంది. అది సాంఖ్య విషయం అదేమిటంటే-వ్యక్తిలోనున్న "నేను", "నీవు" అనేది చచ్చేదికాదు. శరీరాలుమాత్రం చస్తవిగాక. "వానిని" "నేను" చంపాను అనుకోవటం తప్పుఅని. నేను వాని శరీరాన్ని నా బాణంతో తాకజేశాను అనుకొంటాం మామూలుగ. తాకజేశాను అనుకోవటంకూడ సరియైనది కాదనిపిస్తుంది. జరిగిందేమిటంటే బాణం అతడి శరీరాన్ని తాకింది అన్న సంఘటనమేతప్ప వేరేలేదు. బాణం వదిలింది నేనుగదా అనిపిస్తుంది. వదిలింది నీధనస్సు లేదా నీచేయి-అనాలి. అయితె దానికి కారణమయింది నాలోఏదీలేదా?

ఆశరీరం చావడానికి అదెబ్బ కారణం. దెబ్బకు కారణంబాణం. దానికి కారణం ధనస్సు. ధనస్సు వంగడానికి కారణం నీచేతులు.

అవి కదలడానికి కారణం మనసు. మనసే "నీవ"ని అనుకోనడంతప్పు. నీవు దానిని మార్చగలవు. దానిని బాగుచేయడమే నీపని. ఆమాట కొస్తే అదే నీకర్తవ్యం. ఇప్పటివరకూ బ్రహ్మాండమైన యుద్ధంచేదా మనివచ్చిన నీమనసు ఇలా మారిందేం? ఇందాకటి భావం చచ్చి ఇంకొక భావం వచ్చింది. అదే కారణంగా నీవు చచ్చిపోయి మళ్ళీ వచ్చావనని అనుకోవటం సరియైనదా? అలాగే వీళ్ళుచస్తున్నారనీ చంపి వేయపడుతున్నారనీ అనుకోవటం సూత్రప్రకారం సరియైనది కాదు.

ఈ శరీరంగాని, మనసుగాని, బుద్ధిగాని, ఈఅహంకారంగాని అంతరాంతరాల్లో ఉన్న ఇంకా అనేకమైన వికారాలేవిగాని కేవలంగా "నీవు" కాదు అని తెలిసికోను. చెట్టువుంది. ఆకులున్నయి దానికి. ఆకులుచెట్టా? పూవులుచెట్టా? కాయలు మాత్రం చెట్టా? ఈ ఆకులు, పూవులు, కాయలు అన్నీ చెట్టుకు అంగాలుగా కొన్నాళ్ళుండి రాలి పోతాయి. చెట్టుమాత్రం అలా నిల్చి క్షణక్షణానా వికసిస్తూ ఉంటుంది. ఇలా చెట్లు ఎన్నోవుండి ఈ ప్రపంచం అయింది. ఈ చెట్లు-ఈ వ్యక్తులు-(శరీరాలు)-ఒకొక్కటే పోతయిగాక. అయినా ఈ ప్రపంచం ఇలా వెళ్ళిపోతూనే ఉంటుంది. ఈ ప్రపంచాలు ఎన్నో ఉన్నాయి. ఇవి ఒక్కొక్కటే లయమై నశిస్తయిగాక. అయినా విశ్వం అలాగే ఉంటుంది. విశ్వంకూడ నశించినా దాన్ని సృష్టినిచేసిన ఈశ్వరుడు నశించుటమనేది లేదు—వ్యక్తియొక్క శరీరం నశించినా 'నేను' అనేవాడు నశించనట్లే. ఆ మాటకొస్తె యీశ్వ రుడే 'నేను'గా నయి ప్రతి శరీరంలో కనబడుతున్నాడనవచ్చు. ఈ రూపాలు అన్నీ పోయినా, ఈశ్వరుడు అలా సర్వత్ర ఉన్నవాడేనని తరువాత అధ్యాయాల్లో విడగొట్టి చెప్పటం జరుగుతుంది.

శ్రీకృష్ణుడు ఈ పరిస్థితిలో ఒకానొక గొప్ప విషయం - సత్యవిషయం-అర్జునునకు చెప్పేస్తున్నాడు. నేను, నీవు అనేది ఎన్నడూ నశించేది కాదు కనక నీలోని మనసు బుద్ధితోసహా - శరీ రాన్ని క్రింది అంతస్తులో నున్నట్లు చూచి మరీ ఆలోచించమని

చెప్తున్నాడు. బ్రతికే కీలకం అలాగని అర్థం. ఈ కనబడె శరీరం, ఊహించే మనసు, నిశ్చయించే బుద్ధి, హంకరించే అహం కారం, వీటన్నిటికంటె భిన్నమై శాశ్వతమైఉండే "నేను" "నీవు" అనేవాడు పై స్థాయివాడని తెలిసి - ఆ స్థాయిలో బ్రతకాలి. ఇది ఒకచిట్కా.

ఇది చేతకావట మెలా? బ్రతుకుతున్నది యీ శరీరాల మధ్య - ఈ మనసులమధ్య - అయినప్పుడు ఇంకా పైస్థాయిలో 'నేను' ఉండటమెలా అనేది సమస్య. ఈ సమస్యకు సమాధానమె తరువాతి శ్లోకాల్లో శ్రీకృష్ణుడు చెప్తున్నాడు-సూటిగా.

15-16 అర్జునా! ఈ శీతోష్ణాలు, సుఖదుఃఖాలు ఏవరినైతే వ్యథపెట్టవో అతడు అమృతత్వం పొందినవా డవుతాడు. అదీ నీవు పొందాల్సిన స్థితి. ఈ మార్పులు ఇలా వస్తూపోతూ వుంటవనేదీ - 'నీ'కు మార్పుఅనేదిలేదనేటీ గమనింపులో ఉంచుకోవటం ముఖ్యం. నశించనివస్తువు 'నీవు' 'నీ'కు ఎప్పుడూ దిగులు అనేది ఉండవలసిన పనిలేదు. ఈ కనబడే శరీరాలూ, ఉపాధులూ అన్నీ క్షణక్షణానికీ మారిపోయేవి. మొగ్గ నశించి వికసించిన పువ్వుగా మారుతున్నది. పువ్వునిశించిఫలమవుతున్నది. ఫలం తినబడి రక్తంగా మారుతోంది. రక్తం మజ్జగాఅయి తాను నశిస్తున్నది. మజ్జ వీర్యమై పిండమవు తున్నది. పిండం శరీరం అవుతున్నది. శరీరంచచ్చి మట్టి అవు తోంది. మట్టి మళ్ళీ చెట్టు అవుతోంది. ఇలా మళ్లీమళ్లీ మారే దానికి మారనే మారని 'నీ'కూ ఎక్కడ సంబధం? ఆ మార్పు - దానినే ప్రకృతి అంటాం—అలా ఎప్పుడూ జరుగుతూ వుండేదే. 'నీ'వు యథాతథంగా ఎల్లప్పుడూ మారకుండా ఉండేవాడివె. నశించే వస్తువు ఉండటం జరగదు. ఉండే వస్తువు నశించటం జర గదు. ఈ సంగతి మహాఋుషులు తెలిసికొనగలరు.

17. నాశనమనేది ఎఱుగని 'నేను' ఎక్కడపడితె అక్కడ ఉండేది అనే విషయం పరమ ముఖ్యమైన విషయం. నాలో, నీలో,

వానిలో, దానిలో అన్నిటిలో ఈ నేనుఉంది. స్థాణువుల్లో కూడా ఉందా అని సందేహం! ఉంది. ఎలా ఉందనేమాట ముందెక్కడో చెప్పటం జరుగుతుంది. ఎలెక్ట్రిసిటీ లాగా ఉందనుకోవచ్చు ప్రస్తుతం. జీవుల విషయంలో ఈ'నేను' శాశ్వతమై-నిజమై-అజమై ఉంటుందనేది సత్యము. అది అవినాశి, అవ్యయం కాగా చేయాల్సిందేమిటంటే ఈ 'నేను'ను మాత్రమే ప్రధానంచేసి మగతావన్నీ దీనికంటే భిన్నమైనవని, నిమ్నమైనవనీ తెలిసి బ్రతకటం.

18-21 ఇలా భిన్నంగా ఎందుకు చూడటం? - ఎందుకంటే స్నేహితుడు ఒకప్పుడొకరకంగాను, ఇంకొకప్పుడు ఇంకొక రకంగానూ దుస్తులు వేసుకొని వస్తే అతడు స్నేహితుడేను అనే ఎఱుకనెలా కలిగి ఉంటున్నాము? అతడు వేసుకొన్న దుస్తులు అతడికంటె భిన్నమై ఉన్నవనే సంగతిని తెలియుటం చేతనేకదా. అతడు ఆ దుస్తులేను-అనుకొంటె ఒకసారి కలిసిన స్నేహితుని తిరిగి గుర్తించటం జరగకపోవచ్చు. అలాగే ఈ 'నేను'ను అది ధరించే ఉపాధులు అనే దుస్తులనుంచి వేరు అని తెలియవలెనని అర్థం.

ఈ దుస్తులు తీసివేయబడేవి. అలాగే ఈ దేహాలు వదలివేయబడేవి. చచ్చిపడిపోయేవి. నీఎదుట నిలిచినవారిలోని ఈ'నేను' నశించదు. వారి శరీరాలైతె నశించుతవి గాక. శరీరాలు వ్యవహారానికి మాత్రమే కావాలి. దుస్తులూ-వేషమూ-రంగస్థల ప్రయోజనానికేగాని స్నేహితుని గుర్తించడానికి కాదనట్లు. అందుకనిఫలాని వాళ్ళను నేను చంపుతున్నాను-అనుకోవటం సంకుచిత దృష్టితో చూడటమవుతుంది నేను (ఇంగ్లీషులో–ఐ) చంపటం నేను చావటం రెండూ ఆధ్యాత్మికదృష్ట్యా నిజమైనవికావు. ఎందుకనంటే ఈ నేను చచ్చేదేకాదు. పుట్టేదీకాదు. ఒకప్పుడుండి ఇప్పుడులేనిది అనుకోరాదు. ఎల్లప్పుడూ ఉండేదే. అధ్యాత్మ అంటే ఈ'నేను' దానివిషయం ఇలా ఎరిగిన వానికి 'చంపుతున్నాను-చస్తున్నాను' అనే ఊహాలు కలగే అవకాశం లేదు.

22 మానవుడు చినిగిన చొక్కాను తీసివేసి క్రొత్తచొక్కాను ఎలా వేసుకొంటాడో, అలాగే ఈశరీర విషయంలోకూడా ఒక శరీరం పోతే ఇంకో శరీరాన్ని ఈ 'నేను' అనేవాడు ధరిస్తున్నాడు. ఇప్పుడు ఏబది సెంటీమీటర్ల పొడుగయిన శరీరం, ఇంకో పదినెలలకు డెబ్బది సెంటీమీటర్ల పొడుగవుతుంది. ఇప్పుడు మీసములులేని శరీరం, తరువాత యౌవనానికి తగింది అవుతుంది. చివరకు ఈశరీరాన్నిపూర్తిగ వదలివేసి ఇంకొకటి పుచ్చుకొంటుంది. ఇలా ఎందుకు తీసికొంటున్నది అనేదానికి సమాధానం ముందెక్కడో చెప్పబోతాడు. ఇక్కడ సందర్భంకాదు.

23-25 "ఈ దేహాలను ధరించేది 'నేను' అనేదే అదే ఆత్మ. అదే జగత్కారణం. అది ఛేదింపబడదు, దహింపబడదు. నీటిచే తడపబడదు. గాలికి ఆరిపోదు. అది నిత్యమైనది. అన్నిటిలోనూ ఉంటున్నది." అన్నాడు శ్రీకృష్ణుడు.

ఈ 'నేను' అవ్యక్తమైంది, అచలమయింది. మనసుకు అందేది అనుకోటానికి వీల్లేనిది ఈ 'నేను' అవికారి. అంటే మారేదికాదు.

అలాంటి 'నేను' పరంగా జీవితం నడపాలి - అంటున్నాడు శ్రీకృష్ణుడు. అంటే ఈ 'నేను'ను- (అదె- ఆత్మను) ప్రధానంచేసి జీవితం నడపాలి. హిమాలయాల్లోకి వెళ్లిపొమ్మనికాదు చెప్పటం! మోక్షం పొందటమంటె జీవితంనుంచి బయటకు పోవటం కాదు. అసలు ఆమాటకొస్తే- ఎలా జీవితంనుంచి బయటపడేది? శరీరాన్ని వదలివేసి పోవాలంటే పోగలమా? శరీరంచుట్టూ ఉండే వాతావరణంతో సంబంధం లేకుండా వదిలించుకోగలమా? నీకు, నీ శరీరంలోని ప్రతి అణువుకూ, చుట్టూనున్న గాలికీ, ఆకాశంలోని ప్రతి అణువుకూ సన్నిహిత సంబంధం ఉంటూఉండేదె. అది వదిలించుకోగలిగింది కాదు. నీకూ, శరీరానికి ఎంత భేదమో నీకు నీచుట్టూ వున్న వాతావరణానికీ అమాత్రమే భేదం. నీకూ శరీరానికీ ఒక దృష్ట్యాభేదం ఎలాలేదో మిగతా ప్రపంచానికీ 'నీ'కూ కూడ తేడాలేదు. అంటే ఈ 'నేను' అనేది సర్వత్ర ఉండటంచేత అన్నిటితో అవినాభావ సంబంధం

కలిగి ఉంటున్న దన్నమాట. ఈ స్థితి తెలిసినప్పుడు — అనుభవమైనపుడు-మోక్షం కలుగుతుంది. అప్పుడు తన శరీరం మాత్రమే తాను అనుకొనే సంకుచిత దృష్టి ఉండదని అర్థం.

ఈ మోక్షమనేది దర్శనం చేసికొనాల్సి నట్టిది. అంతేకాని శరీరాన్ని గాని, జీవితాన్ని గాని, చులకన చేయటం మాత్రంకాదు. ప్రకృతితో ఈ 'నేను'కు గల సంబంధం ఎలాటిది అనే సంగతి తెలియటం ప్రధానమైనది. 'నేను' ఉంటేనే ఈ ప్రకృతి విలసిల్లేది. ప్రకృతి దాని పనులు అది నిర్వర్తించుతూ ఉంటుంది. 'నేను' అనుభవిస్తూ ఉంటుంది. 'నేను' ఏమీ చేయలేదు-ఈ అనుభవించడంతప్ప. ఈమాత్రపు మాటలవల్ల ఈస్థితి తెలియదుగాక వీటిపై మననము కావాలి సరిగ ఆలోచించడం జరగాలి. అప్పుడు వికాసం కలుగుతుంది. అదే జ్ఞానార్జ నారంభం. భగవద్గీత పద్దెనిమిది అధ్యాయాల్లో మెట్లుమెట్లుగా చెప్పబోయే జ్ఞానమదె.

సర్వత్ర నున్నది ఆత్మ. మార్పు ఏది కనిపిస్తున్నదో అది ప్రకృతి. అనాత్మ అనవచ్చు దాన్ని. ఆత్మను ప్రధానంచేసి మనటం చెప్పబడిన మొదటి సాధన.

26-29 "మరి ఈ శరీరా లయినా బాణాలతో కొట్టబడి నశిస్తున్నవి కదా-అంటావేమో. అందు కయినా చింతపడాలి కదా-అంటావేమొ. అప్పుడూ అక్కరలేదు. బాణాలతో నశించకపోతె రేపు వ్యాధితో అవి నశించేది ఖాయం. ఈ రూపాలు నిన్న మొన్న వచ్చినట్టివి. రేపోమాపో-పోయేవి. మధ్యలోవచ్చి మధ్యలో పోయేవాటికై పరిదేవన ఎందుకు? నశించిపోవటం తప్పనప్పుడు, కర్తవ్యం మాని, దానికొరకు దుఃఖిస్తూ ఉండే పని తెలివైన పనికాదు.

మరెందుకూ? —అందరూ ఇలాంటి సమయాల్లో ఏడుస్తారు? అదె ఆశ్చర్యం. "చచ్చినవారి కేడ్చెదరు. చావక మానెడువారి

భంగి". ఇదె అజ్ఞానం-పసితనం-పసివాడలా అంటాడేమిటి-అనే మాటకర్థమేమిటి? పసివాడు కనకనె అలా అంటాడు. తండ్రికి తానే మంచినీ రివ్వాలి అంటాడు. తల్లి ఇచ్చిన నీటిని లాక్కోని పారపోసి మళ్లీ ఆ గ్లాసుతోనే సగానికి నీరుతెచ్చి తండ్రికిస్తాడు-పారపోసుకోంటూ. తాను తెచ్చినా, తల్లి తెచ్చినా తండ్రికి దాహమారటమే ప్రధానమన్న స్థాయి అతడికి రావాలి. అప్పుడే అతడి అజ్ఞానం పోయింది అనగలం.

అలాగే జీవితంలో 'ఆత్మ' అనేదె ప్రధానమైనదని తెలియాలి-సాధారణ మానవునకు అప్పుడె ఆశ్చర్యకరమైన మార్పు, అద్భుతమైన అనుభూతి కలుగుతుంది.

30 ఈ సాంఖ్యంలోనున్న పరమార్థం యేమిటంటే దేహంలోనున్న ఆత్మే "నేను" అంటున్నట్టిది. దానిని ప్రధానమైనదని తెలిసినవాడవై మిగతా విషయాలకొరకు దుఃఖించకూ-అని.

కాని ఇదె పరమధర్మమయితె ఒకొక్కప్పుడు అంతులేని చిక్కు వచ్చి పడుతుంది. నేను చచ్చేవాడినికాదు-దేనికీ చింత పడనక్కర లేదు గదా అని ఏ పాపమయినా చేయడానికి ఒడిగట్టటం కద్దు. సాంఖ్యసూత్రం మాత్రం పైన చెప్పారు గాని బ్రతుకులో నడవడి ఎలాగైనా ఉండవచ్చు ననికాదు అర్థం. బ్రతుకును నడపడానికి శాస్త్రానుగుణమైన ధర్మాలు పాటించాలి, వ్యావహారిక శాసనాలు అనుసరించాలి. అది తప్పనిసరి. అందుకనె శ్రీకృష్ణుడు తరువాతి శ్లోకాల్లో స్వధర్మం-అనగా కర్తవ్యం-చేయవలసిందేనని చెప్తున్నాడు.

31-37 వ్యక్తి సమాజంలో సభ్యుడు. వ్యక్తికి కొన్ని లక్షణాలున్నాయి. దయ, దాక్షిణ్యం, క్రోధం, కామం, రాగం, ద్వేషం, ఇలా. ఇవి వ్యక్తిగత మైనవి. కాని సామాజికుడుగా అతనికి కొన్ని

ధర్మాలున్నాయి. అవే అతని స్వధర్మాలనబడేవి. కర్తవ్యాలు. తండ్రిగా, గురువుగా, నౌకరుగా ఎలా ఉండాలనే ధర్మాలున్నూ, కుల ధర్మాలున్నూ, సామాజికులకు అవి కర్తవ్యాలు. ఈ కర్తవ్యం చేయటంలో వ్యక్తి వికారాలకు ప్రాధాన్యత లేదు. వ్యతిరేకత వచ్చినపుడు స్వధర్మమే చేయవలె గాని వ్యక్తి వికారాలకు తావు ఇవ్వరాదు. తప్పునకు శిక్షించాలి రాజు. శిక్షించడం అతడి ధర్మం. కొడుకయినా సరే అతడినీ శిక్షించక తప్పదు. కొడుకు చస్తాడే అనడం అది స్వార్థకర్మం. వ్యక్తిగతం. దానికి స్వధర్మం చేయడంలో అడ్డు వచ్చే అవకాశం ఉండరాదు. అందుకని ఎప్పుడుగాని స్వధర్మం నుంచి వికంపితుడవు కావద్దు. అంటాడు శ్రీకృష్ణుడు.

స్వధర్మమంటె కులధర్మమని చెప్పేవాళ్ళు పూర్వం. ఎందువల్లనంటె అప్పుడు ఏ కులాల వారికైనా వారు ఈ సమాజానికి ఎలాంటి సేవచేయాలో నిర్దిష్టమై ఉండేది. బ్రహ్మపదార్థ తత్త్వ విషయికమైన పరిశోధన చేస్తూ ఆ జ్ఞానాన్ని ప్రచారం చేస్తూ తదనుసారం బ్రతుకుతూ ఉండాలి బ్రాహ్మణులు. ఊరివారి రక్షణ చేస్తూ దుష్టులైన వారిని ప్రతిఘటిస్తూ శిష్టులైన వారిని రక్షిస్తూ రాజులుండాలి. వ్యాపారం వర్తకం చేస్తూ న్యాయమైన లాభాలు ఆర్జిస్తూ ప్రజలకు వస్తు సరఫరాచేసి సేవ చేస్తుండాలి వైశ్యులు. మిగిలిన వారు ఎలా న్యాయంగా బ్రతకాలో విజ్ఞానుల వద్దనుండి తెలిసినవారై ఆ విధంగా బ్రతుకును నడుపుకొంటూ, వారందరికి సహాయకరంగా ఉంటూ ఉండాలి. ఈ విధానము ఏ చోటికి ఆ చోట ఏ ఊరికి ఆ ఊరిలో ఉండేది. కమ్మరులు ఇనుప వస్తువులను, కుమ్మరులు కుండలను, సరఫరా చేయటం, రైతులు పంటలు పండించటం - ఇలా ఉండేవి. "ఏ ఒక్కడైనా ఇలా సమాజానికి సేవ చేయాలి" అనేది, కులాచార రూపకమైన సూత్రంగా ఉండేది. అందుకని వారి స్వధర్మం వారి కులాచారమే అని చెప్పటం జరిగింది.

ఇప్పుడు కులాచారాలు యథాతథంగా అనుసరింపబడుతున్నంతవరకూ-స్వధర్మమంటే కులాచారమే అని స్థిరంగా చెప్పడా

నికి ఏలాటి అభ్యంతరమూ లేదు. కాని అలా కాక ఇప్పుడున్నట్లు-జన్మతో సంబంధము లేక, మత, వర్గ, కుల, జాతులూ పుట్టిన స్థలములతో సంబంధంలేక ఆచారంతో సంబంధంలేక, కేవలం రాజ్యాంగచట్టరీత్యా బ్రతుకు నడుపుతున్నాం అనుకొనేవారికి ఆ సూత్రాన్ని చెప్పి ప్రయోజనం కనబడదు. ప్రజలు కేవలం స్వార్థపరంగా ఆలోచిస్తూ రాజకీయాల్లో దిగితేనే సమాజసేవ చేయటం అవుతుందనే యీస్థితిలో కులాచారమని చెప్పి ఊరుకోవడం కన్న ఆ సూత్రపు మూలభావం చెప్పుకొనడం జ్ఞాపకం చేసికోవడం ఉచితం. అంటే-స్వధర్మమనే దాని అర్థం "మానవుడు తనుఉన్న పరిస్థితిలో సమాజానికి తాను చేయవలసినట్టి సేవ ఏదో అదె అతడి స్వధర్మం" అని చెప్పుకొని తీరాలి.

శ్రీమ ద్భాగవతంలో కూడ ఈ కులధర్మాన్ని గూర్చి చెప్పిన వాక్యాలు ఎంతో వికాసాన్నిచ్చేవి అనిపిస్తుంది. వ్యాస భగవానునికి నారదుడు భాగవతం వ్రాయవలసిందని బోధ చేస్తున్న ఘట్టంలోని ఈ క్రింది పద్యం - (పోతన వ్రాసింది) - ఈ సందర్భంలో విస్తృతమైన జ్ఞాన కాంతిని ప్రసరింపచేస్తున్నది. భక్తి అనేది లేకుండా కులధర్మం నడిపినా ప్రయోజనం లేదు-భక్తి ఉండాలన్న భావం స్ఫుటంగా చెప్పబడింది. భక్తి అంటే భగవంతుడెవడో తెలిసిచేసిన భక్తి! భగవద్గీతలో 12వ అధ్యాయంనకు వెళ్ళే లోపలనె తెలియజెప్పినభక్తి. అందులో జ్ఞానమూ, కర్మకూడకలిపి విడమర్చి భగవంతుడేమిటో భక్తి ఎలాంటిదో చెప్పటం జరిగింది. ఇంతకూ పోతన వ్రాసిన శ్రీమద్భాగవతంలోని పద్యం ఇక్కడ జ్ఞాపకం చేస్తాను.

చ. తన కులధర్మమున్ విడచి దానవవైరి పదారవిందముల్
పని వడి సేవజేసి, పరిపాకము నొందక ఎవ్వడేని జ
చ్చిన మరుమేన నైన నది సిద్ధివహించు తదీయ సేవబాసిన
కులధర్మ గౌరవము సిద్ధి వహించునె ఎన్ని మేనులన్.

— ప్రథమస్కందము (పోతన)100వ పద్యం.

కులధర్మ గౌరవము భక్తిలేనిదే సిద్ధివహించుట మనే భక్తి-జ్ఞానపూర్ణమైన భక్తి ఒక్కటే-ఈజన్మలో కాకపోతే జన్మలోనైనా సిద్ధిపొందే అవకాశం ఉన్నదట.

38. ఇంకా సుఖం దుఃఖంకూడ వస్తూ పోతూ ఉం సంగతి తెలిసి ద్వంద్వాలను సహిస్తూ కర్తవ్యంచేస్తూ అన్నాడు శ్రీకృష్ణుడు.

కనక సిద్ధాంతమైనదేమిటంటె, అర్జునుడు తన మయిన యుద్ధం మానరాదు. అది చేయుటంలో అతడు స్వర్గం చేరటం ఖాయం. అదే ఆధర్మం పాటించటంలోగల గెలిస్తే సరేసరి. లేకపోతే స్వర్గప్రాప్తి. అలాకాక స్వధర్మ వ్యక్తిగత మమకారాలకు లొంగిపోతే ఏం జరుగుతుంది? ఐ కీర్తినశిస్తుంది. మానసికంగా పాపం చుట్టుకొంటుంది. తో అర్జునుడు బెదరి పారిపోయినాడనుకుంటారు. ఈ అపకీ యుద్ధంలో చచ్చినా నయమేకదా.

పర్యవసానంగా ఈశ్వరుడి అంశయైన 'నేను' తానేన ఈశ్వరుడు-విశ్వం-జగత్తు-సమాజం-వ్యక్తి యీావరుసలోగల రస్యం గ్రహించి బ్రతుకుబాటను ఏర్పరుచుకోవాలి. వ్యక్తిగ లను స్వధర్మంతో పాటుగ మాత్రమే పాటించాలి. సామాజి నికి (Ordauary law) జగద్ధర్మానికీ (International lav రేకత వచ్చినపుడు జగద్ధర్మానికి తిరుగు ఉండరాదు. జగ విశ్వధర్మానికి వ్యతిరేకంగా ఉన్నప్పుడు విశ్వధర్మమె ప్ర ఉంటుంది. దానినే పాటించక తప్పదు. అన్నిటికంటె పైన డున్నాడు కనుక అతడిని ఆశ్రయించటం "ఈనిచ్చేన ద్వారా నేను-అనే ఊహాను శ్రీకృష్ణుడు సూచించాడు.

కాగా సాంఖ్యంలో చెప్పిన ఈసూత్రాన్ని పట్టుకొని, హారికంలో అప్రశస్తంగా ప్రవర్తించమనికాదు. "నేను"

ప్రధానమైనదని మిగతావాటికి ప్రాధాన్యత తక్కువనీ చెప్పి ఇష్ట
మొచ్చినట్లు ప్రవర్తించడం తప్పని శ్రీకృష్ణుడు చెప్పి, స్వధర్మాన్ని
అనుసరించి తీరాలని కూడ నొక్కి, చెప్పినాడు. బ్రతుకును సరియైన
విధానంలో నడుపటంఎలాగో చెప్పటానికే ముందు శ్లోకాల్లో బుద్ధి
యోగం చెప్పతానువిను అన్నాడు శ్రీకృష్ణుడు.

39 40 సాంఖ్యయోగంలో ఆత్మవిషయం ప్రస్తావించారు.
ఆత్మ ఉత్కృష్టమైనదని మాత్రం చెప్పి బ్రతుకుబాట ఎలాఉండాలో
తెలియజెప్పటానికి బుద్ధియోగం చెప్పబోతున్నాడు. ఆత్మకంటె
తక్కువస్థాయి అయిన బుద్ధికి అందేది బుద్ధియోగం. అదితెలిసి దానిని
పాటిస్తే కర్మబంధం వదిలిపోతుంది. ప్రత్యవాయం ఉండదు. ఎంత
మేరపాటిస్తె అంత మేర శ్రేయస్సు కలిగిస్తుంది. స్వల్పమేపాటించినా
మహాభయన్ని పోగొట్టుతుంది. అన్నాడు శ్రీకృష్ణుడు.

41 ఇంకా అంటున్నాడు—ఈ బుద్ధియోగం. చేయవలసిన
పనులను చేయవద్దని ఆపేదికాదు. పైగా వ్యవసాయాత్మిక మైన బుద్ధి
కలిగి ఉండటమె దీనిలోని కీలకం భూమి వ్యవసాయం చేయకుండా
వదిలివేసినప్పుడు అందులో అనేక రకాలైన కలుపు మొక్కలు
మొలుస్తవి. కాని దున్ని యెండబెట్టి విత్తులు జల్లిన భూమిలో ఒకే
రకమైన మొక్కలు పటిష్ఠమై వస్తవి. అలాగె మనసును వ్యవసా
యంచేసి, బుద్ధియోగంకలిగి కర్తవ్యాలు చేస్తే, పనులు పటిష్టంగా
నడుస్తవి.

ఈ మొక్కలు కోరిక లనవచ్చు, కలుపు మొక్కలనేవి ఏకీకృ
తం కాని కోరికలు, అవి ఫలించవు. ఆనందాన్నివ్వవు. దుఃఖాన్నే
అనుభూతిగా ఇస్తవి. అలాకాక ఏకీకృతమైన కోరికను పోషించి
నప్పుడు మంచి ఫలితం కలుగుతుంది. ఈ ఏకీకృతమైన కోరిక ఏమిటి
అంటే-ఈశ్వరుడు-విశ్వం, జగత్తు, సమాజం ఈవరసలో మానవుడిలో
నున్న 'నేను'ను 'ఆత్మ'ను ప్రధానం చేసి బుద్ధిని గాడిలో నడపట
మనేది.

42-44 మానవునికి కలిగే కోరికలు వేటినిగాని తీర్చుకొనేందుకు వేదాలలో కొన్ని క్రతువులు చెప్పటం అయింది. అవి జరిపితె ఇచ్ఛలు తీరుతవి. అవి ఇంద్రియ విషయమైన కోరికలే అవుగాక. చేసే తీరులో క్రతువు చేస్తే అవి తీరటం నిజమె. కానిఅలా తీరుతున్నవా అంటారు. అవి అలా తీరని కారణం వాటిని చేసే తీరులలో చేయక పోవటం. కొందరు అవి చేస్తున్నప్పుడు తమ బుద్ధినిచేసే కర్మలపై ఉంచరు. రాబోయే ఫలంమీద ఉంచుతారు. వాళ్లుచేసే కర్మవట్టి చేతులూ కాళ్లతో మాత్రమే చేస్తారన్నమాట. శరీరంలో ప్రధానమైన మనసూ, బుద్ధీలు ఉండవలసిన విధంగా ఉంచరు. అందుకని క్రతువు సక్రమంగా చేయనివారవుతున్నారు. కోరికలు తీరలేదని గోలపెట్టుతారు తగినమనః స్థితిలేకపోయినా సక్రమంగాక్రతువుచేస్తే కలిగే (Vibratio s) వల్లమంచి జరుగుతుందని ప్రతీత. ఇదినమ్మే వారు చాలమంది ఉన్నారు. నమ్మనివారిని బలవంతంగా నమ్మింపా ల్సినపనిలేదు.

నిజానికి ఈక్రతువులు సమాజదృష్టిలేకుండా ఇంద్రియ విషయాలకు సంబంధించిన కోరికలు తీరటానికిగాను చెప్పబడలేదు. సమాజంలో వ్యక్తి చేయవలసిన కర్తవ్యాలను చేసి తగిన ఫలితాన్ని పొందటానికి గాను చెప్పబడినయి. అలా కర్తవ్యంగా చేసేటప్పుడు కూడ తగినట్లు తన శరీర మనస్సులను ఉంచుకొనటలేదు-జనులు.

'నేను' ప్రధానం చేసి కర్తవ్యం చేయవలసిందనే మాట వేదాలు చెప్పిన క్రతువిధానానికి - మరి - వ్యతిరేకమా? కాదు. వేదాలలో చెప్పిన క్రతువులను చేయ వద్దనిగాని, తక్కువ చేయ వలసిందనిగాని శ్రీకృష్ణుడు చెప్పటం లేదు. అవి చేయవలసినట్టివె. అవి చేయటంలో ఈ సాంఖ్యసిద్ధాంతం ఎరిగియున్న పిదపటబుద్ధియోగాన్ని అనుసరించి చేయవలసిందని బోధ. అది యెలాగో చెప్పటమె భగవద్గీతా సందేశం. కాని కొందరున్నారు, వారు వేదవాదరతులు. వారు వేదాలను మన్నించుతా రన్నమాటెగాని - క్రతువులవలన

తీరే కోరికే పరమార్థమనీ - ఇంకేదీ లేదని ప్రచారం చేస్తారు. అది సరికాదు. ఆ క్రతువులు చేసి దానివల్ల స్వర్గం పొందటం, మంచి అనుభవాలు పొందటం - ఇదె చాలు - ఇంకేదీ లేదు. అని-అభిప్రాయపడటం సరికాదు

అసలు విషయం ఏమిటంటే ఆ క్రతువులను కామాత్మానులై చేయటం కాదు ప్రధానం అంటున్నాడు శ్రీకృష్ణుడు. యజ్ఞాలుగా చేయాలి. కర్తవ్యంగా చేయాలి. త్యాగపూర్వకంగా చేయాలని అర్థం. ఏది త్యాగం? వ్యక్తిగత లాభం - కోరిక - ఏదివుందో తానిని త్యాగంచేయాలి. ఆ చేయటం బుద్ధితోనే చేయాలి. ఇదీ బుద్ధియోగం. చివరకు ఫలం వస్తే నాకు అక్కరలేదని త్రోసివేయమని కాదు ఇక్కడ చెప్పేది. ఆ క్రతువు చేసేటప్పుడు సరియైన బుద్ధి కలిగి ఉండమని, అప్పుడె అది యజ్ఞమనిపించుకుంటుంది. లేకపోతె వట్టి క్రతువె అది. భగవత్పరమవుతుంది. అలా అయికూడ, ఫలాన్ని-చేసినవానికి ఇస్తుంది.

శ్రీకృష్ణుడు చెప్పేది ఏమనంటె-ఫలం కోసం మాత్రమె చేయటం కాదు. బుద్ధియోగంతో చేసి క్రతువులను యాజ్ఞలుగా చేయాలి. అదె ఈశ్వరుడు ఆదేశించిన కర్మ చేస్తున్నట్లు అవుతుంది. అలా కాకపోతె స్వార్థకర్మ అయిపోతుంది. దానివల్ల మనసు కేవలం ఫలితం మీదనె ఉండిపోవటంచేత కర్మ సరిగ జరగనే జరగదు. అందుచేత శాంతిని పొంది మనసు ఉత్తేజితంకాదు. వేదములు ప్రమాణములె. వేదకర్మలు చేయవలసినట్టివె. అంతే గాని వేదవాదరతులు చెప్తున్నట్లు కేవలం కోరికలు తీరడానికి క్రతువులు చేయడమే పరమార్థము కాదు. అని శ్రీకృష్ణుని మతం.

45 అర్జునా! కోరికలకోసం క్రతువులను చేయటంవలన కోరికలయితె తీరవచ్చు కాని చిత్తశాంతి చేకూరదు. ఈ కోరికలు త్రిగుణాలు అనె ప్రకృతి లక్షణాలవల్ల కలుగుతున్నాయి. నీవు

త్రిగుణాలనే వదలివేయవలసింది. నిర్ద్వంద్వుడవు కావలసింది. ఎల్లప్పుడూ "సత్" పదార్థరతి యందుండవలసింది. అంటె నిత్యమై యుండేదానినే ధ్యానించమని అర్థం. నిత్యమై ఉండేది ఏది? "నేను" అనేది-అని ఇదివరకె చెప్పటమయింది. "నేను" ఉన్నాను. "నాకు" గల కర్తవ్యం-సమాజపరమైన ధర్మం-స్వధర్మం నేను చేస్తాను. దాని ఫలం ఏంతవస్తే అంత. దానిపై కాదు నా బుద్ధి ఉండాల్సింది. ఈ కర్తవ్యకర్మపై ఉండాలి అనే ఆత్మవంతమైన ఆలోచన - నడత అదీ - కావలసింది.

46 మరి త్రిగుణాలను ఎలా వదలటం. వాటిని స్థిరంగా వదలిన వాడెవడు గనక? ఒక్క-భగవంతుడె అనచ్చు, కాని నిర్గుణుడైన భగవంతునితో తాదాత్మ్యమును పొందిన శ్రీకృష్ణుని వంటివాడు కూడ-త్రిగుణాల కతీతుడె. అందుకె శ్రీకృష్ణుడు భగవంతుడు అనేది. ఈస్థితి రావటమెలాగ? కోరికలు కోరని స్థితి అది. అన్ని కోరికలూ తీరినస్థితి అనటం మేలు.

నీరు కావాలంటె బావిని వెతుకుతాము. కానివరదవచి సర్వత్ర నీరునిండిపోయిన చోట ఉంటె నీటికొరకు బావిని వెదికేదేమిటి? బ్రహ్మము. అంటే అంతటా వ్యాపించి నట్టిదానిని-తెలిసి బ్రహ్మనిష్టయందే నిమగ్నుడైన వానికి సర్వమైన కోరికలూ— ఆ బ్రహ్మమునందే లయించి యుండటంచేత (లయించి పోవడంచేత)— ప్రత్యేకంగా ఉదయించవు. ఆస్థితి బ్రహ్మము నెరిగినందువల్ల కలుగుతుందని శ్రీకృష్ణుడు సూచించాడు. బ్రహ్మము నెరిగినవాడు బ్రహ్మణుడుగనుక, బ్రాహ్మణునకు ఆబావి నీరేంప్రయోజనం అనిఅలంకారకంగా శ్రీకృష్ణుడు చెప్పినాడు.

తిరిగి బ్రహ్మమంటే ఏమిటి దానినెలా తెలియటం అనేది చెప్పబోతున్నాడు శ్రీకృష్ణుడు 5-6 అధ్యాయాల్లో.దానికిది ప్రాతిపదిక అనిపిస్తుంది.

47 అర్జునా ఆచారంలో పెట్టదగిన సూత్రం ఒకటి చెప్తాను విను. కర్మ చేయటానికయితే మానవుడికి అధికారం వుంది. కాని

కర్మఫల మంతా నాదేను అనటానికి వీలులేదు. అలా అంటున్నానని "అసలు కర్మచేయను" అనికూడా అనటానికి వీలులేదు. కర్మకు ఫలితం ఉండకతప్పదు. అది కర్మచేసిన పద్ధతిమీద ఆధారపడిఉంటుంది. ఆఫలితం నాకే రావాలి అనే దృష్టిమాత్రం తగదు కర్మచేస్తున్న 'నీవు' అనే మాటకు అర్థమేమని? ఆసంగతి తరువాత ఎక్కడో చెప్తారుగాక, ఇంతరూ మాత్రం - కర్తవ్య కర్మలనే చేయాలి. కర్తవ్యకర్మలు స్వార్ధకర్మలు మాత్రం కాదు. ఇది ఎప్పుడూ జ్ఞాపక ముంచుకోవాలి. కర్తవ్యకర్మలు సమాజంకోసం చేయవలసిన వ్యక్తి ధర్మాలు స్వధర్మాలు.

48 అర్జునా ఈబుద్ధి యోగస్థుడవై ఉండు ఎల్లప్పుడూ ఇది సమగ్రమైన సూత్రం. అలా ఉండేదెలాగంటే సక్తిని వదలికర్మను చేయడమె. కర్మఫలం నీకు వచ్చినా ఇంకెవరికి వచ్చినా సమభావం కలవాడివై ఉండటం. దీనినె యోగం అంటాము. ఇదె బుద్ధియోగం. బుద్ధిని సరియైన స్థితిలో ఉంచటమే. ఇందులోని కీలకం. కర్మలు చేస్తూనె వుండాలి. సరియైన బుద్ధికలిగిన వారు ఏకర్మలు చేయాలో ఆకర్మలనే చేస్తూఉండాలి. ఏపరిస్థితులలో ఏఏకర్మలు చేయటం కర్తవ్యమో వాటిని చేయాలి. అదె నియతకర్మ. వాటి ఫలితాన్ని కేవలం నీస్వార్థం కోసం ఆసించకు. నలుగురి ప్రయోజనం కోసంఅంటే యజ్ఞపరంగా కర్మనుచేసి, నలుగురూ కర్మఫలం అనుభవించటమె ఉన్నతిని చేరటం. "ఫలితం నాకే రావాలి" అని అనటం ఎంత నికృష్టమైనది? మొదటిదినిష్కామ కర్మ అనేవారు కూడ ఉన్నారు. నలుగురకూ ఫలితం రావాలి అనుకోవటం కూడ కామమే కావటం చేత అది నిష్కామకర్మ కాదు, అనే వారూ ఉన్నారు, కర్తవ్యంకనక చేస్తాముగాక ఫలితం ఏ మొచ్చినా భగవదిచ్ఛ అని చేయాలంటాడు శ్రీకృష్ణుడు.

యోగి లోకవ్యాపారం చక్కబెట్టుతూనే ఉంటాడులోకంలో మెలగవలసిన తీరుగా మెలుగుతూనే ఉంటాడు. ఫలితంమీదలగ్నమై యుండదు బుద్ధి అంతే తేడా యోగికీ ఇతరునికిని పని చేయటంలో.

కర్మ పర్యవసానం ఫలం ఒక్కటే కాదు. దానితోపాటు పాప పుణ్యాలు కూడ ఉంటవి. స్వార్థం కోసం చేయటంలోనే పరపీడనం కూడ ఉంటుంది, అది పాపం ఇతరుల మేలుకోసం చేసేకర్మ పుణ్యాన్ని ఇస్తుంది. ఈ రెండుకోరికలూ లేకుండా "కేవలం కర్తవ్యం అయింది-కనుక దానిని చేసేశాను" అనేవానికి పుణ్యము గానిపాపము గాని అంటదు. ఇదియోగికి కలిగే ప్రత్యేకమైన హితము. ఈహితము వల్ల యోగికి చిత్తశుద్ధి కలుగుతుంది. ఆపైన జన్మబంధం నుంచి విముక్తుడవుతాడు.

అలా అన్నామని చిత్తశుద్ధి కోసం ఈ'పైన' పైనస్వార్థం వదలు కొంటున్నాను అని-పైనను ఎక్కడో వేయటం సరియైనది కాదు. చిత్తశుద్ధి ఒకానొక వస్తువుగా కొనబడగలిగేది కాదు. అది సాత్త్విక కర్మలవల్ల దానంతట అదిగా కలుగుతుంది. అందుకని ఫలానిది నాకురావాలి. ఫలానిది పోకూడదు అనే యోగక్షేమాలనుకర్మ చేస్తున్నప్పుడు మనసులోంచి వదలి వేయవలసింది. ఈకర్మ కర్తవ్య కర్మా-కాదా? అనేది నిశ్చయించిన తరువాత అది కర్తవ్యకర్మ కనుక చేయుట మేగాని ఫలంమీద మనసు పెట్టుకోవద్దని బోధ.

కర్తవ్య మంటే ఈపరిస్థితులో చేయవలసిందా కాదా అని యోచించి, చేయవలసింది ఏదోఅది అని అర్థం.

ఇతరుల కోసం కర్మ చేయటమంటె యీరోజుల్లో కొందరికి అర్థం కాకపోవచ్చు. అందుకె ఇతిహాసాలు చదివి వెనకటి వాళ్ళెలా దీనిని పాటించారనేది తెలియాలి.

ఋషులుండేవారు. వారి దగ్గర విజ్ఞాన విషయం తెలియటానికని శిష్యు లుండేవారు. జ్ఞానవిషయం వారికి చెప్పటమె ఋషులకర్మ. శిష్యులనుంచి వారేమీ ఆశించేవారు కారు. ఇక వారి ఇండ్లో స్త్రీలు వీరికి శుశ్రూష చేయటమే ప్రధానంగా మనే వారు.

స్త్రీలు పురుషులకంటె ఈ నిష్కామ కర్మ విషయంలో మంచి స్థితిలో ఉండేవా రనిపిస్తుంది ఈమధ్య ఈ దృక్పథంలోనుంచి తప్పుకు పోతున్న వాళ్ళెక్కువ మంది అవుపడుతున్నారుగాక. ప్రపంచంలో అది అభ్యుదయమని నమ్ముతున్నారు గనక వారు అలా మారుతున్నారు కావచ్చు. పూర్వము బాలిక కలగంగానే 'ఆడపిల్ల' అనేవాళ్ళు. అంటే అక్కడెక్కడో ఉండే పిల్లగాని ఇక్కడనే ఉండబోయేది కాదని అర్థము. ఎక్కడికో మెట్టినదై ఏ ఋషులకో, సాత్వికులకో శుశ్రూష చేసి తరించవలసి నట్టిదని భావము. వారి జీవితం అలా ఇతరులకు సమర్పణం చేయటం అవుతుంది.

పరార్థంకర్మలు చేయటమేమిటని ఈనాటికి శంకలు లేవదీస్తే తీయబడవచ్చుగాక. వెనుకటి రోజులలో అది ఆశ్చర్యకరమైన విషయ మేమీ కాదు. అది అప్పటి మన సంస్కృతి. ఇకముం దది వదలిపెట్టబడునదైతె కావచ్చుగాక.

49-53 కాగా ఫలాని పూర్వకర్మ - లేదా నిష్కామకర్మ అని మనవాళ్ళు అంటుండే కర్మ - చేస్తే నాకేం ఫలం వస్తుంది అని ఆలోచించటమే మోహా కలం. జ్యోతిషం నాకు చెపుతుంది అని విచారించడంకూడ మోహా కలిలమే ననిపిస్తుంది. ఇలాంటి మోకహాలిలంలో మనను ఎప్పుడు తగుల్కొనటం మానివేస్తుందో అప్పుడిక స్వార్థ విషయంలో వినవలసింది, వినదగింది ఏదీ ఉండదు. ఈఆలోచనలు మానివేసి ఉత్కృష్టస్థితిని జేరి బుద్ధి నిశ్చలమై వెళ్ళ టం జరుగుతుంది-అన్నాడు శ్రీకృష్ణుడు.

54-55 శ్లో॥ అర్జునుడు ప్రస్తుతః సాత్త్వికుడు. అనగా కర్తవ్య కర్మలను ధర్మంకొరకు మాత్రమే చేసే ఉద్దేశ్యం కలవాడు. ఇప్పుడు శ్రీకృష్ణుడు చెప్పిన ఈమూడవ సూత్రం-కర్మసూత్రం నిజానికితాను (అర్జునుడు) పాటిస్తున్నదే ననిపించింది అర్జునునకు. శ్రీకృష్ణుడు ధ్యానిసి చెప్పుతూ బుద్ధియోగమ నీదానివల్ల సమాధిస్థితి కలుగుతుందనీ

చెప్తున్నాడు. స్థితిప్రజ్ఞుడు కావటానికి అవకాశం ఉంటుందంటు న్నాడు. అర్జునుడు ఇంతకుముందే దేవేంద్రభోగాలిచ్చినా తనకక్కర లేదని అన్నాడు. అందరూ బ్రతికేందుకు వీలుగా యుద్ధంమానేస్తా నంటున్నాడు. స్థితిప్రజ్ఞుడి స్థితికి దగ్గరగానే తానున్నాడా అని అనిపి స్తోంది, బహుశా అర్జునునకు. అందుకని స్థితిప్రజ్ఞుని లక్షణాలేమిటో తెలిసికోవాలని అతడు శ్రీకృష్ణుని అడుగుతాడు. అప్పుడు శ్రీకృ ష్ణుడు స్థితిప్రజ్ఞుని లక్షణాలు చెప్తున్నాడు.

56-58 స్థితి ప్రజ్ఞుడంటే- పార్థా!- మనస్సుయొక్క అంత రాంతరాల్లో ఉండే అన్ని కోరికలు పూర్తిగా ఎప్పుడయితే వదిలి వేయబడి ఆత్మయందే నిమగ్నుడయి అలా వుంటంలోనే సంతుష్టి నందుతూ ఎవడుంటాడో, అతడు స్థితప్రజ్ఞుడు. దుఃఖ కారణం ఉన్నా ఉద్విగ్న మనుష్కుడు కాడు. సుఖ కారణం ఉన్నా స్పృహ పోగొట్టుకొనడు. ఉద్రిక్తత పొంది అందులో మునుగడు. కోరికే లేదు. ఇంకా క్రోధ మెందుకుంటుంది? అదీ ఉండదు. ఎవ్వరికీ భయ పడడు. తన శరీరం చచ్చిపోతుందనే భయమే ఉండదు. అలాంటప్పుడు ఇతరుల శరీరాలు చచ్చిపోతవి అనే భయం అసలే ఉండదన్నమాట! ఇంకా స్థితప్రజ్ఞునకు అన్నిచోట్ల అందరియందు ఏమాత్రం ద్వేషం లేని తనమూ అతి స్నేహం లేనితనమూ ఉంటుంది. శుభం ఇదనీ అశుభం అదనీ, ఇదే కావాలనీ అది వద్దేవద్దనే పద్ధతే అతడి ప్రవర్త నంలో ఉండదు. ఈ లక్షణాలు అర్జునిలో లేవు. ఇవి గలగాలి.

అంతేగాక ఇంద్రియాలు ఇంద్రియ విషయాలలో ప్రవర్తించే టప్పుడు ప్రతి క్షణానా జాగరూకుడై ఉంటాడు స్థితప్రజ్ఞుడు. ఎప్పటికప్పుడు తాబేలు తన అవయవాలను ఏలా లోపలకు లాక్కొంటూ ఉంటుందో అలా తన ఇంద్రియాలను ఇంద్రియ విషయాలనుండి లాక్కొంటూ ఉంటాడు. గుఱ్ఱమును కళ్ళెముతో లాగిపట్టినట్లు ఇంద్రియాలను లాక్కొంటూ ఉంటాడు.

చిత్ర మేమిటంటే, ఇంద్రియాలను అదుపులో పెట్టుకొనుట మనేది ఒక కర్మ అయినా స్థితప్రజ్ఞుడు చేసేపని అని చెప్పక అదివాని

లక్షణ మేను అని చెప్పటం విశేషం. అలా శ్రీకృష్ణుడు ఎందుకు చెప్పాడంటే స్థితప్రజ్ఞుని ఇంద్రియాలు వాటిఇష్టం వచ్చినట్లవి వెళ్ళ నేరవుగాక అయినా అతడు అదుపులో పెట్టుకొనటం అనేదానితో సరిచూచు కొంటూ ఉంటాడు. అందుచేత అది అతడి లక్షణంగానే చెప్పటం జరిగింది అనిపిస్తుంది.

స్థిత ప్రజ్ఞుడు కానివాడు లడ్డుచేతికి అందితెతినవచ్చు. అందింది కనక తిన్నాను అనిమాత్రం సమాధానం చెప్పవచ్చు. కాని స్థిత ప్రజ్ఞుడు అలాకాదు అతనికి ఒకానొక నియమం సమయం మంత్రో చ్చారణం సమర్పణం ఇన్ని ఉండవచ్చు బహుళ. ఇవన్నీ అయిన తరువాతనే అతడు తినటం జరుగుతుంది. ఇవన్నీ తిండిని అదుపులో పెట్టటానికె కావచ్చునుగాక. అది ఒక లక్షణంగా అతనికి ఉంటుం దంటున్నాడు శ్రీకృష్ణుడు.

59 ఈమాత్రమైనా చాలునా! స్థితప్రజ్ఞుడుకావడానికి? ఒంటే ఆమాత్రం చాలనే చాలదు. బుద్ధియోగంద్వారా బుద్ధిని నియ మించాలి. అదెలా? దానికి శ్రీకృష్ణుడేమన్నాడంటే 'పరందృష్ట్వా నివర్తతె' అన్నాడు.

'పరం' అంటే ఏమిటి? పరమును చూచినప్పుడు మనసుకు వ్యామోహం వదులుతుందంటే ఏమని అర్థం? ఇంద్రియాలద్వారా తెలుస్తూ ఉండేదానికి భిన్నమై ప్రత్యేకంగానున్న విషయంతెలియా లట. అది ఏదంటే "నేను" అనేది ఇంద్రియాతీతమైన 'నేను'ను అను భూతి చేయకలిగినప్పుడు నీమనసు, బుద్ధి, సర్వమూ అటు మళ్ళి ఉంటుంది గనుక, ఇక ఇంద్రియ విషయము మీదధ్యాస ఉండదని బోధ,

పెద్ద భవనం కట్టుతుంటారు. గోతులు త్రవ్వి రాళ్ళు పేర్చి ఉంచుతారు. ఎన్నోగదులు. ఇదెందుకు అలా త్రవ్వుతున్నారోత్రవ్వే వాళ్ళకే తెలీదు. వారి నడిగినామంటే వాళ్ళు ఆప్లాను వేసినవానిని చూపి వానిని అడుగమని చెప్తారు. అతడు అప్పుడది ఒక పెద్ద హోస్ట లనో, దర్బారనో చెప్తాడు. అప్పుడా త్రవ్వకాలు అనర్థకమని అని

పించనే అనిపించవు. తెలిసేవరకూ ఉన్న పరిస్థితి తెలిసిన క్షణానమారి పోతుందనేది ముఖ్యం.

చిత్రం గీస్తాడు చిత్రకారుడు, వట్టి గీతలు గీస్తున్నట్లు అవుపడుతుంది. అవెందుకు గీస్తున్నాడో మనకు తెలీదు. బొమ్మ పూర్తయింతరువాత మొదట గీచిన గీతలు చూదామన్నా అవుపడవు. గుర్తించలేము. అలాటిదె "పరము"ను చూచిన క్షణాన వ్యామోహం వదలి పోతుంది అనేదాని అర్థం. వ్యామోహం చూదామన్నా దొరకదని ధ్వని. నిమీలిత నేత్రాలతో ఒక దేవునిబొమ్మ ఉంటుంది. లేదా మహర్షి బొమ్మ ఉంటుంది. ఎప్పుడు చూచినా అది ఏదో ఆలోచనలో ఉండి మనసు గమనిస్తూనే ఉన్నట్లు ఉంటుంది. ఒకనాడెప్పుడో మనం ఒకానొక మూడ్‌లో ఉండి చూస్తూఉంటాం. అప్పుడు ఆబొమ్మ ముఖంలోని భావాలు మనతో మాట్లాడుతవి. ఆబొమ్మతో పాటు ఆదేవుని-(ఆఋషి) భావాలు అవగతమవుతవి. ఈసునిసితమైన తేడాయే పరం దృష్ట్వా వల్ల కలిగేమార్పు.

60 అలాగాక వట్టిగా మనసుతో మాత్రమే ఇంద్రియాలను అదుపులోపెట్టి చెవికి మాటలు వినరాకుండా, నోటికి రుచి అందకుండా ఎంత జాగ్రతపడినా ఎప్పుడో ఆఇంద్రియ విషయాలు బలత్కారంగా మనసు నెతమ వైపునకు లాగివేస్తవి.

61-63 అందుకని ఇంద్రియాలను నియమించడమెగాక, ఆత్మస్థుడై అనగా 'మత్పరుడయి' మనసును 'నా' యందే ఉండేటట్లుచేస్తే, ఇక ఈఇంద్రియాలు దానిని లాగలేవు. అలాకాక ఇంద్రియ విషయాలనె మనసు యోచిస్తున్నట్లయితె, వాటియందు అభిలాష కలుగుతుంది. దానివల్ల కామం, కామంవల్ల క్రోధం, క్రోధంవల్ల మోహం, మోహంవల్ల స్మృతి నాశం, స్మృతినాశంవల్ల బుద్ధిభ్రమణం దాంతో సర్వనాశనం కలుగుతవి. ఇది క్రిందికి దిగిపోయే నిచ్చెనయొక్క స్వరూపం.

64-66 ఇంతకూ ఈదిగిపోయే నిచ్చెనలోనున్న కీలకం జ్ఞాపకం చేస్తానువిను. అదేమిటంటే శాంతి నశించటం, శాంతినశించటానికి

మనఃప్రసాదత్త్వం లేకపోవటం, రాగద్వేషాలు మనసులో స్తుంటే మనసులో గొడవ రేగుతుంది. రాగద్వేషాలుకలుగ ఈశరీర పరికరాలైన ఇంద్రియాలు వాటిపని అవిచేసికొంటూ ఏమీ పరవాలేదు. అలా నడపటం చేతకావాలి. ఇంద్రియా క్షణాన అనుకొంటే ఆ క్షణంలో అదుపులో పెట్టుకోగలిగిన శక్తి మనసుకు కలిగియుండినట్లయితె అప్పుడు ప్రసాదబుద్ధి కుంది. ప్రసాదబుద్ధివల్ల అన్ని దుఃఖాలూ నశించిపోతాయి. బుద్ధి అచంచలమైన స్థితికి వెళుతుందని అర్థం. శాంతివస్తుందని శాంతి లేకపోతె సుఖమెక్కడిది?

67-72 పార్థా! ఇంద్రియాలను అనుసరించి మనసును నడవ వి, వాయువు నావను సముద్రంపై ఎలా లాక్కుపోతుందో మనసును లాక్కుపోతయి. అందుకె ఇంద్రియ విషయాలనుండి యాలను ప్రత్యేకపరచి నియమించాలి.

ఈవిషయం జ్ఞాపకముంచుకోను - సర్వభూతాలకూ ఏదిప కనపడుతుందో అది మౌనికి రాత్రిగా కనపడుతుంది.మానవ లు మనసుపై పెత్తనం చలాయిస్తూనే ఉండటమనేది సర్వ లకూ పరిపాటి. పగలు ఎలా పరిపాటిగ తెలుస్తోందో అలాగే రిపాటిగా తెలుస్తూనే ఉంటుంది. ఈభూతాల విషయంలో మాత్రం ప్రేరణలను పరిపూర్తి చేయటం అవసరం అనేదే ంచదు. అది ఇతరుల అనుభూతికి వ్యతిరేకమైన అనుభూతిఅన్న . వారికి పగలయితె వీనికి అది రాత్రి అనటం అందుకె.

అందుకని ఇంద్రియాలను జయించి ఇంద్రియ లక్షణాలను పజెయ్యాలి. ఇది తెలిసి ప్రవర్తిస్తాడు మౌని.

అలాంటి స్థితిలోనున్న మౌని ఎలాఉంటాడో చెపుతానువిను. నదులు రకరకాలయిన నీటిని అంతూ పొంతూ లేకుండా తెచ్చి ముందు వదులుతున్నా సముద్రుకించిత్తయినా మార్పుచూపదు. ట్టం పెరగడంగాని, తరగడంగాని, రుచి మారటంగాని, సము

ప్రాణికేమీఉండనట్లే, బాహ్యాంనుంచి మానికి ఎన్ని ప్రేరణలువచ్చి చేరినా, అవన్నీ తనలో లయించి ఊరుకొనటం జరుగుతుంది. నిలిచి ఉండనవి. నశిస్తవి. అనగా అతడి యందు కామ ముదయింపజేయ జాలవని ధ్వని. అప్పుడె శాంతి. అంతేగాని కామాలకు లోబడి వాటిని కోరేవానికి శాంతి అనేది ఉండదు.

కనుక కోరికలన్నిటినీ విడచి-కాంక్షారహితుడై మమకారం లేకుండా - అహంకారంలేకుండా చరిస్తుంటే అతడు శాంతిని పొందు తాడు- అదే బ్రాహ్మీస్థితి. ఈస్థితిని పొందిన తరువాత మనిషీ మోహాన్ని పొందజాలడు. మెట్టు నెక్కకుండా అలాగే ఉంటే చివ రకు శరీరం చనిపోయిన మీదట అతడికి మోక్షం కలుగుతుంది గాక- పరంలో లీనమయిపోతాడు గాక.

ఈ రెండవ అధ్యాయంలో చెప్పిందేమిటంటే 'వ్యక్తి' శరీ రానికి భిన్నమైనవాడు. అతడు శాశ్వతుడు, వ్యక్తి సామాజికుడుగ స్వధర్మాన్ని చెయ్యాలి. వ్యక్తిగత లక్షణాలకు ప్రాధాన్యం ఇవ్వ రాదు, అనగా సమాజంకోసం బ్రతకాలి. వ్యక్తి లక్షణాలకూ స్వధ ర్మానికీ వ్యతిరేకత కలిగినప్పుడు స్వధర్మమే చేయాలిగాని, వ్యక్తి గత లక్షణాలను పాటించరాదు. అలా బ్రతుకు నడపడానికి ప్రతి పదికగా మూడు సూత్రాలు చెప్పారు,

1) 'నేను' అనేది విలువైంది. శరీరము అంతకంటె తక్కువ స్థాయిది.

2) కర్తవ్యకర్మ చేయడానికే నీ కధికారముంది — లేదా అవకాశముంది. ఫలితమంతా నాకే రావలనుకోరాదు. రావల సింది రానేవస్తుందిగాక.

3) యోగస్థుడవై ఉండాలి (బుద్ధియోగం పాటించాలి) ఈ సూత్రాలనె ముందు అధ్యాయాల్లో ఎన్నో రకాలుగా విడ మర్చి చెప్పుతాడు భగవానుడు.

(ఇది రెండవ అధ్యాయము)

శ్రీకృష్ణ పరమాత్మనే నమః

# శ్రీమ ద్భగవద్గీతా మననము

## క ర్మ యో గ ము

### (మూడవ అధ్యాయము)

సమాజ కర్మలో నీ కర్తవ్యాన్ని నిర్వహించుటం నీ కయిన కర్మ.

భారత యుద్ధం ఆరంభం అవుతుండగా, శ్రీకృష్ణుడు అర్జునుడికి బోధిస్తాడు-సమాజ క్షేమ మనేది వ్యక్తిగత సుఖదుఃఖాల కంటె గొప్పదని, అందుచేత సమాజ సంక్షేమం దృష్ట్యా యుద్ధంచేసి ఒక వేళ అందులో చచ్చినా సరే స్వధర్మాన్ని నేరపటం వ్యక్తికి కర్తవ్యమనిన్నీ. స్వధర్మమంటె వ్యక్తి సమాజానికి గాను చేయవలసిన కర్తవ్యమే. అందుపైన పెద్ద ఉపన్యాసం చేసిన మీదట గాని, అర్జునునికి కొంత విషయం తెలియకపోయింది. ఎంత తెలిసినా ఒక సందేహం మిగిలింది. దాన్ని అర్జునుడు శ్రీకృష్ణుని అడుగుతాడు.

1-2. "కృష్ణా! ఆత్మ విలువైనదన్నావు - శాంతిని బ్రాహ్మిస్థితియందు పొందటం ముఖ్యమన్నావు. స్వకీయమైన క్షేమం చూచుకొని, సమాజపరమైన ధర్మాన్ని మానరాదన్నావు. అలాగే కానిద్దాం. కాని ఈ సైనికులంతా యుద్ధం చేయకుండా నిలిచిపోరాదా? బతికి బట్టకట్టుతారు. అలా బ్రతకటం ప్రజా సంక్షేమమయినట్టిదే కదా! అలా యుద్ధం మానిపించి శాంతిని పొందటం మంచిదిగాని, ఈ ఘోరమైన యుద్ధం నన్నెందుకు చేయమంటున్నావో అర్థం కావటంలేదు. నాకు చెప్పాల్సింది" అన్నాడు.

3. శ్రీకృష్ణుడు, సమాధానం చెప్తున్నాడు. "పార్థా! నీకు ఆత్మ - విలువ - సంగతి, సమాజ ప్రాధాన్యత, తెలిసినట్లే ఉందికాని, సాధనసంగతి తెలియలేదు. ఈ సమాజం వెళ్ళేగతిని మార్చి వీళ్ళనేదో మరమ్మత్తు చేయాలని చూస్తున్నట్లున్నావు. నీ స్వధర్మం వదలి నీవీ ఆలోచన మొదలుపెట్టావు. కర్తవ్యమే చేయలేని వాడివి సమాజాన్నే మారుస్తాననటం అప్రశస్తమైన పని. ఆత్మతో ఐక్యమైపై స్థితినంది, ఈశ్వరునితో తాదాత్మ్యం పొందితె, అప్పుడు సమా

జానికి పై స్థితిలో ఉంటావు కనక, ఈశ్వరుడవై సమాజ గతిని మార్చగలవేమో కాని, వ్యక్తిగా నీవు చేయగలిగింది స్వధర్మమే. అదె చేయాలి - చేయగలవు-నీవు. ఇంకేదీ కాదు. కాగా, నిష్ఠ రెండు రకాలు. సాంఖ్యులు ఆత్మయందు తాదాత్మ్యత పొందినమీదట, ఏ కర్తవ్యాన్నీ తమయందు చూడలేరు. వారికి ఏ కర్మలూ చేయక పోవటం, నిత్య సమాధీ, ఇవె నిష్ఠ. నీవు అలాంటివాడివి కాదు. కర్మ చేలాల్సిన వాడివి. కర్మయోగి కయిన నిష్ఠ నీది. అందుకని కర్తవ్య కర్మ అయిన స్వధర్మాన్ని వదలటానికి వీలులేక పోవటం- కర్తవ్య కర్మను మాత్రమే చేయటం - ఇదె నిష్ఠ. ఇంకా శ్రీకృష్ణుడు చెప్తున్నాడు.

4-6 అర్జునా! నీకయి నీవు యుద్ధం చేయకుండా దూరంగా వెళ్ళి కూర్చొందా మనుకుంటున్నావేమో - ఏ పనీ చేయకుండా. జ్ఞానినీ, మౌనినీ అనుకొంటూ ఉందామని ఆలోచిస్తున్నట్లున్నావు. దానివల్ల నీకుగాని, సమాజానికి గాని యే ప్రయోజనం ఉండదు. అందుకని అది నీ కర్తవ్యమె కాదని ధ్వని. ఐనా ఆలోచించు. క్షణ కాలమైనా పని చేయకుండా ఉండేదెలా? కూర్చొనటం కర్మ, కళ్ళు మూాయటం కర్మ. 'ఇక నేనేమీ చేయను' అనటం కూడ కర్మె. మనసుతో చేసే కర్మలు ఇలా క్షణానికి లక్ష. ఈ మానవ లక్షణమె కర్మలు చేస్తూ ఉండటం. దీనికి భిన్నంగా ఎలా ఉండటం రాయి లాగా? రాయికూడ తాను అలా స్తబ్దమై ఉండటమనే కర్మనే చేస్తూ ఉంటున్న దనవచ్చు ఒకవిధంగా. కర్మేంద్రియాలు మాత్రం పని చేయకుండా, కదలకుండా ఉంచితే చాలనుకొంటున్నావేమో. అలా ఉంచినా అంతరింద్రియాలూ, జ్ఞానేంద్రియాలూ పనిచేయటం మానుతవా? పైగా అది వట్టి అబద్ధపు బ్రతుకు కాదా అలా చేసే వాడి బ్రతుకు?

కనుక, ఒక విషయం ముఖ్యంగా గమనించు. ఈ బాహ్య కర్మలు మాని సన్న్యసించానటం మాత్రాన నైష్కర్మ్యసిద్ధి కలగదు. కర్మలు అందుకనె చెయ్యాలి. మానరాదు.

7-8 ఐతే 'ఏ కర్మలు చెయ్యాలి' అనేది సమస్య. ఇంద్రియాలు ఏది కోరితే దానినే చేస్తాను అనటం మాత్రం కూడదు. ఇంద్రియాల వెంటబడి వెళ్ళిపోయే మనసు గాలికి కొట్టుకొని పోయే నావతో సమానం. అందుకని ఇంద్రియాలను మనసుచేత నియమించి శాస్త్రబద్ధమైన కర్తవ్యకర్మలు చేయాలి. కర్తవ్యకర్మ ఏది అనేది శాస్త్రదృష్టితో బుద్ధిచేత నిర్ణయించాలి. బుద్ధిమంతులు నిర్ణయించిన కర్మలు కర్తవ్యాలని చేస్తున్నా సరె - ఫరవాలేదు. కర్తవ్యకర్మలు చేయక పోయినట్లయితే శరీరయాత్ర గడవనే గడవదు గదా. సమాజసేవ చేయాలి, భుక్తి గడవాలి. అవి చేయడానికి శరీరం కావాలి. ఆ విధంగా శరీరపోషణం కూడా కర్తవ్యకర్మ అనవచ్చు.

'ఇలా అన్నానని ప్రతి పనినీ శరీరక్షేమం కోసం అంటూ, స్వార్థ పూర్వకంగా ఆలోచించటానికి ప్రయత్నించ కూడదు. అది నీ మనసుకూ బుద్ధికీ బంధ హేతు వవుతుంది. ఇంతెందుకు? యజ్ఞంకొరకు మాత్రమే కర్మచేయాలి. అలాటి కర్మమాత్రమే నిన్ను బంధించనిది. అలాగాక, స్వార్థకర్మలు చేసినట్లయితె అవి నిన్ను బాధించటం ఖాయం.' అన్నాడు శ్రీకృష్ణుడు.

9. యజ్ఞమంటే త్యాగపూర్వకమైన కర్మ అని అర్థం. కాగా కర్మలు ఎలా బంధిస్తవి? ఎలాగంటే కర్మ చేసేటప్పుడు స్వార్థమైన మనసుంటె, ఇతరులకు కష్టం కలిగించడానికి యోచించబడిన కర్మ అయితె పాపాన్ని యిచ్చినదై, అలా పాపంతో బంధిస్తుంది. స్వార్థం గాని పరపీడనంగాని లేకపోయినా తనవారైనా నరే ఇతర్లకు మేలు కలగాలని చేసే పరార్థకర్మలవల్ల పుణ్యం కలుగుతుంది. కనక పుణ్యం ద్వారా బంధనం కలుగుతుంది. స్వార్థానికి చేసినా పరార్థానికి చేసినా పాపంతో లేదా పుణ్యంతో బంధనం కలుగుతుంటుంది. కనక ఈ బంధనం ఆ కర్మ చేసేటప్పటి మనఃస్థితిమీద ఆధారపడి ఉన్నదనేది ముఖ్యం. గమనీయం. కాగా, కామంలేకుండా - అంటె తన లాభం కోసంగాని, పరుల లాభం కోసంగాని కాకుండా చేసిన కర్మవల్ల పుణ్యంగాని, పాపంగాని ఉండదు. అలా చేసేవారు స్వార్థం కోసమూ

పనిచేయరు - పరార్థం కోసమూ పనిచేయరు. నిష్కామంగా చేస్తారు. అంటే అలా చేయటం సమాజంలో తనకుగల కర్తవ్యాన్ని చేయ వలసి ఉండటంవల్ల మాత్రమె కేవలంగా చేస్తారు. ఆ కర్మ నిష్కామ కర్మ. అందులో ఎలాంటి 'సక్తి' గాని లేదన్నమాట. కర్మలలో తేడా ఇదీ.

10-13 ప్రపంచ రచన సంగతి చెబుతాను విను. వ్యక్తు లున్నారు. వీరంతా కలిసిఉన్న సమాజం ఉంది. సమాజా లెన్నో ప్రపంచంలో ఉన్నాయి. ప్రపంచాలతో నిండి విశ్వం ఉంది. ఇది చూస్తె సృష్టి అనేది విశ్వంనుంచి వ్యక్తి వరకూ చేయబడిందని పిస్తుంది. ఎందుకంటె ఎప్పటినుంచో విశ్వం ఉంది. దానిని నిర్వ హించడానికె నన్నట్లు ఈ భూమి - ఈ ప్రపంచం ఈ సమాజాలు- చివరకు ఈ వ్యక్తులూ అన్నీ సృష్టిఅయినయి, వ్యక్తులు పోతె మళ్ళీ వ్యక్తులు వస్తున్నారు. ప్రపంచాలు పోతె మళ్ళీ ప్రపంచాలు వస్తు న్నాయి. ఈ విశ్వం అలా నిర్వహించబడుతున్నది.

ఈ సృష్టిని చేసింది ఎవరు అంటె, 'బ్రహ్మ' అని పేరు పెట్టారు. నిజానికి 'ధర్మం' అనాలి. అంటె లక్షణం అన్నమాట. దేని లక్షణం? సృష్టి లక్షణమె. ఆ లక్షణానికి ఆ ధర్మానికి వ్యక్తిత్వ ముంది. అందుకని దానికి బ్రహ్మ అని పేరుపెట్టారు. కంటికి-ఇంద్రి యాలకు గోచరమయ్యె వాటికి మాత్రమే పేరు ఉండాలనే నియమ మేదీ లేదు. భావాలకు కూడ పేరు ఉంటుంది కదా. ఉదాహరణకు ఒక వ్యవస్థ, లేదా ప్రభుత్వం ఇవి ఎవరి పేర్లు? కంటికీ ఇంద్రి యాలకూ కనపడే వాటి పేర్లా? మనసులోని ఒకానొక మూల భావాలకు గల పేర్లు. అలాగే బ్రహ్మ అనే పేరుకూడా అంతె.

ఇంతకు ఆ బ్రహ్మ చెప్పాడట. "చూడండి! మిమ్ములను సృష్టిస్తున్నాం, మీతోపాటు యజ్ఞాలను కూడ సృష్టిస్తున్నాం (యజ్ఞం అనేదికూడ ఒక భావానికె పేరు). ఈ యజ్ఞాలు చేయటం వల్ల మీకు కలిగే ప్రేరణలు సంతృప్తి అవుతయిగాక. ఈ యజ్ఞాలకు అధిదేవత లుంటారు. వారె ఆ ప్రేరణలను ఉదయింపజేయటానికి

కారకులు ఒక విధంగా. ఈ యజ్ఞాలు చేస్తే ఆ అధిదేవతలు తృప్తి పడతారు. యజ్ఞంలోని త్యాగభాగమె దేవత అనవచ్చు. వారె యాజకుల కోరికలను పరిపూర్తి చేస్తూంటారు. ఈవిధంగా మీరు వారిని సంతోష పెట్టండి. వారు మీ కోరికలు తీర్చి సంతోషపెట్టు-తారు" అన్నాడు.

కోరికలు తీరటానికికాదు యజ్ఞాలు చేసేది, దేవతల తృప్తికి అంటె, మంచి మనసైనటువంటి, త్యాగపూర్ణమైనటువంటి దేవతల కోసం. ఆ దేవతలు మాత్రం - అంటే ఆ మంచి మనసే - ఏవయినా నీకు కోరికలుంటే వాటిని తీర్చుతవి అని అర్థం.

బ్రహ్మ ఇంకా అన్నాడు "ఈ యజ్ఞాలు వాళ్ళకోసం మేమెందుకు చేయాలి" అనద్దు. అలా యజ్ఞంగా చేస్తేనే మీకు పాపంగాని, పుణ్యంగాని అంటకుండా ఉంటుంది. అందుకని అలా చేయాలి. ఫలితం మాత్రం కార్య కారణ సంబంధం ఆధారంగా (సృష్టిలో అనుగ్రహం జరిగినంతవరకు) మీకు కలుగుతూనే ఉంటుంది. అలాగాక మీ కొరకె మీరు అన్నం వండుకు తిన్నట్లయితె, అది కేవలం స్వార్థ కర్మ కనక, పాపం భుజించిన వాళ్ళవుతారు. కనక అన్నం దైవ నివేదన కొరకు - దైవం అంటె సృష్టి అనుకోవచ్చు ప్రస్తుతానికి, ఈ పేరుకూడ ఒకానొక భావ విషయానిదె - వండి, దైవానికి నివేదించి ఆపైన భుజించు" అన్నాడు.

ఇదేదో పాత పురాణాల్లో సంగతి అని, బ్రహ్మ ఏదో ఒకానొక ఆచారంగా చెప్పాడు అనీ, అనటం కద్దు. అది సరికాదు. సమాజదృష్ట్యా యీ రోజుల్లో కూడా ప్రభుత్వం ఇలాంటి ఊహాలను చెప్తూనేఉంది. "దేశ సౌభాగ్యం కొరకు బ్రతకండి" అంటున్నది. అంతర్జాతీయ ధర్మం దేశ సమాజ ధర్మానికి భిన్నంగా చేసింది ప్రపంచ సౌభాగ్యంకొరకు కాదూ? సమాజ ధర్మం అంతర్జాతీయ ధర్మానికి వ్యతిరేకంగా గెలవరాదు కదా. బ్రహ్మ అన్నది కూడ - "మీరు ఒకరికోసం మరొకరు త్యాగం చేసికోవాలి" అనె. అదె యజ్ఞం అన్నాడు. ఈ రెండు భావాలకూ భేదం లేదనిపిస్తుంది. యజ్ఞంచేసి,

దానివల్ల కలిగిన ప్రసాదం భుజించటంచేత పాపం నివృత్తి అవుతుంది. అంటె (పాపం) operate కాదన్నమాట, అమలు కాదన్నమాట. దేశ సౌభాగ్యం అనే మాట మనమంటుంటే 'త్యాగం' అనేమాట బ్రహ్మ వాడినాడు. "అధిదేవత" అన్నాడు 'దేశం' అనే బదులు, దేవతలకు మనుషులలాగా శరీరాలుండవు. మనసే దేవతల ఉపాధి. భావమె - మంచి మనసె - అధిదేవత, త్యాగపూర్వకమైన మంచి మనసు కలిగి ఉండమనటం ఆ దేవతను ఆరాధించటమె నన్నమాట. ఆ దేవత సంతృప్తి అయితె - మంచి మనసు పూర్తమవుతుంది అన్న మాట. అంటే కావలసిన శక్తిని కలిగింపజేసి నీ కేమన్నా కోరిక వుంటె దానిని తీరుస్తుందని అర్థం. శ్రీకృష్ణుడు బుద్ధియోగం ఇదే ప్రాతిపదికగా చెప్పినాడు. ఆ యోగం ఏమిటంటె సక్తి లేకుండా త్యాగంతో, కర్తవ్యమేను, అనే నిశ్చయ భావంతో కర్తవ్యకర్మ చేయటమె. అపుడు పుణ్యపాపాలు అంటక, చిత్తశుద్ధి కలుగుతుంది అనిబోధ.

14-16 మనిషికి ప్రేరణలనేకం. బ్రతుకు వాటితో ముడి పెట్టబడిఉంది. వాటిలో తిండి ప్రేరణ మహా ప్రబలమైంది. అన్నం తింటేనే భూతాలు జన్మించేది. ఈ ప్రేరణను విచారణ చేస్తూ శ్రీకృష్ణుడు ఈ మొత్తం విశ్వచక్రం ఎలా చంక్రమిస్తోందో విశదీక రిస్తున్నాడు.

"ఈ అన్నం ఎలా కలుగుతోంది? ఆకాశంలోనుంచి వర్షం పడి భూమితో కలసి సస్యంగానయి ఆ విధంగా కలుగుతోంది మరి వర్షమెలా పడుతోంది? యజ్ఞంవల్ల నన్నాడు. యజ్ఞంలో త్యాగం గదా ప్రధానం. త్యాగంవల్ల అధిదేవతలు తృప్తులై శీతోష్ణాల మార్పుల మూలంగా నీటిని ఒక చోటినుంచి ఇంకోచోటికి ఆకాశం ద్వారా ప్రయాణం చేయించి తిరిగి దానినె త్యాగం చేస్తారు భూమి మీదకు. ఇంత మార్పుకు కారణం అధిదేవతలైన మంచి మనసుల త్యాగం అనేది గమనీయం. మేఘాల త్యాగంవల్లనె వర్షాలు కురుస్తున్నా యనేది నిత్యసత్యమైన విషయం.

ఈ యజ్ఞాలు వేదంలో చెప్పబడ్డ కర్మలపై ఆధారపడినయి. వేదాలు అనేవి ఏమిటను కొంటున్నారో! ఒక క్రొత్త వస్తువు బజారు నించి కొనితెస్తె దాని మెకానిజం అంతా బొమ్మల్లో చూపుతూ మీకు ఒక పుస్తకం కూడ ఇస్తారు దానితోపాటు. అలాంటిది వేదం. సృష్టి అనే వస్తువు ఎలా నడుస్తుందో ఎలా నడపాలో ఎలాటి మెకానిజం నీవు తెలిసికోవాలో చెప్పబడింది దాంలో. సృష్టి అయినప్పుడే అంతకుముందే, ఆ 'మెకానిజం' సృష్టికర్త తయారుచేశాడు. దానిని ఎరిగిన మీదట వ్యాసుడు ఇంకా బాగా దాన్ని ఎడిట్ చేసి నాల్గు వేదాలుగా మన కిచ్చాడు. వేదాలకు మూలం సృష్టికర్తె. అందుకె ఆ "జ్ఞానం" అంటె "వేదం" అపౌరుషేయాలనటం, వేదమంత్రాలు నేను చూచి వ్రాత వ్రాసి వేదాలు వ్రాసింది నేనే ననటం ఎంత పొరపాటో, వేదాలు మనుషు లెవరో వ్రాశారనటం కూడ అంతె. వ్యాసుడెప్పుడూ "నేను వేదాలు వ్రాశాను" అనలేదు. మనం అనాల్సిన పనిలేదు.

కాగా ధర్మమె బ్రహ్మము, సర్వత్ర నున్న ఈ బ్రతుకులన్నీ బ్రహ్మమునుంచి ఉద్భవించినవయి ఆలా బ్రహ్మమయ మయినయి అన్నాడు శ్రీకృష్ణుడు. అంటే మనం చేసే కర్మ - కర్తవ్యకర్మ - బ్రహ్మంనుంచి వచ్చిందెనని జ్ఞాపకముంచుకోవాలి. మన యీ కర్తవ్యాలన్నీ బ్రహ్మము యొక్క, అంటే సృష్టికర్త యొక్క మహా కర్తవ్యంలోని భాగాలె. ప్రపంచ చంక్రమణంలో జరగవలసిన ఎన్నో పనులు ఇలా వ్యక్తులు పంచుకొని భగవంతుడికి గాను - సృష్టికర్తకు గాను - సృష్టికిగాను అన్నా తప్పలేదు - తాము చెయ్యాలి. అందుకె ఆవి వారి కర్తవ్యాలనటం, సమాజంకోసం వారు చేయవలసిన యీ కర్తవ్యాలె వారి "స్వధర్మం"!

అందుకె తిండి తినటమనె కర్మకూడ యజ్ఞశిష్టామృతం చేసి తినమంటున్నారు. అంటే దేవతలకు అది నివేదించి యజ్ఞశేషం తినాలి. అదె యజ్ఞం చేయటం. రాక్షసులు అంటె చెడ్డమనసు· వారికి నివేదించమనలేదు. చెడ్డమనసు నుండి కాపాడి దేవతకు నివే

దించాలి. త్యాగబుద్ధే యజ్ఞం, అలా బ్రతకటమె పాపం లేకుండా బ్రతకటం.

"అలాగాక యీ ప్రపంచ చక్ర పరివర్తనకు వ్యతిరేకంగా (అంటె చెడ్డమనసుతో) ఎవడుగాని మెలగటం తటస్థించినట్లయితె అతడు ఇంద్రియ ప్రేరణకు బానిసఅయి, ఆశలు అనే మృగాలకు ఎరగానయి. పాపిఅయి నశించిపోతాడు సందేహం లేదు'.

కనక ప్రపచంలోని యీ బ్రతుకంతా బ్రతకాల్సిందే. మంచిగా బ్రతకాలి. కర్మచేస్తూ ఉండితీరాల్సిందే. నిష్ఠతోచేయాలి. ఆ నిష్ఠ ఏమిటో ముందు ఇంకా వివరిస్తారు. ఇప్పటి ప్రసంగవిషయం సాంఖ్యులేలా కర్మలు చేస్తారు అనీ యోగులుఎలా చేయాలనీగదా!

ఆత్మ సంతుష్టుడైన సాంఖ్యుడు అందరికంటె గొప్పవాడు. అతడికి కర్తవ్యమే లేదు. ఆత్మయందే మనసు నిలిపి నిరంతరం ఆనందించటమె అతడి కర్తవ్యం, అతడికి కర్మె లేదు కనుక సక్తకర్మ అసక్తకర్మ అనేవి అతడికి చెప్పటల్లేదు. అసక్తకర్మ బోధించేది ఆత్మ సంతుష్టుడు కానట్టి అర్జునునకు, మనకూను.

17-18. సాంఖ్యునకూ, కర్మయోగికీ కూడ ఆత్మచింతనం ఉంటుంది. అందులో తాదాత్మ్యత కలిగి ఆత్మయందే తృప్తినందు కొన్నవా రుంటారు. వారికి ఇంకో ప్రసక్తిఉండదు. మన శరీరాలను అతడు కళ్ళతో చూచిన అతడికి ఆత్మే అవుపడుతుంది. ఈ తాదాత్మ్యత కలిగినవాడికి ఇంకా చేయవలసినపని ఏముంటుంది? కాదు-అతడికి కర్తవ్యమేముంటుంది? అయితే తన శరీరపోషణనైనా అతడేమీ చేయనక్కురలేదా అనచ్చు. అదికూడ అతడు చేయడు. అయితె మరెలా? అది ఏమైనా సరె. అతడికి పట్టదు. కాని అతడి శరీరం కూడ అతడికి సహాకరించి ఆత్మరతి యందు తాదాత్మ్యత నొంది శీతోష్ణాలకూ, క్షుత్పిపాసలకూ భాధపడడు. అతీతమవుతుంది.

ఆత్మబలంవల్ల ప్రత్యేకంగా అతడికి కలిగిన శక్తియై యుండవచ్చునది-మొత్తంమీద అతడి శరీరం కూడ అతడికి సహాకరిస్తుంది కావచ్చు.

అలాంటి ముక్తజీవికి ఇంకా లోక వ్యవహారము లేముంటవి! ర్మ చేయవలసిన అవసరం లేని వాడతడు- కర్మలను ఆత్మయందే న్యసించినవాడు- అతడి నిష్ఠ అప్పుడేమిటంటే- ఇక నే కర్మగాని ర్తవ్యంగా చేయక సమాధిస్థితి యందుండి నిరతరం శాంతి ననుభ స్తూ ఉంటమె- వీరు జ్ఞానయోగులు.

19. కాగా,- నీవు ఆ జ్ఞానయోగిలాగా ఉండేవాడివి కాదని తెలిసికోను- నివుకర్మయోగి కయిన నిష్ఠనే చేయాలి. సామాజిక ర్మ ప్రకారము నిధ్యుక్తకర్మలు చేయాల్సిందే తప్పదు. ఆకర్మలు చేయడంలో అసక్తతతో చేయటమే నికయిన నిష్ఠ. నీ కేది కర్తవ్య ర్మ అయిఉంటుందో- ఆ కర్మనే చేయాలి. అన్ని కర్మలనూ నెత్తిన వేసికొని చేయమనటల్లేదు. ఇది ఎంతో ముఖ్యమైన విష యం-ఏది కర్తవ్యకర్మ అనవచ్చును? నీవు ఏ పరిస్థితులలో ఉంటావో ఆ స్థితిలో చేయవలసిన కర్మ కర్తవ్యకర్మ. భోజనం చేయటంకూడ- ఆ సమయం వచ్చినప్పుడు-కర్తవ్య కర్మ అనవచ్చు- లడ్డూలు ఎక్కి తొక్కి తినటం కర్తవ్యంకాదు. ఇది తెలియుటానికి ఒక సూత్రం జ్ఞాపకం ఉంచుకొనటం మేలు- ఇంద్రియాలచే అశించబడి కేవేలం వాటిని తృప్తిపరచడానికి-అంటే-స్వార్థానికి చేసే పనులు సంకల్పా త్మకమైన పనులు అంటారు. ఇవి కర్తవ్యకర్మలుకావు- స్వధర్మాలు అనబడవు-సమాజానికిగాను తాను చేయవలసిన కర్మ అయినప్పుడే అది స్వధర్మం అటాం- ఏకోద్దికర్మలోమాత్రం- శరీరానికి సంబంధిం చినవి- కర్తవ్యకర్మలు అనవచ్చుగాక- మిగతావన్ని సమాజంకోసం చెయాల్సినట్టివె- జపతపాలు పూజలు యజ్ఞాలు అన్నికూడా.

20. ఈ లోకంలో మనం ఉన్నాం- ఈ శరీరాలను కలిగి ఉన్నాం- వీటికి సంబంధించిన కర్తవ్యకర్మలు చేయాల్సిందె. పరి పూర్ణయోగి అని ప్రసిద్ధిపొందిన జనక మహారాజుకూడ సర్వకర్మ లనూ లోకంకోసం చేస్తూండేవాడు అంటే స్వధర్మమైన పనులనే చేస్తుండేవాడు. తనకై తాను చేసుకోవలసిన కర్మలు లేకపోయినా లోక సంగ్రహార్థం చేస్తుండేవాడు. అలానే ఆయన చిత్తశుద్దిని పొంది నాడు జ్ఞాని అయినాడు. కర్మను వదిలివేయలేదు.

21-24. ప్రసిద్ధినొందిన వారెలా నడుచుకొంటారో అది చూచి సామాన్యుడుకూడ అలానే నడుచుకోవటం పరిపాటి. అందరిమాట అటుంచు, నేను ఉన్నాను (ఉన్నది.) మానవుడని అర్థం. దేహామే కాదన్నమాట, పురుషోత్తము డన్నా సరె. స్వార్థానికి ఈపని చేయాలి అనే పరిస్థితి ఈ 'నేను'కు 'నా'కు లేదు. ఈలోకంలో మాటకేమిటి-మూడు లోకాలల్లోనూ "నా" "నేను" అందరిలా ఎప్పుడూ పని చేస్తూనే ఉంటున్నాను(న్నది) గమనించు. అన్నాడు కృష్ణుడు.

శ్రీకృష్ణుడు అధియజ్ఞుని స్థాయిచేరి యీసంగతులు చెప్తున్నాడనిపిస్తున్నది. కనీసం అధియజ్ఞస్థాయిలోని అనుభూతిని అర్జునకు జ్ఞాపకం చేస్తున్నాడనైనా అనుకోగలం. తనను "నేను"తో సమానం చేసే అర్థం సూచించడం ఇక్కడ విశేష విషయం. చెప్పబోయే గహన విషయాలకు భూమికగా ఈ సంగతులు చెప్పటం సబబయిన విషయం ఇంద్రియాలనుంచి పైకిమనసునులాగిపైదోవలో పెట్టటం ఈ "నా" యొక్క (మానవుని యొక్క) పనిగదా!

"ఇంకా చెపుతున్నాను విను. "నేను" కొంచెం నిద్రమత్తుగా ఉంటే—అలా ఉండనే ఉండదుగాక—అదిచాలు. ఈలోకాలు ఈ మనుష్యులు అంతానూ- ఇంద్రియాలన్నినూ స్థబ్దమైపోతాయి, మనుషులు ఎప్పుడూకూడ ఈ "నాకు" (అనేదాన్ని) అంటే "నన్ను" (పురుషోత్తముడైన నన్ను) అనుసరించుకొని ఉంటున్నవాళ్ళే. అందుకె విద్యుచ్ఛక్తి ప్రసరించటం ఆగితే లైట్లు, ఫ్యానులూ పని చేయడం ఆగిపోయినట్లు ప్రపంచం పెద్ద నిద్రలో మునిగిపోతుంది." అన్నాడు ఈ శ్లోకాలో శ్రీకృష్ణుడు దేవకీనందనుడుగా ఆత్మగా పురుషోత్తముడుగా కూడ అనిపించేందుకు వీలుగా మాట్లాడినాడు- ఎవరిస్థాయిలో వారికి అర్థమయ్యేటట్లు.

మళ్ళి అంటాడు-నేను, 'నా' కర్తవ్యం చేయక వదలినట్లయితే అందరినీ పెడత్రోవ పెట్టించినవాడిని అవుతాను-అంటాడు ఇదేమిటీ! తాను కావాలి అని కోరి ఏది చేయలేనివాడు ఈ ఫలాని ఫలితం

తెప్పించినవాడి నవుతాను అనటం ఎమిటి? పురుషోత్తమస్థాయినుండి అధియజ్ఞస్థాయినుండిదిగివచ్చి దేవకీనందునిగా చెప్పినమాటా ఇది-అని పిస్తుంది. కాక సామాజికుడుగా కర్తవ్యం చేయాల్సింది మానవుడు-(తన ఇంద్రియాలతో కూడుకొన్న మానవుడు)- కర్తవ్యంవదలటానికి వీలులే దంటున్నాడు అనవచ్చు.

25-26. అధియజ్ఞునిస్థాయిలో ఈ శ్లోకాలు చెప్పుతున్నాడు మళ్ళ. ఇంతకూ కర్మను స్వకీయమైన ఫలితం కోసం చేయకూడక పోయినా లోకంకోసమైనా చేయాలి అన్నానుకదా! ఆచేయటంలో కూడ ఫలిలితంకోసం అవిద్వాంసుడెలా కావాలని చేస్తాడోఅలాగే విద్వాంసుడు కూడ "అసక్తతతో" లోకంకోసం చేయాలి. దీని అర్థం సక్తతతో చేసేవాడిలో అతిత్వరకుపోయి బుర్రచెడగొట్టుకొని కంగారు పడుతూ చేయమనికాదు. జాగ్రత్త విషయంలో అతడెంత జాగ్రత్తగా చేస్తాడో ఇతడూ అంత జాగ్రత్తతో చేయవలసి ఉన్నదని అర్థం. దీనినే కౌశలంగా చేయాలి అనటంలో అర్థం.

అజ్ఞానంతో పనులు చేసేవాడిని చూచి అతడి సక్తతను హేళన చేయవద్దు. అతడికి ఆదుర్దా కంగారు ఇవి లేకుండాచేసి, పనిని జాగ్రతగా చేయవలసిందని చెప్పాలి పైగా. అంతేగాని ఆ పనిని చేయటంలో సక్తిని పెట్టుకొనక - నీకు ఫలితం రావాలని ఆశించకూ అనే పరిణామ వాక్యాలు చెప్పవద్దు-అన్నాడు కృష్ణుడు. ఎందుకని? నీవు చెప్పే మాటల వెనకనున్న సత్యం అతడి మనసున కందదు-పని చెడిపోతుంది. అది దుష్ఫలితం కదా!

నీకు సందేహం కలగవచ్చు - అజ్ఞానంలో ఉన్నవానికి, నీకు తెలిసిన విషయం చెప్పటం ధర్మంకదా. అలా చెప్పకపోయినట్లయితే అధర్మరం త్రొక్కినవాడిని కాదా అనిపిస్తుంది. కాని అది మళ్ళి భ్రాంతి. ఇతరుడికి నీవు తెలియచెప్పట మనేది కూడ సత్త్వ గుణ లక్షణమె: గుణములను దాటవలెననె ధర్మం తప్పి నీ అహం యొక్క ప్రకర్షను కోరి ఇతరులకు చెప్పవలెనని కోరుతున్నావేమొ విమర్శించి చూడు. చేయవలసింది కర్తవ్యం అన్నప్పుడు, ప్రపం

చంలోని అందరు అజ్ఞానులను మార్చటం నీకు కర్తవ్యమా! అధి యజ్ఞకర్మగా చేపట్టిన స్థితిలో మఠాధిపతులు, క్రైస్తు, మహమ్మదు, బుద్ధుడు వంటి వారిస్థితిలో అది కర్తవ్యం కావచ్చు. సరదాకు చేసేపని కర్తవ్యం కాజాలదు. నిన్నడిగితే ఎవరైనా "ధర్మమేమిటని"-తెలిసికొనటానికిగాను అడిగినవాడై య్యుంటే - అతడికి చెప్పాల్సిందే. అది కర్తవ్యమే. మిగతాది కాదు.

27-29. పైగా - యీ కర్మలు చేసేది ఎవరని నీ ఉద్దేశం, ప్రకృతి. ప్రకృతికి మూడు గుణాలు. సత్త్వ - రజస్ - తమో గుణాలు ఈ ప్రకృతి యేమిటంటావేమొ. నీనుంచి ఆత్మను "నేను" అనేదాన్ని వేరుచేసి, మిగతాదాన్ని చూడు-అదీ ప్రకృతి. దానికే ఈ గుణాలు ఉంటున్నవి! వాటివల్లనే ఈ పంచభూతాలూ శరీరం ప్రపంచం అంతా పుట్టింది. దీనిని జడం అంటాం - కాని నిజానికి ఎప్పుడూ మార్పు చెందుతూనే అది దాని చైతన్యాన్ని కనిపింపజేస్తున్నది. అందుచేత కర్మను ఈ జడమైన ప్రకృతి ఎలాచేస్తుంది. అని సందేహపడవద్దు. విద్యుత్తు ఉంటే - తిరిగేది ఫ్యాను. అది జడమే గదా. అలాగే నీ చర్మం స్పర్శ ఆత్మకూడ ఈ పనికి కర్తను నేను అనటం అజ్ఞానంవల్ల కసిగిందే. నిజానికి యీ కర్మలన్నిటినీ జడాలు - పాదాలు - కాళ్ళూ చేతులూ - మనసులు గుణాల ననుసరించి చేస్తున్నవిగాని వీటన్నిటికిశక్తినిచ్చే "నేను" యధాతథంగా చేయటల్లేదు అంటాడు తెలిసినవాడు. కాని అజ్ఞానుల విషయంలో బుద్ధిభేదం మాత్రం కలిగించరాదు. ఇంతటి కథ అర్థం కానివాళ్ళకు దీని కథ ఇంతేనని పర్యవసాన విషయం చెప్పరాదు. ఇది విమర్శగా అర్థం కానివాళ్ళు "నాకు తెలుసు దీనిసంగతి స్థూలంగా" అని అనుకోవద్దని సలహా. మళ్ళీమళ్ళీ విని మననం చేయండి.

ఈ శాస్త్రము - అంటె ఈ 27—29 శ్లోకాల్లో చెప్పిన విషయము అధ్యాయంలోని పరమోత్కృష్టమైన విషయమనే సంగతి మరచి పోకూడదు. ఈ చెప్పటంవల్ల ప్రకృతి గుణాల్లో పడిపోయిన వారికి చిత్తచాంచల్యం కలుగవచ్చు. కనక అలా చెప్పవద్దు అంటూ

# సవరణ

ముద్రణలో తప్పిపోయిన యీ క్రింది పంక్తులను చేర్చి చదువవలెను. 56వ పుట, 16, 17 పంక్తులబదులు ఈ క్రిందిపంక్తులను చేర్చి చదువవలెను ఆతరువాత 18వ పంక్తి నుండి యథాతథముగా చదువదగును-

*గదా, అలాగే నీ చర్మం స్పర్శ సంగతిని చెప్పటం నీరక్తం ప్రవహించటం, ఆలోచనలు ప్రసరించటం ఇవన్నీ జరుగుతున్నాయి. ప్రకృతి లేకపోతే అంతటా వట్టి" నేను" అనేదిమాత్రం మార్పు అనేది ఎరుగనేఎరుగక ఉంటే ఈ పనులు జరగటం అనేదే వుండదు.

ఉదాహరణకు-తిసే తినే ఆహారం చల్లునతో నేసి కోపగించుకొంటాం. ఆపనిచేసింది చెయ్యి. లేదారజోగుణం. ఆత్మమాత్రంకాదు, మనస్సుఅనచ్చు, మనసుకూడ ఫ్యానువంటిజడమే. అదిమారుతుంటుంది నిద్రపోయినప్పుడు నశించిపోతుంటుంది. అదే అలా కంచం త్రోసి వేయింపజేసింది అనచ్చు, అది ఒకానొక స్థితినుంచి దిగజారడం చేత మరి- అలాంటి పని చేసింది. కాగా ఈ మనసూ బుద్ధీలు ఆత్మకు చాల సన్నిహితంగా ఉంటున్నాయి. అంటే ఈ బయటి ప్రేరణలు ఆత్మకు చేరే ప్రయాణంలోగల పరికరా లన్నింటికంటె ఇవి •అంటే మనసూబుద్ధీలుదగ్గరగా ఉంటున్నాయి. అందుకని ఈ "నేను" తనే ఆ పనిచేస్తున్నట్లు భ్రాంతిపడుతున్నది. ఆ భ్రాంతి పడటమనే పనితప్ప ఆత్మచేస్తున్న పనేమీ లేదు. ఇదే తత్త్వంలోని రహస్యం. (ఈసంగతి ఆధారంగానే నాల్గవఆధ్యాయంలో సాధన బోధిస్తాడు శ్రీకృష్ణుడు.)

ఆత్మ తన సంగతి మరచిపోయి శరీరంతో-అహంతో- తాదాత్మ్యం పొందటం ఉంది. జడమైన మనసుగాని, బుద్ధిగాని చేసే ఈ పనులన్నీ కేవలం తనే చేస్తున్నాననటం అహంకారం అని అంటాము, ఈ అహంకారంవల్ల(భ్రాంతివల్లఅన్నమాట)విమూఢాత్ముడైనఆత్మకూడ "ఈపనికి కర్తను నేను" అనటం అజ్ఞానం వల్ల కలిగినదే. నిజానికి ఈకర్మలన్నిటినీ ఈజడాలు- అంటే-

శ్రీకృష్ణుడు గుణకర్మల విషయం ప్రస్తావించాడు. కాని ఆవిషయం చెప్పటం ఆ మాత్ర ప్రయోజనానికే కాదనిపిస్తుంది. ఇంకా ఎందు కనిపిస్తుందంటే—

ఈ ప్రపంచంలో జరిగే కర్మలన్నీ 'నేను' అనేది చేయటల్లేదు. ఈ పరికరాలే చేస్తున్నాయి అని చెప్పటానికి. పరికరాలంటే యీ జడమైన ప్రకృతి అని అన్వయం. అది ఎక్కణ్ణుంచి వచ్చింది ? ఈ ఆత్మ ఎలా విశ్వకర్తయొక్క అంశగా అర్థం చేసికొంటున్నామో అలాగే యీ అనాత్మ కూడ అతడి ఇంకో అంశమంటున్నాడు శ్రీకృష్ణుడు. ఏడవ అధ్యాయంలో మళ్ళీ,—"భూమి రాపో౽నలో వాయుః, ఖం మనోబుద్ధి రేవచ అహం" ఇతి... మే... ప్రకృతి... అన్నారు. అదే నాల్గవ అధ్యాయంలో మళ్లీ ప్రస్తావించబడుతుంది. అందుకే ఇది ముఖ్యవిషయం అనటం. కర్మలు చేసేది "నేను" కాదు- ప్రకృతి. ఇది జ్ఞాపకముంచుకోవాలి.

30. కాగా జ్ఞానంలో నిమగ్నంకాని వారికి ఏమిటి నిష్ఠ ? లేదా సాధన ? అనే విషయం ప్రస్ఫుటంగా ఇక్కడ చెప్పబడుతోంది. అది ఏమిటంటే-

1. సర్వకర్మలనూ "నా" అనే దానియందు సన్న్యసించేయాలి. ఆ 'నా' 'నేను' అనే ఆధ్యాత్మనే మనసులో నిలిపివుంచుకొని యీ సన్న్యసించడ మనే పని ఒక్కటే అది చేయటం జరగాలి. "నేను చేయటంలేదు. ఈ పరికరాలు చేస్తున్నాయి," అని తెలియాలి. ఈ మనసూ, ఈ బుద్ధీ, ఈ యింద్రియాలూ చేస్తున్నాయి. 2. నిరాశ కలిగిఉండాలి. అంటే ఆశ తీరక దుఃఖిస్తూ ఉండాలని కాదు. అసలు ఆశయే లేనివాడై ఉండాలి. 3. ఇది నాది - అది నాది - అనే మమకారం ఉండకూడదు. 4. యుద్ధం మాత్రం - అంటే పనులు మాత్రం కర్తవ్యాలన్నమాట- చేస్తూండాలి. మొత్తం భగవద్గీతలో ఎక్కడ కక్కడ చెప్పిన జ్ఞానసాధన ఇదే. ఇదిచెప్పడానికె ఎన్నోసార్లు శ్రీకృష్ణుడు ఎన్నో దృక్కోణాల్లో అర్జునునకు చెప్తాడు. నిజానికి రెండవ అధ్యాయంలో చెప్పిన మాట

లనే సందర్భం మార్చి మళ్ళీ ఇప్పుడు చెప్పాడు. అలా ప్రతి అధ్యాయంలోనూ చెపుతూ ఉండటం ఎందుకంటే మనసుకు బుద్ధికి అనుసంధానమై అనుభూతిస్థితికి రావాలని! అందుకె అర్థం తెలిసి, భగవద్గీతను నిరంతరం పారాయణ - అంటే మననం - చేయవలసిందని చెప్పటం.

31-32. ఈ 'నా' ను గూర్చిన మతమును ప్రతిరోజూ ఏ మానవుడు శ్రద్ధావంతుడై - అనగా అంతరంగం నుంచి తెలిసి అనుభూతి చెయాలనే పట్టుదల కలవాడై నిష్ఠచేసి అనుసరించుతాడో అతడు ఈ అనుసరించటమనె కర్మవల్ల బంధితుడు కాడు. 'నా'ను గూర్చిన మతమన్నాను గదా అని - 'నా' అంటే దేవకీనందనుడైన నే ననుకొని- అసూయ పడిన వాడాయెనా సర్వజ్ఞానవిహీనుడై విమూఢాత్ముడై తెలివిలేక నశించిపోతాడు. 'నా' మతం అన్నప్పుడు "నీ మతం నే నెందుకు పాటించాలి" అనే అసూయ హఠాత్తుగా కలిగితె అడుక్కు వెళ్ళిపోతాడు.

33-35. నేను చెప్తున్నాను. నేను చెప్పేది నీకు నచ్చవచ్చు - నచ్చకపోవచ్చు. కాని ఈ నచ్చడం నచ్చకపోవడం అనేది. నేను చెప్పటంలో ఏమీ లేదు. నీ ప్రకృతి ననుసరించి ఉంటుంది. నిజానికి భూతాలన్నీ తమతమ ప్రకృతి ననుసరించి మాత్రమె నడచుకొంటవి. నీవేనన్న మాటేమిటి! ఏ ప్రాణి అయినా అంతే. ప్రకృతి త్రిగుణాత్మకమైనది. ఏ గుణంయొక్క పాళ్ళు ఎక్కువ కలిగిఉంటే ఆ గుణాన ఆ గుణానుసారంగా మాట అర్థమవుతూ ఉంటుంది. ప్రకృతిని యథాతథంగా ఎవరూ వ్యతిరేకించలేరు. ప్రకృతిని నిగ్రహించగలిగిందెవరు భగవంతుడు తప్ప? ఎంత జ్ఞానవంతుడయినా ప్రకృతిని నిగ్రహించ లేడు. గుణాలను దాటి విడివడలేడు. చేయగల్గిందల్లా గుణాలలో తనలో కలగివున్నపాళ్ళను మార్చుకోవచ్చు. ఆ మార్చటాని కయిన విధానాన్ని బుద్ధిద్వారా తెలిసి పాటించవచ్చు-అంతె. సత్త్వగుణం పెంచి ఇంద్రియాలను కొంత నిగ్రహించ

దానికి వీలుంది. అంతేగాని ప్రకృతిని పూర్తిగా జయించే వాడు లేడు.

ఇంద్రియాలు ఇంద్రియ విషయాల పైకి వెళ్ళట మనేది సహాజ ప్రేరణమైనప్పుడు అలా వెళ్ళనివ్వటం చెడ్డదని ఎలా అనడం అనే సందేహం ఉదయించడం కద్దు. దానికి చెపుతున్నాడు శ్రీకృష్ణుడు. ఇంద్రియాలు ఇంద్రియ విషయాలను ఆస్వాదించి నంత మాత్రాన యేమీ పర్వాలేదు. కాని దురదృష్ట వశాత్తు ఈ ఆస్వాదనం చేసేటప్పుడు రాగం - ద్వేషం - పుట్టుతవి. అవి వట్టి శత్రువులు. అవి మిమ్ముల్ని వశం చేసుకొంటవి. ఈ రాగద్వేషాలు గుణాల కారణంగానే పుట్టుతయి. ఇది కలుగకూడదు.

సమాజ ధర్మప్రకారం సమాజంలో నడుచుకొంటున్నప్పుడు ప్రతి ఒక్కడికి ప్రతి క్షణాన ఒకానొక కర్తవ్య కర్మ ఉంటులది గదా! ఆ కర్మనే ఆ సందర్భంలో అతడి 'స్వధర్మం' అంటాం. తాను ఆ ధర్మాన్నే పాటించాలి. అలాగాక ఇతరుడు చేయవలసిన పని తాను చేస్తానని రాగద్వేష కారణంగా ప్రతాత్నించిన వాడు భయావహామైన స్థితిలో పడిపోతాడు' పై అధికారి పెట్టవలసిన సంతకాలు నేనే పెట్టేస్తాను అని అతడి దగ్గర ఉండే నౌకరు అనుకొంటే ఏమవుతుంది ?

36. అర్జునుడు ఆలోచించి ఆలోచించి ప్రశ్న నడుగుతాడు. "శ్రీకృష్ణా ! 'మనసు' అన్నావు. దానినే నిశ్చయాత్మక మైన స్థితిలో 'బుద్ధి' అంటున్నాం- తెలిసింది. ఆత్మ అనే ఒకానొకటి శరీరానికి భిన్నమై ఉన్నదని దానికే ఎక్కువ ప్రాధాన్యత ఉందనీ అన్నావు. కాని శరీర నిర్మాణం ఈ నాల్గింటితో పూర్తి అయినట్లు కనపడదే ! మనసుతోనూ బుద్ధితోనూ ఆలోచించి స్థిరపరచుకోని పలానిపని చేయవద్దు అనుకొంటూనే ఆ పనిని తిరిగి చేస్తూ ఉంటాము. ఇలా చేయించేది ఆత్మ అనటానికి వీలు లేదు - అది ఏ పనీ చేయదు కనుక. మరి ఇంకా ఏదో ఉన్నదనిపిస్తోంది. దాని సంగతి చెప్పా

ల్సింది. 'వద్దు వద్దు' అనుకొన్న పనిని, మనసుకూ బుద్ధికీ వ్యతిరే కంగా ఎవరు ఎందుకు చేయిస్తాన్నారు?" అన్నాడు.

37. అందుకు శ్రీకృష్ణుడన్నాడు "నిజమే. ఆ నాలుగు కాక ఇంకా ఉన్నాయి. అవి గుణాలు. సత్త్వరజస్తమోగుణాలు- అందులో రజోగుణంవల్ల కామం ఉదయిస్తుంది. అదె క్రోధం అవుతుంది. రాగం ద్వేషం అనేవి ఇవె. ఇవన్నీ మనిషిలో భాగాలే. వీటిని గురించి తెలిసికొనే విషయం చెప్తాను. జాగ్రతగా విను.

38. ఈ కామ మనేది చిన్న వస్తువేంకాదు. రాక్షసుడిలా పెద్దది. ఎంతో ఆహారం కావాలి దానికి. దాని ఆహారం కోరికె. అది తీరనిది. అది ఉన్నదంటే దాని పరిసరాల్లో ఎక్కడా సంతృప్తి అనేది అవుపడదు. అందుకే అది మహాశని అనటం. క్రోధం కామంలోంచి వచ్చిందె. అదీ ఆ మోతాదులోనె ఉంటుంది. ఇవి రజోగుణ సన్నిభాలు.

38-40. ఈ కామక్రోధాలు శరీరంలో ఎక్కడుంటవో చెబుతాను విను. శరీరంలో అన్నిచోట్లా జ్ఞానం విస్తరించుకొని ఉంటున్నదన్న సంగతి నీకు తెలుసునా. జ్ఞానం లేకపోతె శరీరంలో ఏచోట తాకినా తెలియటం ఎలాకలుగుతున్నది. ఈజ్ఞానం ఆత్మలో నున్న పరమమైన జ్ఞానంలో లేశభాగమె అవునుగాక. అయినా అది సర్వత్ర శరీరంలో ఉంటున్నది. కాని ఆ జ్ఞానాన్ని ఆధారంగా చేసికొని, ఈ కామం కూడా దాన్ని ఆవరించుకొని ఉంటున్నది. కాని ఆత్మలోని పరమమైన జ్ఞానాన్ని అది ఆవరించుకోలేదు. ఇంద్రియాల్లోని జ్ఞానాన్ని మాత్రమె కామం ఆవరించుకొని ఉంటున్నది, అగ్నిని ఆవరించుకొని ధూమం ఉన్నట్లుగా, అద్దం నిర్మలంగా చేసి ఒకచోట ఉంచితే దానిపైన దుమ్ము సన్నగా పడినీడ కనపడనీయనట్లుగా, తల్లి గర్భంలో పసిగుడ్డుచుట్టూ ఒకానొక ఆవరణం ఉన్నట్లుగా ఈకామం శరీరంలో వ్యాపించి ఉన్న జ్ఞానాన్ని ఆవరించుకొని ఉంటున్నది. ధూమంవల్ల కలిగిన ధూళి విసరితె పోతుంది. అద్దం మీది ధూళి పాడిగుడ్డ తెచ్చి తుడిస్తేనేగాని పోదు. తల్లి గర్భంలో

నున్న ఆవరణ తొలగించడం ఇంకాకష్టం. అలాగే ఈకామరూపంలో ఆవరించిన అజ్ఞానం కొందరి విషయంలో శాస్త్రం వినంగానే వదలి పోతుంది. కొందరికి సాధన చాలా కాలంపాటు చేస్తేనేగాని తెలీదు. మరి కొందరికి కొన్ని శారీరక జన్మల తరువాతగాని తెలీదు.

ఇంతకూ ఈకామము యొక్క ప్రభావం శరీరంలో ఎక్కడ పని చేస్తోందో తిరంగా చెప్పలేదు. చెపుతాను విను. శరీరంలో ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, ఈ మూడింటిని కలిపి అధిష్టాన మంటాము. 'జ్ఞానం జ్ఞానం' అని ఇంతసేపూ చెప్పినది ఎక్కడ ఉన్నది అనేసంగతి తెలిసికొను, అది సర్వత్ర ఉంటుంది. ఈసంగతి మరిచిపోకు. జీవం ఎక్కడున్నదో అక్కడనల్లా ఈజ్ఞానం కనపడుతుంది మనకు జీవం లేనిచోటు కూడా జ్ఞానం ఉండేచోటే. అది ఇంద్రియాల్లో మనసులో బుద్ధిలో, కూడ ఉంటుంది. ఆత్మలో మూర్తీభవించి ఉంటుంది గాక, ఇక కామం అనేది ఒకటున్నదన్నానుకదూ! ఈకామం అదిష్టానంలో ఉన్న జ్ఞానాన్ని మాత్రం ఆవరించుకొని ఉంటుంది. ఇదే ఆ కామం అనేదాని ప్రభావం. ఇలా అదిజ్ఞానాన్ని ఆవరించిడంవల్ల జ్ఞానం కన పడని తనం విదితమవుతుంది. దాన్నె అజ్ఞానం అంటాము.

ఐతె జ్ఞానం ఈకామం వలన నశించిపోలేదు. దానికి నశింపు లేదు. అది ఆత్మలో ఎల్లి కాల్లలుగా స్థిరమై ఉంటూనే ఉంటుంది, అధిష్టానంలో ఉంటున్న జ్ఞానం కామంచేత కప్పబడి ఉండచ్చు గాక. "బుద్ధిఆత్మవైపునకుతిరిగి చూస్తేనేగాని ఆస్థితిలో అజ్ఞానంస్వచ్ఛంగా అవగతంకాదు. అందుకే ఆత్మను అనాత్మనుంచి వేరుచేసి ఆత్మవైపు తిరిగి అజ్ఞానాన్ని తెలిసి విభజించాలి మనను" అనటం.

జ్ఞానాన్ని యీ విధంగా ఆవృతం చేసే కామక్రోధాలు విజ్ఞాన విషయంలో మనకు శత్రువులు. అవిమన ఇంద్రియాలను, మనసును, బుద్ధిని, విమోహింప జేస్తవి. ఆత్మను ఏమీచేయలేక పోవచ్చునుగాక.

41 కనక చేయవలసిన సాధనేమిటంటే ఈ యింద్రియాలను కట్టుదిట్టంచేసి, వీటిలోని జ్ఞానాన్ని కామక్రోధాలు పూర్తిగఆవృతం చేయకుండ జాగ్రతపడాలి. జ్ఞానం మూతపడరాదని అర్థం. ఈకామ

క్రోధాలు వట్టి మహాపాపులు. అంటె స్వార్థంకోసం పరపీడనంచేసేవి అని అర్థం. ఇవి ఇండటం చేతనె ఇంద్రియాలు పాపం చేయ్యాలి పాపంచెయ్యాలి అంటూ ఉంటవి. నీవడిగిన ప్రశ్నలో మనసూ బుద్ధి గాక ఇంకెవరో వద్దన్నపని చేయిస్తున్నారన్నావే! వారు ఈశత్రు వులైన కామక్రోధాలే-ఇంద్రియాలను అక్రమించు కొన్నస్థితిలో అలా అంటవి. అవిఅలా ఆక్రమించు కోకుండా కట్టు దిట్టం చెయ్య టం పరమముఖ్యం. జ్ఞానపూర్వకంగా ఇంద్రియాలు ఉంచటం అవ సరం. అందుకనె ఇంద్రియాలను మిలిటరీ క్రమశిక్షణంలో సుస్థిరమై ఉండేటట్లు చేయాలి.

**42** కాగా, ఇంద్రియాలు ఆ శత్రువులను (కామక్రోధాలను) సర్వ సాధారణంగా జయించ కలిగినట్టివే. అందులో సందేహం లేదు. కాని శత్రువశమైనవంటే వాటి బలంవల్ల మనసును పాడు చేస్తవి. మనసు ఇంద్రియాల కంటె బలమైనదె సర్వసాధారణంగా. కాని ఇంద్రియాలతో మనసు ఏకమయిందంటే కామక్రోధాలకు జోహుకుంచేసి జ్ఞానవిహీనమై పోతుంది. అన్నీ అలా కలసి బుద్ధిని విమోహింప చేస్తయి. బుద్ధి అన్నిటికంటే బలమైనదె. తాను నిజంగా బలమైనదనె సంగతి తన దృష్టిలో ఉండాలి. అలాలేక మనసుతో పాటు మెత్తబడితె సర్వనాశన మవుతుంది. ఈ బుద్ధికంటె బలమైనది ఆత్మ అని చెప్పాను. ఆ ఆత్మ అనేవాడిని ఇవేవీ ఏమీ చేయలేవు. సూర్యుని వెలుగులో మంచివీ చెడ్డవీ అయిన పనులు అనేకం జరుగు తున్నా అవన్నీ సూర్యుడిని ఏంచేయ కలుగుతాయి కనక! ఆ ఆత్మ శుద్ధ బుద్ధావతారం. చాల నిర్లిప్తుడు. జ్ఞానపూర్ణుడు. అతడి వంక చూస్తేచాలు. చూసిన వాళ్ళకు జ్ఞానం ప్రకాశిస్తుంది. సూర్యుని చూస్తే ప్రకాశం అవుపడ్డట్లు ఆత్మవంక ఈ బుద్ధి, మనసూలు చూస్తే గదా బాగుపడేది. అందుకే అంతర్దృష్టిని కలిగియుండు అంటవి-ఉపనిషత్తులు. అప్పుడె నిర్మలుడైన ఆత్మను చూడటం అవుతుంది. అప్పుడతడి యందున్న జ్ఞానం ఈ బుద్ధికీ మనసుకూ తెలుస్తుందని ధ్వని.

43 అందుచేత సాధన పైనుంచి క్రిందకు రావాలి. బుద్ధి చాల బలమైందన్నాము కదా! దానిని ఆత్మమీద ఉంచు. స్థిరపరచు. బుద్ధి కంటె పరమైన ఆత్మను తెలిసికొని, దుర్జయమైన ఆ కామాన్ని వినాశమొనర్ప వలసినది. బుద్ధి బలంగా ఉంటే మనసు మంచి బలంగా ఉంటుంది. ఇంద్రియాలు అప్పుడేమీ చేయలేవు దాన్ని. ఇంద్రియాలు నియమవంతంగా ఉంటే ఈ కామ క్రోధాలు వాటిని కదిలించలేవు.

ఈ మూడవ అధ్యాయంలో ఒకానొక బలమైన సందేశం ఉంది. దానిని మననం చేయటం అవసరం.

రెండవ అధ్యాయంలో 'ఆత్మ' అనేది విశ్వస్థాయిలోని ఈశ్వరుడి అంశ అన్నారు. ఇక్కడ ఈ ప్రపంచంలో ప్రతివ్యక్తీ చేసే కర్మకూడ ప్రకృతి చేస్తుండేదే. "అహంకారి చేసేవి కావు" అనే భావాన్ని అనుభూతి చేస్తూ ప్రకృతికి (అంటే భగవంతుడికి అనచ్చు) అర్పితం కావలసినవి అనే బోధ చెప్పబడుతోంది. సృష్టి జరగడంలోనే "యజ్ఞం" అనేది కూడ దానితో ఏకంచేసి జరప బడిందట. యజ్ఞం అంటే త్యాగం—సమర్పణం. ఈ సమర్పణం మీదనె వ్యక్తుల మనుగడ నిలవాలని చెప్పటం ప్రధానవిషయం. నిజానికి సృష్టికూడ, పరమేశ్వరుడు తననే తాను సర్వథా త్యాగం చేయడంవల్ల జరిగింది. అందుకనే వ్యక్తులు కూడా ఆ పరమేశ్వరునికి తమ సర్వస్వం—కర్మతో సహా సమర్పణ చేయటమనేది తప్పనిసరి అయిన విషయం. ఇది సర్వ విధాల జరుగుతున్న విషయ మన్నాడు శ్రీకృష్ణుడు.

ఈ కర్మలన్నీ చేస్తున్నదెవరు? ప్రకృతీ అందులోని త్రిగుణాలున్నూ. ఈ సంగతి చాల గట్టిగా చెప్పినాడు శ్రీకృష్ణుడు. ఈ కర్మలన్నీ పురుషోత్తముడే లేదా సృష్టే తనలో భాగమైన అనాత్మ ద్వారా చేయించివేస్తున్నాడన్న ధ్వని అవుపడుతోంది. ఈ కర్మలన్నీ ఆవిధంగా అతడికి (లేదా సృష్టికే) సమర్పణం కావలసినట్టివి. అవుతున్నట్టివి. ఈ సమర్పణం ఇలా జరుగుతున్నదన్న విషయం ఈశ్వరునిలోని అంశమైన వ్యక్తి, బుద్ధిద్వారా ఎరుగవలసి యున్నదని

బోధ. అప్పుడె వ్యక్తి తనై చేస్తున్న పనులకూ భగవదిచ్ఛకూ, లేదా సృష్టికి సామరస్యం కలిగి అతడికి జ్ఞానవిషయం తెలిసి అమరత్వం సిద్ధిస్తుంది అని చెప్పటం ఇందులో ఉన్నది.

ఇక జ్ఞానాన్ని బుద్ధిద్వారా సాధనచేసి తెలియటం ఎలాగో నాల్గవ అధ్యాయంలో చర్చించటం చూస్తాం.

ఇది మూడవ అధ్యాయం

శ్రీకృష్ణ పరమాత్మనే నమః

# శ్రీమ ద్భగవద్గీతా మననము

(నాల్గవ అధ్యాయము)

జ్ఞానాన్ని దర్శనంచేసికొని కర్మచేయాలి-అప్పుడు జీవితమె యజ్ఞం అవుతుంది-అదే సాధన

శ్రీ కృష్ణుడు మూడో అధ్యాయంలో సృష్టిచక్రం ఎలా నడుస్తుందో అర్జునునికి వివరించాడు. "ముందు బ్రహ్మము తరవాత యజ్ఞము ఆమీదట పర్జన్యుడు. దానివల్ల అన్నం. అన్నంనుంచి భూతాలు, వాటివల్ల యీవ్యక్తి శరీరాలు, ఇదిసృష్టి సరళి. ఈశ్వరుడే తనను తాను ఆత్మగా అనాత్మగా విభజించుకొని, మళ్ళీ అనాత్మను ఉప విభాగాలుగాచేసి వాటిని కొన్ని కొన్ని పాళ్ళుగా కలిపి ఇలా త్యాగంచేసుకోవటం ద్వారా మానవుడయినాడు. అందుకనె వ్యక్తికూడ త్యాగంచేస్తూనే బ్రతగాలి. అది తప్పనిసరి. వ్యక్తి సమాజం కోసం-సమాజం జగత్తు కోసం- జగతు ఈశ్వరుని కోసం త్యాగం చెయ్యాలి. ఈ చంక్రమణాన్ని ఎవరు అనుసరించరో వాళ్ళు పాపిష్టివాళ్ళయి పోతారు". అన్నాడు.

1-3 ఇంకా చెపుతున్నాడు శ్రీకృష్ణుడు. ఈ చంక్రమణాన్ని అనుసరించటం ఎలాగంటే అదియోగ విషయం. నీప్రవర్తన

ఈ చంక్రమణాన్ని కలిసి నడుస్తూ ఉండడం అనేదె యోగం. రెండు కలిస్తే అది యుగం-లేదా యుగళం-అంటుంటాము. అలా గుర్తు పెట్టుకోవచ్చు యీమాట. "ఈ యోగ విషయం నేనె సూర్యుడికి ఎప్పుడో చెప్పాను. సూర్యుడు ఇక్ష్వాకునకు చెప్పాడు. ఇరి పరం పరా ప్రాప్తంగా ఇప్పటివరకూ వస్తూ ఉన్నది. ఐతె ఇప్పటికి అది చాలాభాగం కృశించి నశించి పోయింది. దాని నిజస్వరూపాన్ని అంతా మరచిపోయిన ట్లున్నారు. దాని సంగతి ఎవరికీ ఇప్పట్లో సరిగా తెలిసినట్లులేదు. నేను నీకిప్పుడు చెపుతాను. నీవంటె నా కెంతో ప్రీతి కనక చెప్తానుగాక. విను" అన్నాడు.

శ్రీ కృష్ణుడు వెనక చెప్పిందెప్పుడు? సూర్యుడు ఈ ప్రపం చాలు ఉద్భవించడానికిముందుగా ఉద్భవించినవాడు. అప్పుడు వేద రూపంలో భగవంతుడై-అదె-సృష్టికర్తయై-చెప్పినాడు కావలె. ఆ వేదాలు పురాణాలు ఇప్పటివరకూ ఉంటూఉన్నా-శ్రీకృష్ణుని కాలంనాటికె (ద్వాపర యుగాంతం నాటికే) సరిగా అర్థం చేసుకో బడటల్లేదన్న ధ్వని శ్రీకృష్ణుని మాటల్లోవుంది. ఇప్పుడు మళ్ళీచెపు తున్నాడట. ఆ చెప్పబోయేవి మనకు తిన్నగా తెలిస్తే ఆవేదాలు, పురాణాలు ప్రత్యేకంగా చదవలేదే, కంఠస్థం చేయలేదే, అనేఖాధ పడవలసినపని లేదనిపిస్తుంది.

4-6 అప్పుడు అర్జునుడు సందేహాన్ని వెలిబుచ్చుతాడు. "కృష్ణా! నీవు సూర్యునకు ఎప్పుడో చెప్పానంటున్నావు, ఎక్కడి సూర్యుడు, ఎప్పటి ఇక్ష్వాకు. నీవు ఇప్పటి వాడివి, నీమాట నేను నమ్మట మెలాగ" అన్నాడు. ఈ ప్రశ్నాధారం చేసికొని శ్రీ కృష్ణుడు "నేను" (అనేది) ఈశ్వరుడేనని అదె-సృష్టికర్తేనని-చెప్ప కుండా చెప్తాడు. ఈభావంతో ఉపన్యాసం ప్రారంభిస్తాడు. 'నేను" దివ్యుడు. "నీవు' అంటె అర్జునుడు-త్రిగుణాత్మకుడు. "నాకూ' 'నీ' కూ జన్మలెత్తడంలో అంటె శరీరాలు పొందటంలో, అనుభవించ డంలో తేడాలేదుగాక.అనేక శరీరాలయినయి మనకు, కానిఈజన్మల సంగతి-శరీరాల సంగతి-దేవకీనందనుడైన "నా"కు తెలుసు. అర్జు

నుడైన నీకు తెలీదు. ఈతేడాయే నీవిప్పుడు తెలిసికోవలసింది. నేను నాతల్లి గర్భంలో శరీరాన్ని పొందేముందు ప్రకృతిని అధీనంలో ఉంచుకొని మరీ యీఉపాధిని పొందటం జరిగింది. అర్జునుని ఉపాధిని పొందేటప్పుడు అలా ప్రకృతిని జయించిన మీదట ఆ "నేను" ఉపాధిని పొందలేదు. ఇదే నీకూ నాకూ తేడా. నేను (దేవకీ నందనుడను) అందుకని దివ్యుడను. నీవు (అర్జునుడవు)కావు. ఇప్పుడైనా నీవు ప్రకృతిని జయిస్తే నాలాగా దివ్యుడవె అవుతావు. నేను దివ్యుడను. అందుకె నేను అజుణ్ణి, అవ్యయుడ్ని, భూతాలకు ఈశ్వరుడిని. ఇది జ్ఞాపకముంచుకొను.'

7-8 "నీవు ఈప్రకృతిని జయించి జన్మించడం, నేను అలా కాక పోవటం, ఈవిచక్షణ ఎందుకు చేశావు' అనీ 'నేను' అంటున్న నన్ను ప్రశ్నించాలిని చూస్తున్నావు కొంచెం తగ్గు. నీవు నీపరిస్థితుల్లో ఉండి నీచుట్టూగల శరీరంలో వాతావరణంలో తాదాత్మ్యం పొందావు. అది ఎవరి పొరపాటో లేదా విచక్షణో అని మళ్ళీ భ్రమ పడకు నీదే, ఈతాదాత్మ్యం నుంచి బయటపడాలి. ఆపనిని నేను చేశాను. అలా దివ్యుడను అయినాను. నీవుకూడ అలాకావటం నీలో ఉంది. ఇక్కడ ఒక చిన్నవిశేషంచెపుతాను. 'నేను' "నీవూ" అనే భావాలతోపాటు "ఈశ్వరుడు" ఇనేభావం ఒకటుంది.ఈ'నేను' అనే ఏఅనాత్మతో గాని తాదాత్మ్యం పొందని స్థితిలో ఈశ్వరుడవుతాడు అతడికి ప్రత్యేక ప్రతిపత్తి ఉంది. నీలాగనే నేను జన్మించక ప్రకృతిని జయించి ప్రభవించటం "ఆ ఈశ్వర సంకల్పం" అని అంటే-ఈక్లిష్ట సమస్యలోని వివరాలు నీకు తెలుస్తవనుకుంటాను. ఎప్పుడెప్పుడు ధర్మ గ్లాని కలుగుతుందో అంటే సృష్టిలక్షణంయొక్క సరళికి గ్లానికలుగుతుందో అప్పుడు అధర్మంనుంచి ధర్మాన్ని ఉద్ధరించవలసి ఉంటుంది. ఆఅవసరమె ఈశ్వర సంకల్పం అయి వెలుస్తుంది.

అయితె ఈశ్వరుడున్నాడా? ఉంటె అలా, ఈశ్వరుడెందుకు దిగిరావాలి? మంత్రంపెట్టినట్లు ఒక్కచిటుకుతో ఈఅధర్మపరులను మాయం చేయరాదా? అని సందేహంరావచ్చు. కాని అదిసరికాదు. ఆయన అదె నేను (అనే భగవానుడు) స్వార్థంకోసం ఇలా వస్తున్నాడనుకొనకు. దుష్టశిక్షణ శిష్టరక్షణే ఉద్దేశం కాదు, ధర్మసంస్థాప

నం ఒకటుంది. ధర్మంను అంతాపాటించవలసిందిగా చేసి చూపి నిశ్చ యించి, స్థిరంచేయవలసిన అవసరంకోసం అలావస్తున్నాడు ఆ'నేను' అదె భగవదవతారము అంటాము. అది స్వతంత్రుడైన "నా'యొక్క అవతరణం. మీలో (త్రిగుణాత్మకులలో) నిల్చిమనుతూ ధర్మం ఆచ రించి తెలియజేయాలి. ఇది మీ కోసం- ఈ విశ్వంకోసంచేసే ఈ'నా' లోకకర్మె-నాకర్మ. అవతార పురుషుడూ దివ్యపురుషుడూ అయిన నాకర్మ. అది నిష్కామకర్మ అనేది మరువకు. అలాచేయటం కర్త వ్యంగా మాత్రమె ఉండటంచేత ఈ ఉపాధిని ధరించిన నేను దానిని చేస్తుంటాను. పాపపుణ్యాలు నాకు అంటని కారణం చేతనె. నేను దివ్యుడయింది అందుచేతనె.

9. నా శరీర జన్మ ఎత్తినప్పటివలె నీ ఆశరీర జన్మమప్పుడు ప్రకృతిని జయించటం కాలేదు. నీవు అందుకని త్రిగుణాత్మకుడవె. కాని ఈ గుణాలను దాటటంవల్లనె మానవుడు దివ్యుడు కాగలడు గాక. నీవు ఇప్పుడైనా ప్రకృతిని వశపరచుకొంటె దివ్యుడవు అవు తావని ధ్వని. తత్త్వతః, 'నా','నీ' తేడా తెలిస్తే నీవుఆ "నన్ను"ను పొందేస్తావు. ఈశ్వరుడవు కాగలవన్న మాట.

10. త్రిగుణాల నతిక్రమించి స్వచ్ఛమైన నేనును అను భూతి చెయ్యాలి. ఈ నేను త్రిగుణాలలో చిక్కుబడి కశ్మల భూ యిష్టమయి మనచేతల్లో 'అహం'గా పరిమితమయిపోతున్నది ఈ కశ్మలాన్ని కడిగెయ్యాలి. అప్పుడు 'నేను' స్వచ్ఛమై, ఈశ్వరు డవుతుంది. అందుకు, ఈ 'నేను'ను శరీరంనుంచి, శారీరిక విషయా లనుంచి వేరుచేసి చూడాలి. రాగం, భయం, క్రోధం అనే మూడు భయంకరమైన శారీరిక విషయాలున్నాయి. వాటిని ఈ "నేను"తో కలవకుండ దూరంగా పెట్టాలి. వాటిని విడివిడిగాచేసి, ఈ"నేను"ను దర్శించాలె, ఆస్థితిలో "నేను" దివ్యాత్మ అవుతుంది. దివ్యత్వమందు కొంటుంది. ఇది జ్ఞానం. ఈ జ్ఞానా న్నెరిగిన మనపూర్వులు పవిత్రు లయినారు. మద్భావాన్ని పొందారు. అంటె "నేమ దివుణీడను" అనే భావాన్ని పొందారు. అంటే "నాది" అనే ప్రసక్తి (రాగం) నాది కాదేఅనే ప్రసక్తి (భయం) నాదెందుకు కారాదు అనే ప్రసక్తి

(క్రోధం) వదలి నేను స్వచ్ఛమైన వానిని అనే అనుభూతి పొందారు. కనుక, ముందు బుద్ధి నుపయోగించి ఈ పై ప్రక్రియను ఎరగాలి. ఆతరువాత అనుభూతి అవుతుంది. ముందు శ్రద్ధగా విని తెలిసికోనటం కర్తవ్యం-అనిపిస్తుంది.

11. అలా యీ "స్వచ్ఛమైన నేను" అనేదేమిటో తెలిసికోకుండా ఉంటె-అసలు అలాటి భావం ఉన్నదనేదె తెలిసికోకుండా ఉంటె-ఈశారీరక విషయాల్లో ఈ నేను కలిసిపోయి, నేను తింటున్నాను-నేను తిరుగుతున్నాను-అనుకోంటూ, శరీరమే తాను అనుకోంటూనే ఉండటం జరుగుతుంది. అసలు పై భావాలు విని తెలియటమే లేకపోతె అవి ఎప్పుడో అనుభూతి చేసి విముక్తిని పొందటమనే సంగతె ఉండదు. అప్పుడా నేను, 'దివ్యుడు'గా కాక చావు పుట్టుకల శరీరిగా ఉండిపోతాడు, ఆఫీసుపని చేస్తూ ఇంట్లో విషయాలే పూర్తిగా మరచిపోయినట్లు, దివ్యుడనే మాటమరచి శరీరగా ఉంటాడు. ఈ "నన్ను"ను ఎవరు ఎలా భజిస్తారో అలాగే వారుంటారు. అంతా "నేను"ను ఆరాధించే వాళ్ళే. 'నేను' అధికారినంటాడు, నేను ఇంటికి పెద్దనంటాడు. నేను తెలియని వాణ్ణంటాడు. నేను దివ్యుడనని కూడ శ్రీకృష్ణునిలా అనుభూతి చేయచ్చు. అలా దివ్యులూ త్రిగుణాత్మకులూ ఇద్దరూ కూడ ఆ 'నేనును' ఆరాధించే వాళ్ళే. వాళ్ళు ఎలా ఎలా ఆరాధించారో. వాళ్లు అలా అలా అవుతున్నారు. అందుకె "సర్వశః మనుష్యాః మమ వర్త్మాను వర్తంతే" అనటం ఇదంతా ఎందుకు చెప్పడ మంటే ఈ నేనును శారీరిక విషయాలనుంచి విడగొట్టి ఆరాధించడ మనేదే పైన చెప్పిన యోగమునకూ అందుగల జ్ఞానమునకూ సంబంధించిన విషయం అని చెప్పడానికి.

12. ఈ ప్రపంచంలో ఉన్న జనులందరినీ రెండు తరగతులుగా చూడవచ్చు ఒకరు దివ్యులు ఇతరులు త్రిగుణాత్మకులు. త్రిగుణాత్మకులు కామాత్మానులు, కాంక్షాపరులు. రాగం భయం క్రోధం అనే వాటితోకూడుకొని "నేను"ను సేవిస్తారు. ఇవి రజోగుణ లక్ష

ణాలు. ఇవి "నాది-నాది" అనే స్థితికి పునాదులు. వేదాల్లో క్రతువులు చెప్పబడ్డవికదా! వాటిని కూడ వీరు కాంక్షాపూర్ణంగా చేస్తారు కాని, నిష్కామంగా చేయరు. ఫలం కోసం చేస్తూ, ఆచేసేటప్పుడు ఆ పనిమీద గాక ఫలంమీద బుద్ధి వుంచుతారు. అలా స్వార్థంలో నిమగ్నమై ఉండడంచేత వీరికి దుఃఖమే కలుగుతుంటుంది. వీరు సమాజాన్ని నిష్పాక్షికంగా చూడటమే మానేస్తారు-కాలక్రమాన కామాత్మానులే అయినా దివ్యులమన్నట్లు ప్రవర్తించి అధోగతిలో పడిపోతుంటారు. వీళ్ళ-పాపం--సమాజాన్ని ఎలా సరిదిద్దకలుగుతారు? పక్షపాతబుద్ధి కలవాడు న్యాయమూర్తిగా తీర్పునెలా ఇవ్వగలడు?

13. దివ్యులమాట అలాఉంచి ఈ త్రిగుణాత్మకులు వాళ్ళ వాళ్ళకు గల సహజగుణాలను బట్టి నాలుగు రకాలుగా చెప్పవచ్చు. ఆ గుణాల పాళ్ళ ననుసరించి వారు స్థూలంగా నాల్గురకాలు. నేను వాళ్ళని అలా పేర్లు పెట్టిపిల్చాను. వాళ్ళే నాలుగు వర్ణాలు-వీళ్ళు "మయాసృష్టం" అంటె 'నాది' 'నాది' 'నాచేత' అని వీళ్ళుతలచే ఉద్రృతాన్ని బట్టి సృష్టింప బడినారు. ఆ గుణాల తీవ్రతను బట్టి అలా పిలువ బడ్డారు. బ్రాహ్మణ-క్షత్రియ-వైశ్య-శూద్రులని ఆపేర్లు. గుణాల పాళ్ళను బట్టి అలావాళ్ళను నేను విభజించి పిలిచాను, ఆ పేర్లతో. అలా నేను పేర్లుపెట్టి పిల్చినంత మాత్రాన ఆ గుణాలను వాటి పాళ్ళను నేను వారి వారిపై రుద్దానని అనుకోనకు. పూల బుట్టఉన్నది, అందులో తెల్లనివి, పచ్చనివి, ఎర్రనివి. నల్లనివి పూలు ఉన్నాయి. వాటిని గుర్తించి అలా చెప్పినంత మాత్రంచేత ఆతెల్లనితనం, పచ్చనిదనం మనం ఇచ్చిన వాళ్ళ అవి వానికి సహజలక్షణాలు మవుతామా? అలాగే గుణాలను బట్టి ఆపేర్లు పెట్టాను. అవె వర్ణాలు. వారి వారి ఆశ్రమాలలో ఉండి ఆయాధర్మములను నిర్వహిస్తున్నంత కాలం చింత లేదు. ఆవర్ణాల్లో జన్మించిన వాళ్ళంతా అలాగే పిలువబడి 'కులం' వంశం 'గ్రూపు' ఇలా అనుకొంటూ, నేను

పెట్టిన పేర్లే అనుసరించటం అయ్యేది. ఐతే ఆ పేర్లు వదలకున్నను, ఈనాటికి ఎంతో ఆందోళనలో పడిపోతూ, ధర్మాలను పాటించడం కూడ మాని, ధర్మాలకు విపరీత వ్యాఖ్యానాలు చెప్తున్నారు.' అన్నాడు శ్రీకృష్ణుడు, 'అందుకే ఇప్పుడు ఆ సూర్యుడికి ఎప్పుడో చెప్పిన యోగం చెప్తున్నాను విను.' అన్నాడు.

14. దివ్యులూ కామాత్మనులూ అన్నానని ఆ విభాగంమాట అలావుంచి, ఈ నాల్గుభాగాల విభజనం నీమనసులో పెట్టుకొని తికమక పడతావనే, ఈ నాలుగు వర్ణాలసంగతి ముందు చెప్పాను, వారి సంగతి మధ్యలోవచ్చి అసలు విషయంలో సందేహం రాకుండా చెప్పినట్టి దీ విషయం అనేది మరచిపోకు. ఈ దివ్యులు వేరు. వీరు కామాత్మనులు కాదు. కామాత్మనులు దివ్యులయేది ఎలాగనే విషయం ఇప్పుడు మనకు కావలసింది. ప్రత్యక్షంగా నీకు తెలియాలని చెపుతున్నాను. నే నున్నాను. నేను కర్మచేస్తున్నా అది నన్ను బంధించదు. ఎందుకనంటే దాని ఫలితాల స్పృహే నా కుండదు గనుక. అందుకని నేను దివ్యుడ నయినాను. ఈ కీలకం మీరు కూడ తెలుసుకొని ఆచరించే వారయితే, మీరూ దివ్యులు అవుతారు. అప్పుడు మీరూమీకర్మల చేత కట్టుబడరు. పాపంగాని పుణ్యంగాని బంధించ దని ధ్వని. ఇదే నేర్వవలసిన జ్ఞానం. కర్మ చెయ్యాలి. నిష్కామకర్మ చెయ్యాలి. అంటె కర్మ ఫలితపు స్పృహ లేకుండా కర్తవ్యం అనే కారణంవల్ల కర్మ చేయాలి. జీవితం ఆ విధంగా యజ్ఞంగా మార్చివేయాలి, జ్ఞానం తెలిసి ఇలా కర్మ చేస్తున్నట్లయితే అదీ యోగం. అదె ఆరూఢస్థితి నందినప్పుడు దివ్యత్వ మవుతుంది. అంతేగాని యీ యోగం కులాలలో ఇమిడిలేదు యధాతథంగా.

15. ఈ జ్ఞానాన్ని తెలిసి మోక్షాన్ని కాంక్షించిన మన పూర్వులు తమతమ కర్తవ్య కర్మలను అలాగే చేశారు. సమాజానికి వ్యక్తిగతముగా వైదిక లౌకిక కర్మలను చేయవలసినట్టి కర్తవ్యమేదో ఆ కర్మే స్వధర్మము అనిచెప్పాను గదా. ఆ స్వధర్మం, వారు

...ంటూ ఉండేవారు. అది తమ డ్యూటీగా, ఆ రీతిగానే యీ
...జంలో మనమూను. నీవూ అలాటి కర్మ చెయ్యి. ఆ తరువాత-
...చేస్తుంటే, మనుతుంటే-ఎప్పుడో నీవు దివుడవు అవుతావు.

16. ఇంతకూ కర్మయోగి-సాధకుడు-ఏ కర్మ చేయాలి, ఏ
... చేయరాదు అనేది ముఖ్యం. ఈ సమస్య ఎంతో తెలిసిన వార
...కొన్న వారిని కూడ మోహపెట్టుతున్నది. ఎప్పుడు ఏకర్మ
...దని దవుతుంది. ఎప్పుడేకర్మ చేయ తగిన దవుతుంది అనేది
...గా ఆలోచించి తెలిసికోనాలె. అది ముఖ్యం.

17. సమాజ శ్రేయస్సును దృష్టిలో ఉంచుకొని, సత్కర్మ
..., నిషిద్ధకర్మలనీ చెప్పబడినయి. నిషిద్ధకర్మలు చేయనేరాదు.
...కనంటే అవి వ్యక్తికీ సమాజానికీ జగత్తుకీ కూడ నష్టం కల్గించేవి.
...గాక చేయతగినవి, చేయక తప్పనివి ఉన్నయి. ఇవి కర్తవ్యా
...గా చేయాలి. దేవపితృ కర్మల నాచరించటం తలిదండ్రులను
...ంచటం, భార్యాబిడ్డలను పోషించటం, బీదవారి నాదరించటం
...టివి. ఈ రెంటితో అయిపోలేదు. మూడవరకం ఉంది' అది 'అకర్మ'
...యవాలతోనూ పరికరాలతోనూ కర్మచేస్తూ 'కర్తృత్వాన్ని'
...సూ బుద్ధీలతో వదలివేయుటం 'అకర్మ'. ఇది బాగా తెలియాలి.
...దుకె కర్మగతి చాలా గహనమైనది అనడం. ఈ 'అకర్మ' పర
...ర్థం విషయంలో చాల ముఖ్యమయింది: సాధనకు ఇది ప్రాతిపదిక.

## 18. కర్మయోగి కయిన సాధన:-

కర్మయోగికి శ్రీకృష్ణుడు రెండు సాధనలను ఈశ్లోకంలో
...ప్పాడు. వాటిని తెలిసి పాటించాలి. మొదటి సాధన "కర్మణ్య
...ర్మ (యః) పశ్యేత్", అనేది. అంటే కర్మలో అకర్మను చూడాలి
.... రెండవసాధన అకర్మణిచకర్మ (పశ్యేత్) (యః) అకర్మలో
...ర్మను చూడాలి అని. అలా ఎవరు చూస్తారో అతడు బుద్ధిశాలి
...మూ అన్నాడు! పైగా సర్వకర్మలలో అతడు కృతకృత్యుడయు
...వాడవుతాడు అన్నాడు-శ్రీకృష్ణుడు. ఈసాధనలను నిశితంగా
...నం చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది: కర్మచేస్తూ కూడ

నేను"దానిని చేయుటల్లేదని అలా "నేను" అనేది చేయకుండానే ఈ కర్మ యిలా జరుగుతూనే ఉండాలనీ అర్థం. కర్మలను చేయడం మానమనికాదు. ఈ సంగతి ధృఢంగా నిశ్చయంగా తెలిసికోవాలి ముందుగా.

మొదటిది

ఇంతకూ ఈ సాధనలోని కీలకం ఏమిటంటే, నేను ను మిగతా వికారాలతో విడగొట్టి చూడటం. ఈ నేను అనేదానికి ఆత్మ అని పేరు పెట్టినట్లయితే, మిగతాదంతా అనాత్మ అవుతుంది. ఈ నేను అన్నింటనున్నదె. నీలో, నాలో, దానిలో, అన్నిటిలో సర్వత్ర నున్నవాడె ఈ అధివిద్యుడు. జీవానికిప్రమాణముగ నున్నవాడు. జడాల్లోకూడ ఈ "నేను" ఉన్నదనిపిస్తుంది-ఎలెక్ట్రానుల్లాగా! జీవాధారమైన ఈ "నేను" -సూర్యుడు మనకు వెలుతురు నిచ్చినట్లుగా- ఈ అవయవాలు, మనసు, బుద్ధి, అహంకారం ఇవి పనిచేయడానికి కారణంగా మాత్రం ఉంటున్నది. వెలుతురులో జరిగే యీ పనులన్నీ సూర్యుడే చేస్తున్నాడనటం ఎంత పొరపాటో, ఈ శరీరం చేస్తున్న పనులన్నీ "నేను" చేస్తున్నాడు అనటంకూడ అంతేపొరపాటు-అనేది గమనీయం. నిజానికి తిరుగుతున్నది ఎలెక్ట్రిక్ ఫాను. విద్యుత్తు కాదు గదా! అలాగే-కర్మను చేసేది అనాత్మయైన ఈ శరీరమూ, అవయవాలు, బుద్ధి, మనసు, అహంకారము. "నేను" అనేవాడు, కర్మను యథాతథంగా చేయనే చేయటల్లేదు.

ఈ జడాలు చేసిన కర్మలు "నేను"కు అంటకట్టబడటం అనేది అందుచేత చాలా అబద్ధమైన విషయము. ఇలాంటి అబద్ధాలు చాలా నమ్ముతూనే ఉంటాం మనం. ఆకాశం నీలంగా ఉంటుందంటాం. అది నిజంకాదు. చేయి కడుక్కొని వచ్చి, నా చేయి పరిశుభ్రంగా ఉందంటాం. అది నిజంకాదు. ఎంతో బాక్టీరియా ఉంటుందని శాస్త్రజ్ఞులు చెప్తారు- అలాగే, ఈ పొరపాటు మనసూ బుద్ధీద్వారా చేస్తుండటంవల్ల ఈ శరీరం చేసిన పుణ్యపాపాల రెంటి ఫలాన్ని మానవుడు తననెత్తిన రుద్దుకొంటున్నాడు. ఇది వాస్తవ విషయం. ఈ

సంగతి మనసూ, దాన్ని దాటి బుద్ధీలవరకూ ఎక్కాలి. దీనిని, విష యం మననం చేయటం ద్వారా పొందవచ్చు. అహంకారము కూడ ఇది అనుభూతి చేసిన క్షణాన. ఈ మనోబుధ్యహంకారాలు మూడున్నూ "నేను"లో కరిగిపోయి నశిస్తాయి ఎప్పుడో. అప్పుడే దర్శనం అవుతుంది. దానికోసమె ఈ ఆత్మానాత్మ వివేకాన్ని తెలియవలసి యుండటం.

ఆత్మఅనీ, అనాత్మఅనీ ఈ రెండెందుకు చెప్పుకోవాలి. ఈ ప్రపంచంలో ఉన్న విభాగాలు చాలక అనటం కద్దు. అలా కాదు. ఇది సాధనలో భాగం. సాధన ఫలించటానికి ఇదేమార్గం మొదట్లో. విడగొట్టే ఆలోచన ఇది-అని హేళనచేస్తే ఏమీ ప్రయోజనం లేదు.

సాధనలో తగినంత దూరం వెళ్ళినాక ఈ విభేదం అంతగా అవసరం లేదు. అప్పుడు సర్వత్ర 'ఆత్మే' అవుపడు తుంటుంది. 'అనాత్మ' సంగతి అప్పు డక్కర్లేదు.

ఈ సాధన చేస్తున్న సాధకుడు నేను ఈ పుణ్యం చేశాను అనడు. ఈ కర్మవల్ల ఫలితం నాకే అనడు. కార్యకారణాలభేదం ఇప్పటిలా అతడి చుట్టూతిరిగి వేధిస్తూ ఉండదు. అలా అయితేఎలా! పిచ్చెక్కిందంటారేమోనని వెరగు పడద్దు. రెండుస్థాయిలుంటాయి. ఒకటి సాధనస్థాయి, రెండవది జగత్‌స్థాయి. జగత్‌స్థాయిలో మనసు, బుద్ధీలకు (బ్రతుకుబాటలో) పాపం పుణ్యం కార్యం కారణం అన్నీ తెలుస్తూనే ఉంటవి. వీటిని తెలియనివాడు ఉన్మాదుడు గాని, తెలిసినవాడు ఉన్మాదు డెలా అవుతాడు? ఆత్మానాత్మవివేకి ఇవన్నీ తెలిసినవాడై య్యుండికూడా ఆత్మానాత్మ వివేకాన్ని ఎరిగిన వాడనేది సత్యం. పారమార్థికమైన బాటలో ఈ వివేకాన్ని ఎరిగి ఉంటాడు. అతడు ఉన్మాదుడుకాదు-సరికదా-అతడు బుద్ధిమాన్‌అని కూడ అంటున్నాడు శ్రీకృష్ణుడు.

తత్స్వభావస్థితిలోనున్న "నేను"కు పాపపుణ్యాలులేవు. వాటికి భేదంలేదు అక్కడ. అంటే ఈపాపపుణ్యాల భేదము ఆస్థితిలో అక్కర

లేదని అర్థం. ఆస్థితివచ్చేవరకూ - అంటే జాగ్రదవస్థలోని వ్యవహారాల్లో - కర్తవ్యాన్ని తెలిసిచరించడానికి, ఆ భేదం తెలిసికోవాల్సిందె. పాపపుణ్యాలను పాటించవలసినదె. తప్పదు.కనక తత్త్వభావస్థితి ఒక ప్రక్క, వ్యవహారస్థితి రెండవప్రక్క, కలిగి ఉంటూ మొదటిదాని కోసం మాత్రం ఈ ఆత్మానాత్మవిభేదం తెలియటమే వివేకమైన సంగతి. ఈ అనుభూతులను ప్రత్యేకం పొందటానికయిన సాధనఅదె.

*రెండవది*

ఇక రెండవ సాధన అయిన "అకర్మణిచ కర్మయః పశ్యేత్" అనేదాని అర్థంఏమిటంటే- "నేను" ఏకర్మనుగానిచేయటల్లేదు. అనే సంగతి ఎరిగి యుండటమే 'నీ' పని అంటే ఈ 'నేను' అనేదానికి పని ఒకే ఒకటి ఉన్నదన్నమాట. అది ఏమనంటే తానేమీ చేయటల్లేద నేది అనుసంధానంచేస్తూ ఉండటమే. అదే రెండోసాధన. సర్వకాల సర్వావస్థల్లో జరిగె పనుల్లోనూ ఈ "నేను" అనేది చేయనట్టిదై ఇలా విడిగా ఉన్నది అనే అనుభూతి ఉండాలి? ఇదే ఈ రెండవసాధన యొక్క కీలకం.ఇందువల్ల సతతమూ 'నేను' అనే పదార్థపుగుర్తింపు ఉంటూ ఉంటుందన్నమాట. తత్పదార్థచింతనమే సదా సమకూరుతూ ఉంటుంది. ఇదె 'మత్' భావంఅన్నాడు శ్రీకృష్ణపరమాత్మ. దానినే (awareness) అని అనేది,

పై ఒకటీ - రెండు సాధనలు సంయుక్తమైన ఒకే సాధనఅనేది తెలియాలి. సాధనకు, ఈ స్థితిలో పనులుచేయడం అనేది జరుగుతుండటం, తాను ప్రత్యేకంగా ఉన్నది అనే అనుభూతీ, అవుతుంటయి. కర్తృత్వ భావమూ, అహంభావమూ, వాటంతటవి నశించి పోతుంటవి. మొదటి సాధనె మనసుతోను బుద్ధితోను చేయబడుతుండేది. రెండవసాధన ఆ మొదటి సాధనవల్ల కలిగిన అనుభూతె-అంతకంటె మరేంలేదు. బుద్ధినిమించిన స్థాయిలో జరిగేసాధన. అతీంద్రియసాధన అది,

మూడవది

19 ఈశ్లోకంలో ఒక సాధన నియతిగా చెప్పబడింది. 'కామ సంకల్పవర్జితాః., అనేది ఆసాధన ఇది మూడవ భాగం సాధనఅనచ్చు మొదటి సాధన చేస్తూ కర్తవ్యమైన కర్మలను చేస్తూ,ఆకర్మ 'నేను' చేయటల్లేదు. అనుకొంటూ ఉంటాడుకదా సాధకుడు! అయినా మనసులో కొన్ని కామసంకల్పాలు ఉండటంకద్దు. మనసు లక్షణం వికల్పమూ సంకల్పము మళ్లీవికల్పమేకదా మరి! అలా కలిగినప్పుడు ఆకోరికలను పెంపొందిస్తూ వాటిని కర్తవ్యంగా భావించి సాధిస్తూ ఉండటంకద్దు. నేను వీటిని పెంపొందించటల్లేదు అనుకొంటూ సాధనలో మొదటిభాగాన్ని అనుసంధానం చేస్తూఉండటం జరగవచ్చు. అలాటప్పుడు ప్రమాదంఉంది, అనేది గ్రహించాలి. ఆప్రమాదం సాధనకేనుఅనేది గమనించాలి. అందుకనే కామ సంకల్ప వర్జితాః అనేదికూడ సాధనలో ఒకానొక భాగంగా చెప్పటం అవుతున్నది. అలా కామ సంకల్పాలేవో వాటిని తెలిసి వర్జించమనేది లేకపోయి నట్లయితే, నామనసుకు అది ఇష్టం-దానిని సాధించటం నాకర్తవ్యం అనే గాడిలోపడి సాధకుడు అధోగతికి పోవటం కద్దు. దానిని నివారించడానికే ఈమూడోసాధన చెప్పటం అయింది.

ఈసాధనయొక్క భావం ఏమిటంటే ఏపనులూ కోరికతో ఆరంబించకూడదు. ఇంద్రియ తృప్తిని ఆశయంగా పెట్టుకొని ఏపనీ ఆరంభించవద్దని బోధ. అలాకోరికపై ఆరంభించి చేసేపనులు కర్తవ్యాలు కావని తెలసికోనాలి. జాగ్రత్తపడాలి. కర్తవ్యాలంటే మానవుడు శాస్త్రవిధులును సమాజానికిగాను తాను చేయవలసి యుండేకర్తవ్యమేదోఅదేననేదిజ్ఞాపకముంచుకోవాలి. అదే 'స్వధర్మం' అని వెనకచెప్పుకొన్నాం. స్వధర్మం కానిపనికిఈసాధన వర్తించదు.

20 అలా ఈపై సాధనను తు చ తప్పకుండా ప్రయత్నంచేసి అనుసరిస్తే అప్పుడు కర్మలు చేయబడుతున్నప్పటికిన్ని ఆచేసినవానికి బంధనం ఉండదు. "అతడు ఏపనులు గాని చేసినవాడుకాడు" అన్నాడు శ్రీకృష్ణుడు. అంటే అర్థం. తింటె కడుపు నిండదనిగాని

గుచ్చితే నొప్పి పుట్టదనిగాని కాదు. కార్యకారణ సంబంధంతో కూడుకొన్న ఫలమేదో అది కలుగుతుందిగాక సందేహంలేదు. కాని సాధారణంగా పనితోపాటు అనుబంధంగా వచ్చే పుణ్యపాపాల విషయంలో ఆపనులు అతడు చేసినవాడే కాడని ధ్వని.

ఈసాధనలో-నేను ఈపనులు చేయటల్లేదు-ఈప్రకృతిచేస్తోంది అనుకోవటం నేనుచేస్తున్నపని, "ఏపనీ చేయకుండా ఉండటమేనూ" అనుకొనటం, మనసుచేసే కామసంకల్పాలకు సంబంధించిన కర్మలను (కర్తవ్య కర్మలు కావు కనుక వాటిని) ఆరంభించకుండ ఉండటం అనేవి ఉన్నాయి. ఈసాధన కేవలం మనసు బుద్ధి, నేనులు చేసేసాధన. అందుకనె ఈసాధన తేలికే నన్నాడు. మనసు ఎంత బలమైందో చెప్ప నక్కర్లేదు. దాని కంటే బలమైనవి బుద్ధీ, నేనూ లు. ఈ మాత్రపు సాధనచేయటం - అదేం మహావిషయం కాదు. ఈదృష్ట్యా చూస్తే. ఈ సాధన స్వల్పంగా చేస్తే అది మహాభయాన్ని పోగొట్ట గలుగుతుంది అన్నాడు.

కోరిక అనేది ఆధారంగాలేని పనులుమాత్రమే చేయటం - కర్తవ్యమనే దాన్నిమాత్రమే నెరవేర్చటం-ఇలాంటివి మనజీవితంలో ఎన్ని చేస్తుంటున్నాను అని ఆలోచిస్తే చాలా తక్కువ మాత్రమే కనపడతయి! ఆ మాత్రపు పని ఏదో ఒక్కటి చేసి ఊరుకొంటూ బ్రతుకుతుంటే అప్పుడు మానవుడెలా ఉంటాడు అనిపిస్తుంది. రాయిలా ఉంటాం కాబోలు అనిపిస్తుంది. స్థబ్దుగా ఉంటాం కామాల్ను అనిపిస్తుంది.

కాని సాధనయొక్క కీలకం బాగా గ్రహించాల్సిందిఇక్కడనె. రాయికి కర్మ చేయవలసిన కర్తవ్యం లేదు, మనిషికికర్తవ్యంఉంది. ఏ ఏ పరిస్థితులలో ఉన్నవ్యక్తి ఆయాపరిస్థితుల్లోగల పనులను చేయవలసిన అవసరం-సమాజానికయిన అవసరంఉంది. నియతి ఉంది.తండ్రి తండ్రిగా, గురువు గురువుగా, అధికారి అధికారిగా, భృత్యుడు భృత్యుడుగా, గృహిణి గృహిణిగా ప్రవర్తించాల్సిన బాధ్యతకు సంబంధించిన కర్మ నియతమై ఉంది. ఇవిగాక దైవకర్మలున్నవి.

అందుకనే కర్తవ్యం వేరు కామ సంకల్పాలు వేరు. వీటి పదునైన తేడా గమనించాలి. రాతికి అలా ఉండటం ఒకటే కర్తవ్యం. అంత కంటె లేదు. దాని కామ సంకల్పాలు సంగతి మన కక్కరలేదు. దాని కవి లేవు కూడాను. వ్యక్తికి అలాకాదు. కామ సంకల్పాలు ఉంటవిగాక. వాటిని ఆరంభించ కూడదు. పనులు, కర్తవ్యాలు చేస్తూనే ఉండాలి. సాధనలో చెప్పినట్లు "కర్తృత్వభావం వదిలే యాలి" భగవంతునివే సర్వకర్మలూ. మనం ఆయన అంగాలుగా అన్నికర్మలూ స్వధర్మకర్మలు చేస్తూ ఉండాల్సిందే.

అలా కర్తవ్యంచేస్తూ ఆ కర్మకు ఫలం ఏ మొచ్చినా అనుభ విస్తూ పట్టించుకోని స్థితిలో ఉండాలి. ఫలం అనుభవించటం తప్పని సరి, కాని దాన్ని పట్టించుకోరాదు అంటే అర్థం, ఆ కర్మఫలాన్ని చూపి ఇది నా శక్తి అని లేదా ఆ దుష్టఫలం పలాని వాడివల్ల అని అనే స్థితిని దాటి ఉండాలని అర్థం.

అలా కర్మఫలాన్ని అంటించుకోకుండా అవయవాలు అనే పరికరాలచేతనే కర్మ చేయిస్తున్నప్పుడు ఎల్లప్పుడూ తృప్తి ననుభ విస్తూ ఉంటాము. ఎందుకంటె కర్మలకోసం కారణాలను ఆశ్రయించము. అంటె ఫలం కోసమే కర్మ చేయడం కాదు. కర్తవ్యం గనక కర్మచేస్తాము. ఆ కర్మ అలా అప్పుడు చేయటమె అక్కడి కీలకం. సమాజం కోసం చేయవలసిన కర్మ అది. అది చేయడమె కీలకం. ఇంకేదీ కాదు. ఇది గమనీయం. ఫలం ఫలానిది అని ముందు ఊహించటం తప్పు కాదుగాక. అది ఊహించి ఈ కర్మ సమాజసేవకుగాను లేక భగవత్ప్రీతికిగాను అలా చేయవలసిన అవసరం ఉందనీ అందుకని అది కర్తవ్యమని నిర్ణయించేవరకే దానిమేలు.

21. సాధన చేసేటప్పటి మొదటి స్థాయిలోని సంగతి ఈ శ్లోకంలో చెప్పబడింది. అపుడుమానవుడు ఆశఅనేదిలేకుండఉంటాడు. ఆ స్థితి మొట్టమొదటి స్థితి. దానికొరకు చిత్తాన్ని అదుపులో ఉంచాలి. రథపుగుర్రాలను అదుపులో ఉంచటం ఎంత అవసరమో ఇదీ అంతే. చిత్తాన్ని ఇంద్రియాల్ని అదుపులో ఉంచి శరీరానికి కావలసి

మాత్రపు కర్మలను ఒకవేళ చేస్తూ ఉంటున్నట్లయితె అప్పుడు పాపం గాని పుణ్యంగాని ఉండదుట. ఇది చాలా నియమ పూర్ణమైన స్థితి అనిపిస్తుంది. కాని ఇంచుమించు రాళ్లకు సమానమైనస్థితి అనిపిస్తుంది కూడ. ఈమాత్రం చాలునా జీవికి? అతడికి శాంతీ తృప్తి ఉంటుందా? అనుమానమే. అయితే మరి తరువాతి స్థాయికి ఎక్కవలసి ఉంటుంది. తరువాతి శ్లోకంలో ఆ తరువాతి స్థాయినిగూర్చి ప్రసంగిస్తాడు శ్రీకృష్ణుడు.

22. ఈరెండోస్థాయిలో శరీరానికి అవసరమయినవిమాత్రమే పొంది అనుభవించటం కాక, దక్కిందేదో అప్పటికప్పుడు అనుభవించటం అంగీకారము. ఇది వచ్చింది అది రాలేదు అనే యోచన మాత్రం ఉండ కూడదు. ఆ విచక్షణం పోవాలి. మొదటిస్థాయిలో నియమంగా తనకు కావలసిన ఏ ఒక్క చపాతో తింటుంటె ఈ స్థాయిలో ఆ సమయానికి ఏది దొరికినా అదే తిని, అయ్యో ఫలానిది దొరకలే దనుకోకుండ ఉండటమవుతుంది. సిద్ధికీ, అసిద్ధికీ మనలో కలిగే ప్రతిచర్యలకు భేదం లేకుండా పోవాలి. అసలు ప్రతిచర్యలే కలిసిపోయి ఒకే స్థితి ఉండాలి. కాకతాళీయంగా అప్రార్థితంగా వచ్చిన విషయాలను అనుభవించినా ఇబ్బందిలేదు. ప్రతిచర్యలు మాత్రం ఉండరాదు. కర్మయొక్క కర్తృత్వం లోని పదును చచ్చిపోయి ఉంటుందన్నమాట. మొదటిస్థాయిలో, తన శరీరాన్ని నిలుపుకోటానికి మాత్రమే కేవలంగా పనిచేస్తూ ఉండే సాధకుడు తన శరీర పోషణకు లేదా మనికికి ఏది సద్యః ఫలంగా తటస్థ పడితే అదే అనుభవించి శరీరాన్ని నిలుపుకొనడ మనె కర్తవ్యంచేసే స్థితికి వస్తాడు. ఏ హిమాలయాల్లోనో కూర్చొని దొరికిన పండు తినటం, రోడ్డు ప్రక్కన ఈగలు ముసురుతున్నా ఎవరో పారవేసిన ఆహారాన్ని తిని తృప్తిపడటం, ఈలానైనా బ్రతకవచ్చు. కాని, ఇదికాదు మానవుడి గమ్యం. ఈ స్థితికి కాదు మనం పోయి నిల్చి ఉండాలనుకొనేది. ఈ జ్ఞానమంతా ఆ ఫలితానికి కాదు. ఎందుకంటె అది పరిపూర్ణమైన స్థితి కాదే! కుంఠితమైన పరిస్థితిగా ముంజేతికంక

ణంగా అవుపడట ల్లేదా? ఈ స్థాయినుంచి పై కెక్కటం అత్యవసరం. సందేహంలేదు. వ్యక్తి, సమాజం, జగత్తు, ఈశ్వరుడికి సంబంధించిన ఈ తత్త్వం అలా కుంఠిత మాత్రమై ఉన్నదనటం సరికాదు. అందు కని మూడవస్థాయి ఉండితీరాలి.

23. ఈ శ్లోకంలో మూడవస్థాయి చెప్పబడింది. ఈ స్థితిలో ఆసక్తి రహితుడై ఉండాలి. పోషణకర్తవ్యంగా శరీరానికి కావాలనె ఆసక్తి మొదటిస్థాయిలో ఉంది. సద్యఃఫలంగా వస్తున్న వాటిని అనుభవించటంలో ఏ కొంచెమైనా ఆసక్తి ఉంటూ ఉండవచ్చు రెండోస్థాయిలో. ఈ మూడోస్థాయిలో ఆ ఆసక్తి పూర్తిగా నశిం చాలి. కామసంకల్పాలు మాత్రం ఏ స్థాయిలోనూ ఉండవుగాక. ఈ స్థాయిలో అసలె వుండవు. ప్రాప్త పదార్థాలయందు కూడ ఆ ఆసక్తి ఉండటం మానేస్తుందన్న మాట. ఈ విషయంలో ఇంక సందేహా లుండకూడదు. అయ్యో కంచంలోకి అన్నం ఎలా వస్తుంది. నేను సంపాదించకపోతె అనిగాని-ఫలానిది ప్రాప్తించే అవకాశం ఆ ప్రక్కనుంటే, ఈ ప్రక్కకు వెళ్ళితె ఎలా, అనే యీ సందేహాలు కూడ పోవాలి. ఇదె ముక్తుడు కావటం అనేది. సందేహాలనుంచి ముక్తి లేదు. సంకల్పం లేదు. మరి ఇంకా మనసు చేస్తుండే పనే మిటి? ఒకటీ. రెండూ సాధనలలో చెప్పిన జ్ఞానం చేస్తుండటమె అలాంటి అనుసంధానం చేసే స్థితి వచ్చినప్పుడు-వట్టి శరీర కర్మే కాదు-ప్రాప్తవస్త్వను భవమెకాదు-యజ్ఞ కర్మలన్నింటినీకూడా చేస్తూఉండవచ్చు-అన్నాడు శ్రీకృష్ణుడు. ఎల్లప్పుడూ అలా యజ్ఞ కర్మలను చేస్తూ ఉండటానికి వీ లున్నప్పుడు ఇక జీవితంలో కుంఠి తత్వ మెక్క డుంటుంది? ఇదీ మూడవస్థాయిలోని వీలు.

కాగా యజ్ఞకర్మ లంటే ఏమిటి? - కామ్యకర్మలు మాత్రం కావు అనేది ముఖ్యం. ఇది రూఢి. నిష్కామ కర్మలవి. పైగా ఆ కర్మలు కూడ "నేను"చేయటంలేదు అనే జ్ఞానంతో చేయ బడాలి. మనం దానిని సత్త్వగుణం అనద్దు-నిర్గుణం అందాం. పుణ్యంకోసమె

చేయటంలోనూ కేవలం కర్తవ్యంగా చేయటంలోనూ తేడా ఉన్నది. ఒకటి సత్త్వగుణం, రెండోది గుణాలకు అతీతమైన దిన్నీ. ఈ భేదం మన అద్వైత తత్త్వంలోనే విశదీకరింపబడిన విశేష విషయం. ఇంతకూ యజ్ఞకర్మలంటె అలా గుణాతీతమై చేయబడె నిష్కామ కర్మలనే అర్థం తెలియాలి. ఇది ముఖ్యం. కర్తవ్య కర్మ లను, కర్తృత్వం తనది కాదనుకొంటూ ఆ జ్ఞానంతో-చేసినప్పుడె యజ్ఞకర్మఅవుతుంది.

ఇంకొంచెం వివరంగా చెప్పాలంటె నా జాతికి నేను చేయటం అవసరం అనుకొంటూ అది కర్తవ్యకర్మగా అనుభూతిచేయవచ్చు. తప్పులేదు. యజ్ఞకర్మే అవుతుంది. కాని ఆ చేయటంలో 'నా' అనేదానికి ప్రాధాన్యమిచ్చి స్వార్థభూయిష్టం చేస్తే పనికిరాదు. 'నా' అనేదాన్నిగాక కర్తవ్యం అనేదాని బలం ఉండాలి. అప్పుడె యజ్ఞకర్మ అది.

అలా జీవితంలో చేయబడే కర్మలన్నీ యజ్ఞకర్మలే అయిన ప్పుడు-జీవితమే ఒక యజ్ఞం అవుతుంది. జీవితాన్ని యజ్ఞం చేయ టానికి ప్రయత్నించాలి అనిపిస్తుందిగాక. ఎలా? 'యజ్'ధాతువు మీద వచ్చింది 'యజ్ఞం' అనే మాట. త్యాగపూర్వకము అని దాని అర్థం. వేదాల్లో ఎన్నో కర్మకాండలు చెప్పబడినయి. వాటివల్ల కొన్ని ఫలితాలు చెప్పబడిన మాట నిజం. కర్మచేస్తే ఫలితం ఏదో రాకుండ ఉండదు కదా! సక్తిగలవారు వాటి ఫలితంకోసం వాటిని చేస్తారు-ఫలితం పొందుతారు. అవి క్రతువులు మాత్రమే అనబడ తయి. అవి యజ్ఞాలు అనబడవు. ఎందుకనంటె ఆ చేయటంలో త్యాగం అనే ప్రసక్తి లేదు గనుక.

త్యాగం అంటేఏమిటి? అందులో రెండువిషయాలున్నాయి. వస్తువును వదలించుకొనటం ఒకటే, కర్మనువదిలించుకొనటం ఇంకొ కటినీ, కర్మను వదిలించుకొనటం-అంటే కర్మ చేయటంలో గలకర్త వ్యాన్ని వదలించుకొనటం. ఇదె-ఒకటి రెండూాల సాధనలలోచెప్పిన జ్ఞానం త్యాగంలో అందుకె జ్ఞానం ఇమిడి ఉన్నదని బోధ.

ఉదాహరణకు-ఎవరో బిచ్చగాడికి బస్తాలో నుంచి దోసెడు
య్యం దానంచేస్తాం. ఆ దోసెడుబియ్యం వానికి వెళ్ళిపోవటం ఒక
ట్టు. రెండవది-ఈదానం చేయటంలోగలకర్తవ్యం నశించటం. అది
లా? ఆబియ్యం నావి కావు. ఎవరికి చేరినవో వాడివె; అవి అతడికి
రినయి. "నేను" ఇవ్వటం ప్రశ్న లేదు. నాచేతులు ఈయజ్ఞంలో పని
సి ఉండవచ్చు. కాని "నేను" ఏపనీ చేయలేదు. ఆమాటకొస్తే
చ్చినవాడు భగవంతుడే. "నేను" అనేవాడే, సర్వమూ-ఆనేను ఆ
గవంతుడే అని అనుభూతి చేస్తుంటే ఈ ఇవ్వబడిన వస్తువూ అతడిదే
నేజ్ఞానం అవగతమయితె-అకర్మ యజ్ఞకర్మ అవుతుంది. ఈభగ
ంతుడు-ప్రభువు-అనే జ్ఞానం భావం శ్రీకష్ణుడు ముందుఅధ్యాయాల్లో
ప్పబోతున్నాడు. అది ముందు తెలిసిన వారికి ఇక్కడ లోతుగా
ర్థంకావటానికి చిట్కాగా పనికివస్తుంది గాక ఈపై సంగతి. ఇప్ప
కి శ్రీకృష్ణుడు ఇక్కడ చెపుతున్న సందేశం ఏమనిచెప్పవచ్చునంటే-
ానవుడు తాను ఒక సంఘటనను దూరంనుంచిచూస్తే సాక్షిమా
తుడుగా ఎలా ఉంటాడో, అలా-తనది అనుకొంటున్న శరీరంచేసే
ర్మల విషయంలో కూడ సాక్షిమాత్రంగా ఉండాలని చెప్తున్నాడు.
అనుభూతే జ్ఞానానికి ప్రాతిపదిక.

అధియజ్ఞుడైన "నేను" ఈపరికరాలుచేసే కర్మలను చేయట
్లేదు. ఆకర్మలు ప్రకృతిచేత చేయబడుతున్నవి-అని అనుభూతిచేయ
ం జ్ఞానానికి ప్రాతిపదిక. ఇలాటి జ్ఞానంతోనే అన్నికర్మలనూ-కర్మ
న్నింటినీ-చేస్తూంటే ఏమవుతుంది?

ఎదుట ఎవరో పనిచేస్తూ ఉంటారు. వానిలో ఆత్మవేరుగా
ప్రకృతి వేరుగా తెలుస్తూ ఉంటుంది. ప్రకృతి ఆపనిని చేస్తున్నదని
ఆత్మచేయటల్లేదని తెలుస్తుంటుంది. అతడిలో పనిచేయకుండా నిలిచి
ఉన్నది ఆత్మే. నాలో, అనాత్మకు వేరుగానిలిచి ఉన్నదీ ఆత్మే. ఆ

యాత్మ వేరూ ఈ ఆత్మవేరూ అనేఅవకాశంలేదు. ఆ ఆకాశంవేరూ ఇక్కడి ఆకాశం వేరూ అనేమాట ఏంమ్మాటట! అందుకని, నాలో నీలో, వానిలో, దానిలో ఉన్న అధియజ్ఞులు లేదా ఆత్మ అంతా ఒకటే అని తెలుస్తుంది.

అవాత్మ బాహ్యంగా ఉండి పనులు చేస్తూ ఉంటున్నది. మారుతూ ఉంటున్నది. మన ఇప్పటి మనోచక్షువుకుగాని చర్మ చక్షువుకుగాని కనపడక పోవచ్చును గాని సర్వత్ర ఉన్న ఆత్మ-సర్వ భూతాల్లో స్థితుడై ఉన్న ఆత్మ-నీకు అప్పుడు దర్శన మిస్తుంటుంది. అనుభూతి స్థాయిలో ఇది ఉత్కృష్టస్థితి.

24 ఇలాటి స్థితిలోనె జీవితంలోని అన్ని పనులూ యజ్ఞాలై రూపొందేది. ప్రతివస్తువులోనూ ఆత్మే దర్శన మిస్తున్న స్థితిలో యజ్ఞాలు ఎలా జరుగుతవంటె-(స్వార్థకర్మలు కాదు, సమిధలు బ్రహ్మ, అగ్ని బ్రహ్మ!! హుతం కావటం బ్రహ్మ. వస్తువును అర్పించే తాను బ్రహ్మ!!' ఇదీస్థితి. అన్ని యెడలా దర్శనమిస్తున్న ఆత్మే బ్రహ్మ ముగా గుర్తించటం జరుగుతుంటుంది. ఈవస్తువులు అనే భిన్నత్వం కళ్ళకు కనపడుతున్నా, తనకు ఏకాకియైన బ్రహ్మ మొక్కటే దర్శన మిచ్చేస్థితి-ఇది.

25-32 ప్రాజ్ఞులు ఈమనః స్థితిని సంతరించి వేదంలో చెప్ప బడిన యజ్ఞాలను కర్తవ్య కర్మలుగా గ్రహించి చేస్తుంటారు. కొందరు దేవయజ్ఞం చేస్తారు. సర్వమూ దేవుడే వారికి. సర్వత్రా తాము కోరిన దేవుణ్ణేదర్శనం చేస్తూంటారు. తాను తినే ఆహారంసహా అన్నీ దేవుడే. అంతా బ్రహ్మమే. తానులేదు. అంటే బ్రహ్మమనే అగ్నిగుండములో జీవుని ఆహుతి చేస్తారన్నమాట. ఇలా ఎన్నో రకాలైన యజ్ఞాలున్నవి. శ్రీ కృష్ణుడు సూచన ప్రాయంగాకొన్ని

యజ్ఞాల పేర్లుచెప్పాడు. సంయమన యజ్ఞం-ఇంద్రియ నిరోధక యజ్ఞం-ద్రవ్య యజ్ఞం-స్వాధ్యాయ యజ్ఞం-జ్ఞాన యజ్ఞం, ప్రాణాయామ యజ్ఞం, నియతాహార యజ్ఞం ఇలాటివి.

33 సాధన కోసం 'కర్మను'-పనిని విమర్శచేసి చూస్తే—ఏ పనిలోగాని రెండు భాగాలున్నాయి. ఒకటి కర్మభాగం; రెండోది జ్ఞానభాగం. కర్మ భాగాన్నే ద్రవ్యభాగం అనవచ్చు. ద్రవ్యభాగం కంటె జ్ఞానభాగం శ్రేయమైనది. ఈ ద్రవ్యభాగం జ్ఞానభాగంలో పరిసమాప్తి పొందుతుంది. అందుకని యీ జ్ఞానభాగాన్ని సమగ్రంగా తెలిసికొనటం అవసరం.

కామ సంకల్ప వర్జితుడైనవాడు, ఈ జ్ఞానాన్ని నేర్చినట్లయితే, అతడి జీవితం యజ్ఞమయమై పోతుంది. అప్పు డతడు పుణ్యపాపాలకు అతీతు డవుతాడు. దివ్యు డవుతాడు. అది తథ్యం,

కాని ఈజ్ఞానం మనసుకూ బుద్ధికీ తెలిస్తేచాలదు. అనుభూతి కావాలి. అదెలా! దానికి శ్రీకృష్ణుడు సమాధానం చెప్పబోతున్నాడు. అనుభూతి కావటమనేది మనసూ బుద్ధీ స్థాయిలలో జరిగేది కాదు. ఇంకా పై స్థాయిలో జరగవలసింధి, అది ఆత్మస్థాయి అనచ్చు. లేదా అధియజ్ఞస్థాయిఅనవచ్చు. అదే 'దర్శనం'అంటాం. దర్శనస్థాయికి పెరగాలి. అప్పుడే అనుభూతి అనేదికలిగింది అనటం జరిగేది. శ్రీకృష్ణుడు అన్నాడు "గురువును దర్శించు. అప్పుడు పైస్థాయి కెక్కుతావు" అని. తరువాతి శ్లోకంలో అదే చెప్పబోతున్నాడు. గురువు అంటె గొప్పవాడు. ఎవరికంటె? అహంకారియైన సాధకునికంటె గొప్పవాడు. ఎవరాతడు? అధియజ్ఞుడు. ఆత్మ. అదే పరమాత్మ-అనే యీ దోవ తెలియాలి. తెలిసేదాకా మననం చెయ్యాలి బహుళః.

34 శ్రీకృష్ణుడు చెప్తున్నాడు, "గురువును దర్శించు. అతడికి నమస్కరించు-ఆయనే చెపుతాడు నీకు జ్ఞానం. ఆయన దగ్గరనే నీవు ఉపదేశం కావాలి. అలా అతడిద్వారా నీకు అనుభూతి కావాలి. అప్పుడు-చేయబడిన కర్మలన్నీ కడుగబడినవై -నీవు-(సాధకుడు) యజ్ఞ క్షపితకల్మషుడ వవుతావు. అలాంటివాడికి అమృతం దక్కుతుంది. సనాతన బ్రహ్మాన్ని చేరుకుంటాడు. కనక నీవు గురువును చేరి ప్రణిపాతంచెయ్యి. సర్వసమర్పణం చేసివేసి, జ్ఞానం అనుభూతి చేయాల్సింది" అన్నాడు.

కాని భగవానుడైన శ్రీకృష్ణునికంటె గొప్ప గురువు వ్యక్తిగా దొరుకుతాడా? దొరికితె ఎక్కడ? యుద్ధం మొదలు పెట్టబోయేముందు వచ్చిన సందేహం, మొదలుపెట్టే సమయానికి తీరిపోవాలి. కలిగిన క్షోభ విచ్చిపోవాలి. నిజానికి అలా విచ్చిపోయింది. శ్రీకృష్ణుడు చెప్పిన గురువును అర్జునుడు ఎలా పట్టుకొన్నాడు అనేది రహస్యవిషయం అనిపిస్తుంది.

ఆ గురువు ఎక్కడో దూరానలేదు. అది నిజం. అతిసన్నిహితుడై, శ్రీకృష్ణునికంటె ఎక్కువ సాన్నిహిత్యంలో ఉన్న గురువతడు అర్జునునికి. అతడు శ్రీకృష్ణుడు చెప్పిన మాటల్లోనే తిరిగి విషయం చెప్పినా చాలదు. అంతకంటె ఎక్కువ సాన్నిహిత్యంగా అనుభూతి చేయించాల్సి ఉంది. యువకుడికి, కవిత్వంలో ప్రణయం అంటే ఏమిటో చెప్పినప్పటికంటె, ప్రణయిని చూపులె ఎక్కువ అనుభూతి ఇచ్చినట్లుండాలి. అంటె గురువు సాధకుడి మనసులో దూరి బుద్ధిలోచేరి ఆత్మను తట్టి అనుభూతి నివ్వాలి. అది తప్పనిసరి.

అలా ఆత్మను స్పృశించ కలిగింది ఆభగవదంశ ఒక్కటే. ఆ అంశ "నేను" అనేదిగాక, ఇంకేదీలేదు. సాధకుడే విని, మననంచేసి, తాను అధియజ్ఞుడని అధివిద్యుడని, మనసు, బుద్ధీలకు భిన్నమై అతీతుడై యున్నవాడనీ, అనుభూతిచెందాలి. అంతవరకూ 'నేను' 'నేను' అని అంటున్న అహం (అంటె పరిమితత్వాన్ని ఆపాదించుకొంటున్న మానవుడు) ఆ ఆత్మకు-అధియజ్ఞునకు ప్రణిపాతం చేయాలి. సర్వసమర్పణం చేసికోవాలి. అప్పుడు ఆ అధియజ్ఞుడే గురువు. అనుభూతి నిచ్చేవాడు అహంకారియైన నీకు దర్శనమిచ్చి నిస్సందేహమైన పరిపూర్ణానుభూతిని పొందింపజేసే గురువు. గురువును చూడు; అని శ్రీకృష్ణుడన్నమాట కర్థం ఇది. నీలోని నేనుకు జ్ఞానం అవగతం కావాలనిఅర్థం. నీవు బుద్ధి ద్వారా జ్ఞానాన్ని ఎరిగిన వాడవై (ఆమేర చాలదుకనక) ఆత్మ అయిన గురువు అనుగ్రహాన్నిపొంది, జ్ఞానం అనుభూతిచేసి జ్ఞానివి కావాలని అర్థం. బుద్ధిని వికసింపచేసి ఆత్మవైపుకు ప్రణిపాత రూపకంగా పయనింపమని ధ్వని.

ఈ అర్థం నిస్సందేహంగా ఎరుక అయ్యే వరకూ మననం చేయటం సాధకునికి అవసరం.

35. అయితే ఒకసందేహం రావడంకద్దు. "నాకు నేనే గురువా! అయితే జ్ఞానం కలిగిందో లేదో తెలిసేదెలాగ? నాకు తెలిసిందల్లా జ్ఞానమే నని అధోగతిలో పడతానేమో" అనిపిస్తుంది. అందుకని శ్రీకృష్ణుడు ఈ శ్లోకంలో రెండు బండగుర్తులు చెవుతున్నాడు-

ఒకటి:- ఆత్మజ్ఞానం అనుభూతి అయినాక సాధకుడు ఇక అధోగతికి పడడు. మోహంలో పడడు. అహం చచ్చిన తరువాత కదా 'నేను' అనుభూతి అయింది. మందార మకరంద మాధుర్యమున దేలు మధుపంబుపోవునే మదనములకు" అనే విధంగా యీ

ఇంద్రియములచేత తాను (తన మనసు) లాగబడట మనేది ఉండదు. బయటనుండి చూసేవాళ్ళకు ఇదీ పరీక్ష.

రెండు :- తనకై తాను తెలిసికోటానికి - తనకు సర్వత్ర (భగవంతుడె అనవచ్చు) అధియజ్ఞుడే - ఆత్మే - సదా దర్శన మిస్తూ ఉంటాడు.

ఈ రెండూ జ్ఞానిని locate చేయటానికి పరీక్షలు అన్నాడు. సరే 'ఇంద్రియాలచేత ఎప్పుడూ లాగబడడు' అంటే "నిజమే కామాల్ను" అనుకొంటాముగాక-మనకుకూడ ఇంద్రియాలచే లాగ బడని స్థితి అరుదుగానైనా ఉంటూనే ఉంటుంది, కనక మరి ఈ రెండోదయిన దర్శన మేమిటి అనిపిస్తుంది. ఇప్పటి మనస్థితిలో దీనిని శాఖాచంద్రన్యాయంగా మాత్రంగాచెప్పచ్చు. రోడ్డుమీద మనిషినడు స్తున్నాడు. మనవైపునకు వస్తున్నాడు. అతడిని చూస్తాం. ఏమిటి చూస్తాం,అతడిపాదాలు నేలమీదఎలాటిచిహ్నాలనువదులుతున్నాయో చూస్తామా? చూడము. జాగ్రదావస్థలోని వ్యవహారానికి ఆ వివ రం అక్కర్లేదు మనకు. అందుకోసం వాటిని చూడం. మనం ఒక దొంగను వెతుకుతున్నట్లయితె, ఆ దొంగ పాదచిహ్నాలు మన మన సులో ఉన్నట్లయితే అప్పుడు- ఎదుటి మనిషి పాద చిహ్నాలను చూస్తామేమొ! అలాగే దివ్యస్థితిలో ఆ మనిషి శరీరం అవయవాలూ ఆకృతీకూడ మనకు అనవసరమయి ఉంటవి. అతడిలోని అధియజ్ఞుని- ఆత్మను మాత్రమె దర్శిస్తామని అర్థము. కనక కండ్లతో పదార్థా లనూ మనుష్యులనూ చూస్తున్నా "నేను" అనే నాకు సాధనలో ఆత్మే ఎల్లయెడలా కనిపించు తుంటుంది అన్నమాట. లోకులు తిరిగి యీవ్యవహారంలోకిపిల్చి పలకరిస్తే పలుకుతాముగాక, ఆకొంచెం సేపున్నా. దివ్యస్థితి నుండి దిగివచ్చి పలుకుతాము, 'బావా'అంటే కృష్ణుడు అర్జునుడి వైపుకు తిరిగినట్లు.

అంతటా ఆత్మస్వరూపుడైన పరమాత్మనే చూస్తూ ఉంటావు అని కృష్ణుడంటున్నది అందుకె. ఈ స్థితి పరాకాష్ట స్థితి.

36. పాపాన్ని ఎలా దాటాలో చెప్పి శ్రీకృష్ణుడు ఇంకా అంటున్నాడు. కర్మలు చేయటంలో లోకంచేత పరమ పాపిగా పరిగణింపబడే (ధర్మవ్యాధునివంటి) వారు కూడ, ఈజ్ఞానమనేతెప్పను ఆరోహించి కర్తవ్యకర్మలు చేస్తున్నట్లయితె పాపమనే సముద్రాన్ని తరించిపోతారు అన్నాడు.

37 కట్టెలోనే ఉండి కట్టెను కాల్చుతున్న నిప్పునకు మల్లె, కర్మ చేయటంలో సాధనచే కలిగిన జ్ఞానం ఆకర్మను కాల్చి వేస్తుంది. అనగా పాప పుణ్యాలను అంటనీయదని బోధ. పాపం కాదా-యుద్ధంచేస్తే! అన్న ప్రశ్నకు సమాధానంఇక్కడ పూర్తి అవుతున్నది. యుద్ధకర్మ అప్పటి సమాజానికి అత్యావసరంగా మానవుడు చేయాల్సినట్టి కర్తవ్యకర్మ అనేది మరువవద్దు. ఇక్కడ "మానవుడు" అంటె పిల్లలూ ఆడవాళ్ళకు సరివాళ్ళూనని అర్థంకాదు. యుద్ధవీరులని సందర్భార్థం.

38-39 శ్రీకృష్ణుడు చివరకంటాడు-జ్ఞానం కంటె గొప్పదేది లేదు. ఆ జ్ఞానాన్ని ముందు పొందితే ఆ మీదట మోక్షాన్ని పొందుతావు. "ఎప్పుడు" అని అడగబోతున్నావు గాక. ఎప్పుడంటే ఆ జ్ఞానాన్ని పూర్తిగా అనుభూతి చేసినప్పుడు. అది సాధకుడి శ్రద్ధమీద ఆధారపడి ఉంటుంది. శ్రద్ధగా యోగసంసిద్ధుడవై, సంయతేంద్రియుడవై ఉంటుంటే త్వరలోనే ఆత్మ సాక్షాత్కారాన్ని పొందుతావు. శ్రద్ధ-జ్ఞానం-తత్పరత ఇవి అవసరం. దివ్యుడవయిన క్షణాన సాక్షాత్కారం కలుగుతుంది. ఆత్మే-అదె పరమాత్మే-నీ బుద్ధికిగురువై జ్ఞానానుభూతినిచ్చిన క్షణాన ఆ సాక్షాత్కారం నీకూ కలుగుతుంది.

40 అలాగాక సంశయాలు పెట్టుకొని ఉన్నట్లయితే-ఆధ్యాత్మిక మార్గంలో మాట అలాఉంచు, వ్యావహారికంలో మాత్రం వాడికి సుఖముంటుందా మానవుడికి! ఉండదుగాక. ఉండదు.

41-42 అందుకని పర్యవసానమేమిటంటే, యోగంఆచరించి కర్మఫలాన్ని సన్న్యసించు, సంశయాలను జ్ఞానం అనే కత్తితో నరికెయ్యి. జ్ఞానాన్ని దర్శించి కర్తవ్య కర్మలు చేస్తే, జీవితమే యజ్ఞమవుతుంది. నీవు దివ్యుడవై అప్పుడు ఆలోచించు-ఈ ప్రపంచాన్ని మార్చటమా వద్దా అని. ఇప్పుడేదో ఈయుద్ధంరాకుండా చేస్తే ఎలా ఉంటుంది. నేనుయుద్ధం చేయకపోతే ఏమవుతుంది. ఇలా ఆలోచించటం అప్రస్తుతం అన్నాడు.

—ఇది నాల్గవ అధ్యాయము—

# శ్రీ మద్భగవద్గీతా మననము

## ఐదవ అధ్యాయము

## (కర్మసన్న్యాస యోగము)

### అనుభూతిం బొంది, శాంతుడై కర్మయోగి సర్వలోక మహేశ్వరు డవుతాడు

శ్రీ కృష్ణుడు-"యోగమాచరించి కర్మఫలాన్ని సన్న్యసించమని ఆత్మవంతుని ఏ కర్మలూ బంధించవు" అనీ అన్నందుకు అర్జునునకు సందేహం కలిగింది. ఈ బోధవల్ల "సన్న్యాసమా - సత్కర్మా - కర్తవ్యమైనదేది" అని యోగ రూపంగా కర్మఫలం సన్న్యసించమనే మాటలో కర్మలనే సన్న్యసించి జ్ఞానిని అనుకొంటూ ఉండవచ్చుననే అర్థం అర్జునుడు చదువుతున్నట్లు అనిపిస్తుంది. నిజానికి కర్మలను సంన్న్యసించమని ఎక్కడా చెప్పలేదు. ఆత్మ సంతుష్టుడు కర్మలను చేయడు అని మాత్రం చెప్పారుగాక నిషిద్ధ కర్మలను వదిలివేయాలి. కామ్య కర్మలనుకూడ వదలాలి సాధన చేసేటప్పుడు, కర్తవ్య కర్మలను ఎల్లప్పుడూ చేసి తీరాల్సిందే నన్నారు వీటిని చేయటంలో కర్తృత్వం వదలాలి అనె సాధన చెప్పారు. అలాచేస్తే జీవితం యజ్ఞమవుతుంది. జీవితాన్ని యజ్ఞంచేసేదెలాగ అనే సాధనలో జ్ఞానభాగం గట్టిగా చెప్పారు. కర్తృత్వం వదలివేయాలి అనేదే దాని సారాంశం. అది మనకూ అర్జునుడికీ కూడ బాగా అర్థంకావాలి. ఈ అధ్యాయంలో శ్రీ కృష్ణుడు దానినె అనేక విధాల విశదీకరిస్తాడు. ముందు బుద్ధికి విషయము అవగతం కావాలి. ఆ తరువాతనె ఇంద్రియాతీతమైన అనుభూతి కలిగే అవకాశం ఉంటుంది

శ్లో॥ 1. శ్రీ కృష్ణుణ్ణి అర్జునుడు అడుగుతాడు-"శ్రీకృష్ణా! జ్ఞానాన్ని పొందటం ముఖ్యమన్నావు. శాంతి వస్తుందన్నావు, ఆత్మజ్ఞానం కలిగి

కర్మను సన్న్యసించితె బంధనముండదన్నావు. ఐతే కర్మయోగిగా నిష్కామమైన కర్మచేస్తూ ఉండాల్సిందే నన్నావు కదా ! ఈ సన్న్యసించడమూ కర్మచేస్తూ ఉండటమూ ఒకదానికొకటి వ్యతిరేకంగా అవుపడుతున్నాయే ! ఈ రెండూ ఒకేసారి ఏకంగా ఆచరింపవలసి ఉంటుందా ? ఉంటే అది ఎలా సాధ్యం ? ఇవి రెండు నిష్ఠలనిపిస్తున్నాయి. కాని ఈ రెంటినీ నీవు ప్రశంసిస్తున్నావు. వీటిలో ఏది శ్రేష్టమై ఆచరింప తగిందో అది చెప్పరాదూ ! బాగా నిశ్చితంచేసి ఫలానిత్రోవ నీది అని నాకు చెప్పవలసింది - మళ్లీ యుద్ధం చెయాలని వాళ్లంతా చూస్తున్నారిప్పుడె" అంటాడు.

2. సమాధానంగా శ్రీకృష్ణుడు - అనుభూతి స్థాయికివెళ్లి విమర్శనం చేయటం గమనిస్తాము - "అర్జునా సన్యాసమూ కర్మయోగమూ రెండూ రెండు నిష్ఠలు. ఆ సంగతి నిజమె. రెండూ నిశ్శ్రేయస పదప్రాప్తి నిచ్చేవె, ఈ రెంటిలో నీకు ఏది ఆచరణీయమో శ్రేష్ఠమో చెప్పాలంటె సన్యాస కర్మ కంటె కర్మయోగమె నీకు శ్రేష్ఠము. అలా చేస్తే కర్మ సన్యాసనిష్ఠ వల్ల కలిగే లాభం కలగదు గదా అనే లోభం నీలో జనించుతున్నట్లున్నది. అసలు విషయం చెపుతాను విను —

3. కర్మయోగి యొక్క లక్షణం ఏమిటని చెప్పుకొన్నాం? జ్ఞాపకం చేసికొను - కాంక్ష గాని ద్వేషంగాని లేనివాడు - ద్వంద్వాలను దాటిన వాడు అని, అలాంటి వాడు నిత్యసన్న్యాసె గాక ఇంకేమవుతాడు నిజానికి. అతడు ఎక్కడికక్కడ ఎప్పటికప్పుడు ఫలాన్నీ కర్మ కర్తృత్వాన్నీకూడా మనసునుంచి సన్న్యసించిన వాడు. అందువల్లనే కదా యీ ద్వంద్వాలను అతడు దాట కలిగింది. ఈ విధంగా ఇతడు నిత్యసన్న్యాసి అయినప్పుడు— ఇక సన్యాసి సంగతేమిటనిపిస్తుంది. కర్మను వదలివేయటం ద్వారా కర్తృత్వమూ, ఫలమూ రెండూ లేకుండ చేసికొన్న వాడవుతున్నాడు. పైగా ఆ ఫలం కలగలేదనిగాని ఆ పని చేయలేదని గాని అతడు దిగులు పడడు.

అందుచేత పైనుంచి చూస్తె సన్న్యాసీ కర్మయోగీ కూడ తేడాగా అవుపడరు. మనస్తత్త్వం ఇద్దరిదీ ఒకటె. కర్మయోగి, ఏ విషయాని కా

విషయంలో అలాటి మనః ప్రవృత్తితో ప్రవర్తిస్తుండగా సన్న్యాసి ఎల్లప్పుడూ ఆ మనః ప్రవృత్తినే ఆధారం చేసి, కర్మలను సన్న్యసించు తున్నాడు. మనః ప్రవృత్తి ఒకే ఒకటై దానిని సంతరించుకొనవలెనని ప్రయత్నం చేసే సాధకునికి కర్మయోగమే కర్తవ్యమైనదని తెలియుటల్లేదా! ఆ మనః ప్రవృత్తి తిరమై నిలిచిన వానికి ఏ మార్గమయినా ఒకటే.

4-5 అలాగాక ఆ ఇద్దరూ భిన్నులూ వ్యతిరేకులూ అని అనుకొనే వారు బాలురు. వీరిలాగా విజ్ఞులు సన్న్యాస ఫలం వేరనీ కర్మయోగ ఫలం వేరనీ అనుకొనరు. సరిగా ఏ ఒక్కటి పాటించినా రెంటి ఫలమూ పొందటమే జరుగుతుంది ఒకే పనివల్ల రెంటి ఫలం ఎలా కలుగుతుందని అనుకొంటున్నావేమో. ఈ రెండూ రెండు దోవలనీ - లేదా రెండు సాధనలనీ - ఏదోవనువెళ్లినా గమ్యమైన ఒకే చోటికి వెళ్లగలరనీ తెలియాలి. అలాటప్పుడు ఒక దోవన వెళ్లితే కలిగే ఫలం రెండో దోవన వెళ్లినాస్తుందంటే ఆశ్చర్యమేముంది? ఈ సంగతిని స్పష్టంగా అర్థం చేసుకొన్న వాడు
[illegible]

ఇవి రెండు దోవలు. ఎవరికి ఏది వీలయితె ఆ దోవను వెళ్లాలి. నీవు సన్న్యాసులను చూచి ఉంటావు. ఎల్లప్పుడూ శాంతి ననుభవిస్తూ ఉంటారు వాళ్లు. ఆ శాంతిని నీవుకూడ పొందాలనే ఉద్రేకతతో నీవూ హఠాత్తుగ వెళ్లి వాళ్లలో చేరాలనుకొంటున్నావు. ఆ బాట నీదైనది కాదు. మరొక బాట కర్మయోగం అనేది ఉందనీ అది తగినదనీ చెప్పడానికే ఇంత చెప్ప వలసి వచ్చింది. సాన్ని పొందనే లేవు సుమా! [illegible]

6. సన్న్యాసం నీకు ఎందుకు తగదని అంటున్నానంటె - యోగాభ్యాసం లేకుండా మనిషి సన్న్యసించినట్లయితె అదొక దుర్గమమవుతుంది. దుఃఖాన్ని ఇస్తుంది. అందువల్ల ముందు యోగివై తగిన మనస్థైర్యాన్ని పొందిన మీదట సన్న్యాస మార్గం అనుసరించినట్లయితే అచిరకాలంలోనే బ్రహ్మాన్ని చేరగలుగుతావు. ఆ మనస్స్థైర్యం లేనివారు సన్న్యాసాన్ని పొందనేలేరు.

7. శ్రీ కృష్ణుడు చెప్తున్నాడు. "నీవు అనుకోవచ్చు - కర్మలు చేయవలసినవాడు యోగిన్నీ, వదలవలసినవాడు సన్యాసిన్నీ అని. యోగి అయినవాడు ఎప్పటికయినా సన్న్యాసి కావలసియే ఉన్నదీ అని నీ భావం బహుశ; కావి యోగి కర్మద్వారానే విశుద్ధమైన ఆత్మ పొంద గలుగుతున్నాడు; విజితాత్ముడవుతున్నాడు; జితేంద్రియుడవుతున్నాడు. నియతమైన కర్మ నిష్కామంగా చేస్తుండటంచేత విశుద్ధాత్ముడుగాను, ఆశలు పెంచనివాడూ కామవర్జితుడూ గనుక విజితాత్ముడుగాను; ఆత్మను తెలిసి అనాత్మనుండీ వేరు చేసి చూస్తాడుగనుక జితేంద్రియుడుగానూ అవుతాడు. ఈస్థితె సన్న్యాసి స్థితి ఈ స్థితి వల్లనే కర్మల కర్తృత్వం కర్మఫలం రెండూ త్యజింపబడటం అవుతుంది. అతడికి అప్పుడు ఎక్కడ చూచిన ఆత్మె దర్శన మవుతుంటుంది.

సర్వభూతాల్లోనూ, ఆత్మె ఉండీ పలకరిస్తుంటుంది. తన చేతిని చూస్తే అక్కడ ఆత్మ. కలాన్ని చూస్తే ఆత్మ. పుస్తకంలో ఆత్మ. అక్షరాలలో ఆత్మ ఎక్కడయినా ఈ ఆత్మ ప్రత్యక్షమవుతుంటుంది. తానూ ఆత్మె. 'తాను' అనేది ఇంకా ప్రత్యేకంగా ఎక్కడ నిల్చిందిగనుక! తాను చేస్తున్న పనీ లేదు. తనకు ఇంకాస్థానమెక్కడ? ఆ స్థితిలో సర్వ భూతాత్ముడే తాను అనిపిస్తుందతడికి.

8-9:- తను చూస్తున్నాడు. తనకళ్ళు చూస్తున్నవని అనుకొన్నాడు మొదట్లో. ఇప్పుడు కళ్ళు ఆత్మగా అవుపడుతోంది. అందుకని ఆ పని చేసేది ఆత్మ అనిపిస్తోంది. అలాగె తాకటం వాసన చూడడం, మలమూత్ర విసర్జనచేయడం, గ్రహించడం కన్ను మూయడం, తెరవడం, ఇవి మానవుడుగా తానుగాక తన అవయవాలు చేస్తున్నా-ఆత్మమీదనె అనుసంధానం కలిగిన వాడవుట మూలాన 'ఆత్మె' ప్రతి కర్మలో ఉన్నదై తనకు అనుభూతి ఇవ్వటం చూస్తాడు యోగి. అలాగె సన్న్యాసి సర్వమూ "భగవంతుడె" అయి యీ పనులనీ చేస్తున్నాడనుకొంటూ ఉంటాడు. దానికీ దీనికీ భేదంలేదు "ఆత్మ" అని యోగిన్నీ. "భగవంతుడ"ని సన్న్యాసిన్నీ ఆరాధిస్తూ ఉంటారు. పేరు మాత్రమే భేదం.

ఇంతవరకూ శ్రీ కృష్ణుడు చెప్పిన సాధనలో "భగవంతుడు" అనే భావం ఏమిటో ఇదమిత్థమని చెప్పలేదు. "నేను" "ఆత్మ" "అనాత్మ" ఇవె వ్యక్తి జీవితంలోని అంతరాంతరాల్లో ఉన్నాయి అనె భావమె చెప్పినాడు. ఇప్పుడు మాత్రం, సర్వత్ర అవుపడుతున్న ఆత్మ-అనాత్మ అనుకొన్నదానిలో కూడ ప్రత్యక్షమవుతున్న ఆత్మ-అంటే, అనాత్మకు భిన్నంగా అవుపడక ఏకంగా అవుపడుతున్న ఆత్మ-బ్రహ్మమని పిలువబడబోతున్నది. ఈ బ్రహ్మము-చైతన్యముతో సహా-సర్వోత్కృష్టస్థితిలో సర్వశక్తిమంతమై పరమాత్మ-ప్రభువు అని పిలువబడె భగవంతుడేనుఅనే భావం కలుగుతుంది దానిక్కి ప్రాతిపదికగా తరువాతి శ్లోకం చెపుతున్నారు.

10. నీకు స్పష్టంగా చెపుతున్నాను విను. కర్మయోగిగాని, సన్న్యాసిగాని ఎలాఅనుకోవాలంటే-జరిగేకర్మలన్నిటినీ బ్రహ్మమే చేస్తున్నది.అని అనుకోవాలి. ఆ బ్రహ్మమును భగవంతుడన్నా సరే,స్వభావమన్నా సరె ప్రకృతి అన్నా సరే. ఫరవాలేదు-ఆమేర, కాగా కర్మఫలం మీద ఆసక్తి ఉంచుకోరాదు. ఇదీ కీలకమైన సంగతి, ఈ బ్రహ్మమేమిటి భగవంతుడేమిటి? ఆత్మ అన్నావుకదా ఇంతవరకూ,అను ప్రశ్న ఉదయిస్తోంది. నీలో ఆత్మను ఎఱిగి దానికి భిన్నమైన ఆత్మను గుర్తించటం ఆరంభించిన స్థితివేరు. ఇప్పటి స్థితి వేరు. ఆత్మను అన్నిచోట్లా చూడగలిగిన స్థితి నేనిప్పుడు చెపుతున్నట్టిది, యోగారూఢ స్థితి అనుకొను. ఆత్మ అన్నిచోట్ల దర్శింపబడు తున్నట్లయితే ఆయాత్మబ్రహ్మమె. సన్న్యాసి ఈ బ్రహ్మమునె భగవంతుండంటాడు. వట్టి కాషాయ వస్త్రాలు కట్టి ఇది తెలియని వాని సంగతి మనకు వద్దు. బ్రహ్మమును దర్శించిన సన్న్యాసి అన్ని కర్మలూ ఆ బ్రహ్మమె చేస్తున్నట్లు ప్రత్యక్షంగా చూస్తాడు. బ్రహ్మము అనేటప్పటికే సర్వభూతాత్ముడయినవాడు అనె అనుసంధానం కలగాలన్న మాట. భగవంతుడంటేనే ఆ అర్థంమనసుకు తట్టాలి. అలా కర్మలనీ భగవంతుడే చేస్తున్నాడని అనుభూతి చేయటమే బ్రహ్మమందు కర్మలను సన్న్యసించటం.

నాల్గవ అధ్యాయంలో చెప్పినదానికి దీనికి తేడా గమనించి సమన్వయంపొందాలి.కర్మయోగిమెట్టు నెక్కుతున్నడు-సాధనకుమొదట్లో ఆత్మనుఎఱిగిఆ. మాత్మ మీపసే చేయుటట్లేమఅనేఅనుభూతిని పొందాలి.

ఇప్పుడు - అంటే ఆత్మే సర్వత్ర దర్శనమిస్తున్నపుడు సర్వభూతాత్మ భూతాత్ముడయిన బ్రహ్మముగా తెలియబడుతూ అతడే అన్ని కర్మలూ చేస్తున్నాడు అనాలి. అక్కడ తనలోని ఆత్మ చేయుటల్లేదూ అన్నతాడు ఆ ఆత్మ సర్వత్రనున్నదౌట మూలాన బ్రహ్మమే అయి సర్వమూ చేస్తున్నది అంటాడు. అప్పుడూ ఇప్పుడూ కూడ తాను (మానవుడు) పద్మపత్రాలు మీది నీటివలె అంటకుండా వెళ్ళిపోతుంటాడు. వెళ్ళిపోతుంటాడు అంటె అతడే వ్యవహారాలన్నీ చేసికొని పోతుంటాడని అర్థం.

చేసే కర్మలో అప్పటికీ ఇప్పటికీ భేదం లేదు. కాని దృష్టిలో భేదం ఉంది. బుద్ధిలో ఉత్కృష్టత ఉంది. ఇదంతా బుద్ధికి సాధన అనేది జ్ఞాపక ముంచుకోవాలి. నిజానికి ఈ తత్త్వం తెలియటం కష్టమయే కారణం చిన్నప్పటినుండి ఒకానొక స్వార్థవాతావరణంలో అభివృద్ధి అయిన బుద్ధె. దానికి ఈ ప్రాపంచిక కార్యకారణ సంబంధపూర్ణమయిన తర్కమొకటి చుట్టబెట్టి వ్యక్తిత్వమీయడంవల్ల అది అతీంద్రియ విషయాలను నమ్మదు నమ్మనీయదు. దానికి శిక్షణ-ట్రైనింగు ఇవ్వడానికే ఈ 4-5 అధ్యాయాలు చెప్పింది. అది సమాధాన పడిందంటె ఇక ట్రైనింగు పొందవలసింది మనసూ, శరీరములె. మనసు తర్వగా లొంగేదికాదు గనుక బుద్ధికి ముందు పాఠం చెప్పుతున్నారు. ఇక శరీరానికీ మనసుకూ పాఠం చెప్పటం ఆరవ అధ్యాయంలో చెపుతారు. ఆ సాధనవల్ల శరీరం కూడ దోవలో పడిన దౌతుంది. మనసు లొంగదీయబడినది కూడ అవుతుందిగాక.

11. ఇంతకూ అంటకుండా ముట్టకుండా పనులు చేయుటమెలా అనిపిస్తుంది. కాయంతో మనసుతో బుద్ధితో కర్తవ్య కర్మలు చేస్తూ కర్మ ఫలం, కర్తృత్వం రెండూ తనయందుంచుకోకుండా చేయటమె పద్మపత్ర స్థాంబువుల్లాగా మెలగటం. అ చేయుటంలోగల సాధన క్రిందటి అధ్యాయంలో 21-24 శ్లోకాల్లో వివరించి చెప్పారు. దాని సంక్షిప్తినె ఇక్కడ మళ్ళి సూచించారు. అలా చేస్తే జీవితం యజ్ఞమయమవుతుందని అక్కడ అన్నారు ఇక్కడ అలాచేస్తే ఆత్మశుద్ధి కలుగుతుందన్నారు. ఆత్మ అంటె ఇక్కడ మనసు బుద్ధి అని అర్థము. ఈ రెంటికంటె పైన ఆత్మ అని మానవుడిలో ఉన్నది అని చెప్పిన ఆ ఆత్మసంగతి కాదు. సామాజికుడు సమాజ సేవను ఆ చెప్పబడిన దృష్టితో చేయటం ద్వారా ఉద్ధరింపబడుతాడు.

12. యుక్తుడైన వాడు కర్మలు చేస్తూ శాంతిని పొందుతుంటాడు, సక్తుడు ఫలాల వెంటబడి వెళ్లినవాడై సక్తివల్ల బద్ధుడై పోతాడు. ఫలాలు యుక్తుడికి కలుగవనుకోవటం పొరపాటు. కార్య కారణ సంబంధ వల్ల కలిగే ఫలాలు కలుగుతునే ఉంటవిగాక, మంచి మనసు బుద్ధి కలిగిచేసిన పనికి చక్కని ఫలం కలగటం అశ్రద్ధగ చేసిన పనివె ఫలం స్వల్పం కలగటం చూస్తూన్నాము కదా! అందుచేత ఆ ఫలం ఎలా కలగాలో అలా యుక్తుడికీ అయుక్తుడికే కూడ కలుగుతుంటుంది గాక. అంటె అర్థం యుక్తుడికి మంచి ఫలం. అ యుక్తుడికి స్వల్ప ఫలం కలుగుతుంటుంది.

కర్మల విశయంలో సాధకుడికి మూడు మెట్లున్నాయి. కర్మ ఫలాన్ని వదలటం ఒక మెట్టు కర్మను 'ఆత్మ' అయిన నేను చేయుట క్లేదనటం రెండవ మెట్టు. ఇక సర్వత్ర నుండే ఆత్మె బ్రహ్మమై, సర్వ కర్మనూ చేసికొంటు న్నాడు అనుకోవటం ఇంకా చెప్పాలంటె- మనసు ఇంద్రియాలతో ఏకమై ఉన్నప్పుడు వాటిని అదుపులో పెట్టుతూ ఉండాలి, కర్తవ్యాలను చేస్తూ ఉండాల్సిందె. సంకల్పాత్మక కర్మలను వదలివేస్తూ ఉండాలి. ఇక మనసు ఆత్మతో ఏకమయినపుడు, "నేను" వేరు, అనాత్మ వేరు నేను ఏమీ చేయట ల్లేదు— అనాత్మె ఈ పనులు చేస్తున్నది అనాలి, మూడవ స్థాయిలో సర్వత్ర బ్రహ్మమునే—ఆత్మనే—చూస్తున్నపుడు—అనాత్మ కనుపడదు—అంతటా నున్నది బ్రహ్మమే గనుక—ఇంతకు ముందు స్థాయిలో కొంత ఆత్మగా కొంత అనాత్మగా ఆభాసమై కనపడింది అని తెలిసి—అనాత్మె పనులు చేయిస్తున్నది. అనుకొన్న ఇప్పటి వరకూ గల స్థితి మారి బ్రహ్మమే యీ పనులుగా అయి ఊరుకొంటున్నది అని తెలుస్తుంది. — నిన్న సాయంత్రం వరకూ వికసించిన పువ్వు ఈ ప్రొద్దున వాడి అలాగె ఉన్నా అది, ఒకానొక రాబోయె కాయ మాత్రమే అనిపించినట్లు. ఇవన్నీ రకరకాల మెట్లు— అందుకే—

13 యుక్తుడయిన, జితేంద్రియుడయిన పురుషుడు మనసులో అన్ని కర్మలనూ వదలివేస్తాడు. పురుషు డెవరంటె దేహమనే యీ పురంలోనున్న వాడు పురుషుడు. తొమ్మది ద్వారాలు కలిగిన యీ శరీరమే ఆ పురం.కళు.

చెవులు, ముక్కోళ్లు. నోరు పాయువు ఉప స్థలు ఇవి తొమ్మిది రంధ్రాలు ఈలాంటిఇంట్లో నివసించేది జీవుడు అతడికి ఏ పనీ చేయవలసిందిలేదు. వెంటనే శంకకలగవచ్చు. ఆదేమిటి? ఈ జీవుడు బ్రహ్మము కాదాఅని, తాను కేవలం యీ ఒకానొక దేహంలోనే ఉన్నానను కొన్నంతసేవూ జీవుడు, బ్రహ్మము అని పిలువబడడు. ఆ లక్షణము అక్కడ వ్యక్తం కావటంల్లేదు కదా. అతడే తాను సర్వత్రనున్న వాడని అనుభూతి చేసిన క్షణాన అతడికి ఆబ్రహ్మ లక్షణము అబ్బుతుంది. అప్పుడతడే బ్రహ్మము అవుతాడు అంతేకాదు.అతడికి సర్వత్రనున్న భూతాలూ బ్రహ్మమేకనకపరి మితినిఅనుభూతిచేస్తున్నంతకాలంజీవుడె,పరిమితినిఅధిగమిస్తేబ్రహ్మము.

భగవద్గీతలో సాధన చెప్పటం ఆరంభించిన దగ్గర నుంచీ ఇంత వరకూ భగవంతుడు, సృష్టి సంగతులు చెప్పబడలేదు. ఇప్పుడీ ఆధ్యాయంలో భగవంతునె బ్రహ్మము అన్న పేరుతో వాని లక్షణాలను— సాధారణ మానవునికి తెలిసిన శరీరము, మనసు, బుద్ధీ ఆపైది (ఆత్మ) అనే వాటి ద్వారా తీసికొపోయి శ్రీకృష్ణుడు సూచిస్తున్నాడు.సృష్టికి పూర్వం భగవంతుడె ఉన్నాడు. అతడికి ఫలాన రూపమని యేదీ లేదు. పరాత్పరస్థితిలో ఉన్నాడు. అది కేవలం అనంతదివ్య శూన్యస్థితి— అవ్యక్త చైతన్యస్థితి, ఏమీ తెలియనిస్థితి, తెలియాలనె ప్రసక్తికూడా లేనిస్థితి—అన్నీ అణగారిపోయి వానిలోనె ఉన్నాయి. ఆ స్తిత్వం, జ్ఞానం, శక్తి, ఆనందం, చైతన్యం, సర్వవ్యాపకత్వం— సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ—

ఆతరువాత కొంత కాలానికి-కాలపు కొలతెఅప్పుడు లేదుగాక- ''నేనెవరను'' 'అనే చైతన్యం' ప్రశ్నగా ఉదయించింది. ఆస్థితిలో నుంచే తన స్థితి ఎరుక లేనిస్థితిలో ఎరుక కోసం ప్రేరణ కలిగింది. ఈ ప్రేరణను ఒక ప్రశాంత మహాసముద్రంలో పేలుడుగా అయింది. సముద్రం శీకరబిందువులుగా అయినట్లు అసంఖ్యాకాలయిన బుడగలు ఉద్భవించినట్లు అలాఅయింది. ఆబిందువులన్ని పరాత్పరస్థితిలో అంతర్నిహితమై ఉన్నవే. ఇప్పుడవి ప్రత్యేక ప్రత్యేకమై నేను బిందువుని, నేను బుడగని అనుకొనేటట్లు ఆ చైతన్యం చేసింది. అలా నేను మనిషిని నేను మానుసి అనుకోవటం ఎక్కడి

కక్కడ ఆరంభమయింది.ఎవరి ఇచ్ఛకు వీలుగ వారు తమతమ శరీరాలను మనసులను బుద్ధిలను సంతరించుకొన్నారు. నిజానికి తాను భగవంతుడె పరాత్పరస్థితిలో ఇప్పుడిలా అనుకొంటున్నాడు పది మందితో పాటు తానుమానవుడెనని, అలా భ్రమపడుతున్నాడు. ఈ సృష్టి ఇలా అయింది. సృష్టిఅంతా ఆ భ్రమే.తద్దృష్ట్యా భగవంతుడె తనలోని వివిధ అవయవాల్లో ప్రతిదానికి వ్యక్తిత్వాన్నిచ్చి ప్రపంచం అంటె ఇన్నింటి సమావేశం అనిపింప జేయటం అయింది. ఇదేభ్రమ.

అలాంటి మానవుడు విషయం ఎఱిగినవాడై తిరిగి భగవంతుడు కావటం అతడి కర్తవ్యం. అదే పరమ సాధన. ఆసాధనలో పైనుంచి క్రిందికి ఎలా వచ్చామొ, తెలిసికొనటం అలా నడుచుకోవటం ఒక రకం. కాని శ్రీకృష్ణుడు ఆ పంథా త్రొక్కలేదు మన మేధలు వికసించి ఉన్న వవడంచేత, తెలివి కార్యకారణ సంబంధ యుతమయినదవడం వల్ల,అసలు అపరాత్పరస్థితి అనేదే ఉన్నదంటే నమ్మకపోయే ప్రమాదం ఉండవచ్చు. ఇప్పుడు మన మేధలే కాదు అర్జునునికి కూడా అలాంటి మేధయే అప్పటికి ఉన్నట్లు స్పష్టము. అతడు కూడా కార్యకారణ సంబంధం ఇంద్రియగ్రహణముతో మాత్రమె జోడించి ఫలాని ధర్మ శాస్త్రాలు వ్యతిరేకంగా అవుపడుతున్నాయే అనేప్రశ్న వేసేవరకూ వెళ్ళిందికదా.అందుకనే శ్రీకృష్ణుడు క్రింద నుంచె పైకి ఎక్కేపాఠమేదో అది ఆరంభించి ఇంత దూరంచెప్పినాడు.ఇప్పటికి భగవంతుడంటే ఒకానొక చిత్తు నిర్వచనం ఇచ్చినట్లుగా చెప్పిన పాఠంలోని "బ్రహ్మమె" అది అనేభావం వ్యక్తపరుస్తున్నాడు.

భగవంతుడు అంటె ఉత్కృష్టమైన భావం. బ్రహ్మము అంటెకనపడె సర్వమైన అనాత్మ అందుతోదె: పైగా ఆత్మఅంటున్నదేదో అదీ బ్రహ్మములోదె—ఆత్మకుడి భాగం అయితే అనాత్మ ఎడమ భాగంఅని అనవచ్చు అంతకు తప్ప భేదం లేదు. ప్రపంచం కనపడుతున్నట్టిదంతా (ఇంద్రియాలకు) అనాత్మ. అది పుట్టుతుంటుంది. చస్తూ ఉంటుంది ఎప్పుడూ మార్పును చూపుతునే ఉటోంది. ఇదిచైతన్య లక్షణము, అత్మ ఎన్నడూ మారనిది. సాధనకోసం ఈమాటలూ మాటల పరిమితార్థాలూ తెలియ

టానికి అలా చెప్పడమవుతున్నది. బ్రహ్మ ఆత్మ అనాత్మల కూడిక అయినా దానికి ప్రత్యేక వ్యక్తిత్వముంది దానికి ప్రత్యేకమైన సంకల్పమున్నది. ఈ స్థితిలో నున్న బ్రహ్మమును, శ్రీ కృష్ణుడు 'ప్రభువు' అని సూచిస్తూ కర్మలు జరగడానికీ దానికి గల సంబంధము మరొక దృష్ట్యా చెప్తున్నాడు.

14. ఈ బ్రహ్మము ఊరికె ఇలా ఉంటున్నది. కాని వ్యక్తిత్వాన్ని పురస్కరించుకొని ఏ మానవుడికీ లేదా జీవుడికి గాని అతడీ పని చేయాల్సి వుంటుంది అని ఆదేశింపదు. కుక్కరు కొన్నాం. కుక్కరు ఎలా వాడు కోవాలో వ్రాసిన ఒక పత్రంతో సహా ఇంట్లోకి వచ్చింది. నీవుదానిని వాడుకోవాలంటె వాడుకోవచ్చు లేకపోతె మూలవేయవచ్చు. నీవు దానిని వాడి తీరాలి అని ఆ పుస్తకంలో ఆ పత్రంలో ఉండదు. అలాగె ఆప్రభువు అయిన బ్రహ్మము ఎవరినీ యీ పని చెయ్యి అనే ఆజ్ఞలిచ్చేవాడు కాదు. అంటే అర్థం పనులన్నీ మనకై మనమె మన అవసరాల కోసం చేసుకొంటామని అర్థం. అంతేకాదు. ఈగ్రైండరులో పప్పుపోస్తె పిండిరావటం ఫలమే గాని కందిపప్పు పోస్తె పెసరపిండి రావటం ఎలా ఉండదో అలాగే ఒక పని చేయటం మూలాన ఇంకో ఫలితం నేను ఇస్తానని మాత్రం ప్రభుపు కంకణం కట్టుకోలేదుట. అంటె కాఫి ఆదరణతో ఇస్తె అతిధి త్రాగుతాడు. నిరాదరణలో ఇస్తె అక్కడ వదిలేసి పోవటం కద్దు. ఫలితం దేనికదే గాని కాఫీకి ఒకే ఒక ఫలితమేదీ ప్రభువు వ్రాసిపెట్టలేదుట. స్వభావాన్ననుసరించి ఫలం రావడమేగాని ప్రభువు యొక్క ఆజ్ఞ ప్రత్యేకం లేదని ధ్వని. బ్రహ్మానికి ప్రత్యేక వ్యక్తిత్వం లేదని చెప్పటల్లేదనేది మర్చిపోవద్దు. కాని ఆ వ్యక్తిత్వం ఫలం ఈయడానికి ఉపయోగింపబడదు. సర్వసాధారణంగా స్వభావమే నడుపుతుంటుంది దాన్ని అని అర్థము

ఈ స్వభావమేమిటి? బ్రహ్మముగాక ఆత్మగాక ఈ స్వభావమెక్కడిది అనిపశ్న. స్వభావమంటె త్రిగుణాల స్వభావం. త్రిగుణాలు అనాత్మనంటి పెట్టుకొని ఉన్నట్టివి. చైతన్యంతో కూడిన వాటిస్వభవమె ఈ కార్య కారణ సంబంధమైనదై ఫలం కనపడుతుంటుంది. అందుచేత ఫలకారణం, స్వభావమా. అనాత్మా, బ్రహ్మమా భగవంతుడా ఏదిఅనే ప్రశ్నకు ఎవరడి

గితే వారివారికి తగిన సమాధానముంది. బ్రహ్మమును తెలిసినవానికి బ్రహ్మ మనీ, తెలియని వానికి, బుద్ధికి అలా తెలిసికూడ అనుభూతి చెందనివానికి, త్రిగుణాలనీ, అనాత్మనీ చెప్పాల్సివస్తుంది—తెలిసేటట్లు చెప్పాలంటె అతడికి ఇలా చెప్పి-నాకు అలా చెప్పావేమి అనే తర్కానికి తావు లేదు, నీకు తెలియంది వదలిపెట్టి తెలిసికోడానికి తెలిసినదానితో ప్రయత్నించు అనిబోధ.

15 శ్రీకృష్ణుడు ఇంకా చెప్తున్నాడు-ఆ'విభుడు' మన పాపాన్ని చిటికవేసి హరించేస్తాడని అనుకోవద్దు. మన సుకృతాన్ని ఫలంచేసి ముద్ద నోటికందించే హోటలు యజమాని అనుకోవద్దు. భగవంతుడని దానిభావం అది కానేకాదని బోధ, పాపంవల్ల మనకయి మనం దిగజారినా మన్న మాట-పుణ్యంవల్ల ఒక అంగుళం పైకెక్కామన్నమాట. అంతే తప్ప కార్యకారణ సంబంధంతో కూడిన కర్మఫలం తెచ్చి ఈ పుణ్యపాపాలకు అంటిస చేయరాదని ధ్వని.

మరి కోరికలు తీరాలంటే భగవంతుని ధ్యానించమనే సూక్తికి అర్థం ఏమని? అది వట్టి అజ్ఞానమా? భగవంతుడంటె తెలిసినవారికి అది అజ్ఞానం కాదు జ్ఞానమె. మిగతావారు కేవలం విగ్రహాలకు పూజలు కొబ్బరికాయలూ అర్పించే మేర కోరికలు తీరే విషయంలో అజ్ఞానమే. చెదరి పలు విధాలుగా పోయే మనసును ఒకచోట కూడదీసికొనడానికి ఆ విగ్రహాల భజనము సహాయపడుతుంది. శ్రద్ధ పెరగడంవల్ల కర్మచేయడంలో శ్రద్ధ పెరుగుతుంది విగ్రహాలు అనాత్మ స్థితిలో నున్న భగవంతుడు మాత్రమె అయినా శ్రద్ధ మూలాన పనిలో కౌశల్యం యేర్పడి సత్ఫలితం కలుగుతుంది.

భగవంతుని ఆరాధించుటం తప్పనిసరె. కాని కోరికలు తీరుతవనే కాంక్షతోనే మాత్రంకాదు. భక్తునికి సర్వత్ర అవుపడే బ్రహ్మాన్ని చూసి ఆయన్ను భజించక తప్పదు కనక అతడుఆయన్ను భజిస్తాడు. భగవంతుడూ-ఆరాధన అనే విషయాలు ఇలా అర్థంచేసుకొనటం Intellect కు బుద్ధికి

సంబంధించిన విషయం. మరో విధమయిన కోరికను పురస్కరించుకొని చేసేపూజ ఇంకా తక్కువయిన భావాలకు సంబంధించింది. అంటేమనసు శరీరం వంటి స్థాయిఅని అర్థం. బుద్ధికి తక్కువస్థాయి.

మరి అంతా అలాఆరాధించటంలేదే. కారణం ఏమిటి? దానికి కారణం పరిజ్ఞానం అజ్ఞానంచేత ఆవరింపబడటమె. కామ క్రోధాలనే శత్రువులే బుద్ధి మనసు శరీరం అనే వాటిలోగల జ్ఞానాన్ని ఆవరించుతవి. వెనకటి అధ్యాయాల్లో అధిష్టానాన్ని ఆవరించు కొని ఈరజోగుణోద్భవాలైన కామక్రోధాలు ఉంటున్నవని చెప్పారు. ఆ అధిష్టానంలోనున్న జ్ఞానంతోనే మనం మన వ్యవహారాలు చదువులు చదువుతుంటాం. అలా అజ్ఞానంచేత ఆవరింపబడిన జ్ఞానంతోనే ఆ చదువులు నేర్చుకొంటూ వ్యవహారాలు చేసుకొంటూ ఉంటాం. ఆ అజ్ఞానం పోతె చక్కని జ్ఞానవంతులం అవుతాంగాక. అది పోయేదేలా ?

ఆత్మలోఎల్లికొల్లలుగాఉంటుంది.జ్ఞానం.అదిఅజ్ఞానంచేత ఎప్పుడూ కప్పబడదు. దానివైపు తిరిగి ఈమనసు. బుద్ధి ఇంద్రియాలు చూస్తే కావాల్సినంత జ్ఞానం ఉబికి ప్రకాశమిస్తుంది. అదే చేయాల్సిన కర్మము. అలాచూడక ఇంద్రియాలకు కనపడుతున్నదల్లా బ్రహ్మమైయుండగా, పరికరాల రూపంలో అనాత్మరూపంలో బ్రహ్మమె కర్మలను చేస్తూ ఉండగా కొంత అనాత్మను "నేను-నాది" అనుకొంటూ కొంత అనాత్మను అతడిది అనుకొంటూ, ఇది నేను చేసినపని. అది అతడు చేసిన పని అని వాగ్వివాదంలో పడిపోవటం జ్ఞానాన్ని కోల్పోయి మోహంలో పడిపోవటంకాదా?

16 మరి ఈఅజ్ఞానం పోయేదెప్పుడు? మోహంవదలినప్పుడు. అంత ర్దృష్టిచేత ఆత్మలోనున్న అఖండ జ్ఞానాన్ని చూచి, పొంది, ఈ మోహాన్ని పోగొట్టుకోవాలి. అప్పుడు జ్ఞానము శరీరం సర్వత్ర ప్రకాశ మానమై ప్రభువును ప్రస్ఫుటంగా చూపుతుంది, నిజానికి అదె ప్రభువై సాక్షాత్కరిస్తుంది. అంటే ప్రత్యంగ విషయముష్నా ఈప్రపంచంలో స్పష్టంగా బ్రహ్మభావ పూర్ణమై తెలుస్తూ ఉంటుందన్నమాట.

17 తద్బుద్ధయః = అచెప్పిన జ్ఞానమునే బుద్ధియందు నిలిపిన వాడు జ్ఞానమందె నిష్ఠగలిగినవాడు: తదాత్మానః = బ్రహ్మాత్మ భావుడైన వాడు: తన్నిష్ఠాః = బ్రహ్మ స్థితులైనవారు; తత్పరాయణః = బ్రహ్మ పరాయణులైనవారు; జ్ఞాన నిర్ధూతకల్మషులై అంటే జ్ఞానముచేత మోహము పోగొట్టబడినవారై; అపునరావృత్తిం = మళ్ళీతిరిగి మోహంలో పడనట్టిస్థితికి, గచ్ఛంతి = వెళ్ళుతున్నారు.

ఇది అనుసంధానానికి పరాకాష్ట,థాబ్రహ్మము అనంగానే యీఐదో అధ్యాయసారం మనసుకు రావాలి, అందుకు వెనకటి అధ్యాయాల పూర్వ రంగంఉండాలి మనసు అపుడుఅందులో లగ్నంకావాలి ఇంకొకటిఅప్పుడు మనసు నాక్రమించదు. ఇది సమాధి స్థితిదాకా లాక్కుపోగలుగుతుంది. భక్తులెందరో ఇలాటి ధ్యానానుసంధానంవల్లనెహఠాత్తుగ మూర్ఛ లేదా సమాధిస్థితిని చేరటం వింటాం. నామదేవుడెప్పుడూ మనుష్యుల గోష్ఠి నెరుగడట. గోరాకుంభార్ తన కాళ్ల క్రింద తనకొడుకున్నసంగతె ఎరుగక అడుసు త్రొక్కేవాడట. శ్రీరామకృష్ణపరమహంస 'మా' అంటూ సమాధిలోకి వెళ్ళిపోయేవాడట. గౌరాంగుడు సముద్రపు సెలపులంగు చూస్తేచాలు శ్రీకృష్ణుడు గుర్తుకువచ్చి సమాధిలోకి వెళ్ళేవాడట బ్రహ్మం యొక్క యీ (Conception) మూల భావనను అనుసంధానం చేసే వారికి ఈసమాధి స్థితి వెంటవెంటనె కలగటం అవుతుంది. ఎదుట పెట్టు కొన్న పట్టిఫోటోల వల్ల అంతటి స్థితి రాజాలదనిపిస్తుంది.

18. అలా సర్వమూ బ్రహ్మమయమని అనుభూతిచేసే యీతడు ప్రపంచాన్ని యెలాచూస్తాడు! విద్యా వినయ సంపన్నుడయిన బ్రాహ్మణుని ఎక్కువగా గౌరవించి ఛండాలుడిని తక్కువగా గౌరవించానె ప్రవృత్తి ఉండదు. చిన్నగానున్నఆవును పెద్దగానున్న ఏనుగునూ హీన నుని నిరసించబడే కుక్కనూ ఒకేవిధంగా అరాధిస్తాడు. ఆరాధించవ మెందుకంటె బ్రహ్మము కనక, ఇతడి భావ శబలతలోని ఔద్ధత్యం గమనించాలి. గాని అతడి కళ్ళకు పొరలు కమ్మినాయి అని అన్ని ఆకారాలూ ఒకే విధంగా గమనిస్తున్నాడు అనడానికి కాదు.

ఎంతో గహనమైన విషయాలు నీకు చెప్పాను. ఇవన్నీ నీబుద్ధికి అర్థంకావాలని చెప్పాను. మనసుకంటె బుద్ధిగొప్పది కనక అర్థం కావటం బుద్ధికి. అంటే సందేహం లేకుండా తెలియాలి. అలా తెలిసినవి మననం చేయాలి మళ్లీ మళ్లీ, అప్పుడు నీ మనోబుద్ధులు అంతర్ముఖం కావటం అవుతుంది. అప్పటికీ అదిపరోక్షజ్ఞానమే అపరోక్షజ్ఞానం కాదు. ఎందుకనంటె బుద్ధి, మనసులు కూడ శరీరంకు మల్లెజడమైనవె. మానవుడు ఇంకా భిన్నమైన వాడుకదా. అతడు వీటికి సాన్నిహిత్యంగా ఉండినవాడై యీ గహన విషయాలను అనుభూతి చేయాలన్నమాట. కనక బుద్ధి ముందువిష యము నిస్సందేహంగా తెలిసి ఆత్మకు అనుభూతి చేయగలుగుతవే మోనని పిస్తుంది. అందుకు అనుసంధానం, ధ్యానం చేయాలి. అలా అనుసంధానమై, ధ్యానం ద్వారా మనసు బ్రహ్మమునందుతిరంగా నిలిస్తె సర్వత్ర సమదృష్టికలుగుతుంది, అలా సమదృష్టి కలిగినవాడు ఈ సంసార చక్రాన్ని దాటినవాడవుతాడు. సంసారమంటె చావు పుట్టుకల భయం. దానిని దాటినవాడవుతాడు. స్వస్వరూప జ్ఞానం అప్పటికి శరీరపు చావును కాదు దాటేది,తన పతనంను,అలా బ్రహ్మనిష్ఠులై బ్రహ్మాత్మభావులై బ్రహన ష్ఠికులై బ్రహ్మ పరాయణులై సామ్యస్థితిని పొందగలుగుతారు అనే సాధ్మ చెప్పిన తరువాత,తరువాతి శ్లోకంలో రెండో వైపునుంచి నరుక్కు వస్తాడు శ్రీ కృష్ణుడు. బ్రహ్మ భావంసంగతేదో మాకు తెలియదు గాక అనుకొనే వాళ్లకు కూడ — ఒక ఆశ చూపించాలనే ఉద్దేశంతో అంటున్నాడు.

19, ఈ జీవితంలోనే ఇప్పటికిప్పుడే ఇక్కడికిక్కడనే మనసును సమభావంలో ఉంచగలిగితే ఈ సంసార చక్రంనుంచి తప్పుకుపోయినట్లే నంటాడు. పతనంనుంచి విముక్తి పొందినట్లెనట అదె మోక్షమనటం.

మనసును సమభావంలో ఉంచటమంటే ఏమిటో తెలిసికోంటెచాలునట. మోక్షం వస్తుంది. ఈ సమభావానికర్థం అన్నివస్తువులూ అందరుదేహులూ సమమైన వారుగా దర్శించటం.అందుచేత సమదర్శనమంటె సరిగ చెప్పిన

వారమవుతామనిపిస్తుంది. సమభావం కంటికి కనపడదు. చెవికి వినపడదు జ్ఞానేంద్రియాలవల్ల సమభావం పొందటం జరగదు అంతరింద్రియాలైన మనోబుద్ధులద్వారా సమదర్శనం కలగాలె. ఈ మనోబుద్ధులు రెండు రెండుదోవలకు లాగకుండా ఉండాలె, ఇక ఇంద్రియాలైదూ భిన్న భిన్నమైన వాటిని చూపకుండా ఉండాలి. అథవా అవిచూపేవి ఒకేఒక పదార్థముగా గ్రహించగలిగి ఉండాలి. నగనుచూచి బంగారమె నను కొన్నట్లు కెరటాలు చూస్తూ అది నీరేను అనుకొన్నట్లు. కనక అలాభావాలను కూడ సమంచేసి అనుభూతి చేయాలి. దీనికి శ్రీకృష్ణుడు పైన చెప్పిన సాధనలు తప్ప ఇంకేదోవ ఉంది? ఉంటే దానినీ అనుసరింపవచ్చునుగాక.

ఇంతకూ సర్వమూ బ్రహ్మమని అనుభూతి చేయాలి. దాని పేరును బ్ర-హ్మ-ము అనే అక్షరాలుతో చేసినా సరే లేకున్నా సరే.

20. సర్వాన్నీ బ్రహ్మముగా అనుభూతిచేసేవాడు ఎలాఉంటాడు? ప్రియాన్ని పొందటం ఉండదు-అప్పుడు ప్రియమూ అప్రియమే ఉండవు కదా! విషయాలు పొందబడినపుడు సంతోషంగానీ దుఃఖంగాని ప్రత్యేకంగా ఉండదు. బుద్ధి స్థిరమై ఉంటుంది. అలాగన్నామని రాయిలా ఉంటుందనుకో రాదు. అతడు బ్రహ్మ విదుడు గనక బ్రహ్మవిషయం తెలిసి ఎరుకలో ఉంటుంది. బ్రహ్మ నిష్ఠయందే మనసు ఉంటుందనవచ్చు. ఐతే మరి ప్రపంచములో మామూలు ప్రవర్తన కలిగి ఉండడా అని శంక. ఉండదు అనాల్సిందే-కాని-శ్రీకృష్ణుడు లేడా? అనే ఊహతట్టుతుంది. ఉంటాడనాల్సి వస్తుంది ఎలాగు అనేదానికి సమాధానం ఇప్పుడు మనకందదు. అతడిస్థితి తరువాతిశ్లోకంలో కొంత చెప్తారు.

21. ఒకొక్కప్పుడు అతడి స్థితి ఎలా ఉంటుందంటే-బాహ్య విషయాలలో అతడు అసక్తుడై ఉంటాడు. సమస్థితి కలిగిందికదా బాహ్యవిషయాలపై మనసు నడుపదు. అంతర్విషయమైన బ్రహ్మమును చూస్తూ

ఉంటాడు. ఆత్మలోని జ్ఞానాన్ని ఆస్వాదిస్తూ అక్కడ అనంతమైన సుఖాన్ని పొందుతూ ఉంటాడు. అజ్ఞానంవల్ల బయట చూచినా అతడికి బ్రహ్మమే అవుపడి సంతోషాన్నిస్తుంటుంది. సంతోషం అక్షయమవుతుంది. ఆస్థితిలో మనలాగానే అతడు ఉంటాడని ఎలాగు అనుకోవటం. శ్రీకృష్ణుడున్నాడన్నా-అతడి ప్రవర్తనం మనలాగే ఉన్నదనటం సాహసమనుకొంటాను. మనకంటె చాల ఉత్కృష్టస్థితిలో ఉన్నదనేది నిజం,

19 నుంచి 21వరకూ ఉన్నశ్లోకాల్లో జీవన్ముక్తుడి లక్షణాలు ప్రాపంచిక విషయాలనుంచి బ్రహ్మమువరకూ పాకిపోయే పద్ధతిలో చెప్పబడ్డవి. ఓయబ్బో ఇక్కడనుంచి బ్రహ్మమువరకూ వెళ్ళటం చేతనయే పనా? అనిపించవచ్చు. శ్రీకృష్ణుడు మళ్ళీమళ్ళీ సాధన విషయాలను ఎలా మెట్టుమెట్టుగా ఎక్కాలో చెప్తాడు.

21-24; నాయనా విషయ జాతములైన ఈబాహ్యసుఖాలు-ఏమిటవి? అవి దుఃఖాన్ని పుట్టించే చోటులేకదా. వీటికి మొదలు తుది మధ్యమము ఇన్ని ఉన్నాయి. ఎల్లప్పుడు నిలిచి ఉండేవికాదు. ఇలాంటివీటిని, "ఛీ. వద్దని' వదలటం గొప్ప విషయమేమీ కాదు. బుధులు బుద్ధిమంతులూ వీటియందు మనసును రమించనీయరు, నేను చెపుతున్నాను విను. ఈశరీరం పతనమయిపోయే ముందే ఎవడైనా ఈకామక్రోధాల వేగాన్ని సహించ గలిగేటట్లయితే అతడు చక్కగా సుఖిస్తాడు. ఈవిషయం తెలియడానికి పెద్ద కష్టపడనక్కర్లేదు అవునా? అలాంటివాడు ఆనందాన్ని పొంగలడనేది నిజంకదా! ఈ బాహ్యవిషయాలను సుఖదుఃఖాలనూ కామక్రోధాలతో అనుభవించడంకంటె కామక్రోధాలవేగాన్ని తగ్గించి సహించినట్లయితె అనుభవించడంలో ఆనందమే ఉద్భవిల్లుతుంది. అది అనుభూతి చేయాల్సింది.

ఎవడైతె అంతర్ముఖుడై ఆత్మయందే సుఖించుతూ అంతరారాముడై అంతస్సునందే క్రీడిస్తూ, అంతర్జ్యోతియై అంతస్సులోనె ప్రకాశిస్తూఉంటాడో ఆతడు ఆ జ్ఞాని-బ్రహ్మ స్వరూపుడై బ్రహ్మానందమునూ ముక్తినీ పొందుతాడు. సందేహములేదు.

శ్రీ మద్భగవద్గీతామననము (అ - 5)

శ్లో. 25. ఈపైన జెప్పిన విషయం నిస్సందేహంగా అర్థమైతే అలా మోక్షాన్ని పొందగలిగేవారిని అనేకవిధాలుగా చెప్పినా అర్థమవ డానికి అవకాశమున్నది. ఋషులు కల్మషంతేనివాళ్లూ, సంశయాలు లేనివాళ్ళూ, సంయతచిత్తులూ, సర్వభూతాల శ్రేయస్సునూ కావాలనే ఆసక్తికలవారు అయినారు కనుక బ్రహ్మానందాన్ని పొందుతారన్నారు. మోక్షాన్ని పొందుతారన్నమాట. బ్రహ్మవిద్ లక్షణాలన్నీ ఇవేగదా!

26. ఇంకా చెప్పాలంటే, కామక్రోధాలను పూర్తిగా వదలి వేసినవాళ్ళూ, చిత్తాన్ని సంయమము చేసినవాళ్లూ, ఆత్మను ఎరిగిన వాళ్లూ, అయిన యతులకు అన్నివిధాలా ఇప్పటికిప్పటినుంచే మోక్షం కలగటం తథ్యం. అనగా ఇప్పటికే మోక్షపదం చేరేందుకు అడ్డంగా ఉన్న యీ కామక్రోధాలూ, సందేహాలూ, అనాత్మపై విశ్వాసం, ఇవన్నీ వదలిపోవాలనేది ప్రధానవిషయం.

27-28. కాగా మోక్షం ఈ జీవితంలోనే పొందినట్టి పై చెప్పి నవారు ఎలాగుంటారో చెప్తున్నారు. వాళ్లు ప్రపంచంవంక చూడటాన్ని కోరరు. బాహ్యవిషయాలను దూరంచేసేస్తారు. చెవులుంటవి. కాని వినరు వాటితో. అలాగే కండ్లుంటవి. అవి ముక్కుచివరను చూస్తు న్నట్లో, భ్రూమధ్యం చూస్తున్నట్లో ఉంటవి. ఈ యింద్రియాలు, తన్మాత్రలు, అనగా మనసులో ఈ యింద్రియాలకు సంబంధించిన భాగాలు-అన్నీ చేరి ఒక్కటిగా ఉంటవి. మనసూ, బుద్ధీ రెండూ కలసి సంయుతమై ఉంటవి. ప్రాణవాయువునూ, అపానవాయువునూ రానిస్తూ, వెళ్ళనిస్తూఉంటే, తన యేకాగ్రతకు అనుభవానికి భంగం కలుగుతుందని, గాలిని కుంభకంలో నిలిపివేస్తారు. కేవలం మోక్ష స్థితిని అనుభవిస్తూ ఏ ఇచ్ఛా-భయక్రోధాలు లేకుండా ఉంటారు. ఇది ఉత్కృష్టస్థితి. అలాంటివాడు ఎప్పుడూ ముక్తుడే.

అలా కళ్లు మూసుకొనిఉంటే ఏమిటి లాభం? అనచ్చు. "నేను" అనేవాడు సర్వత్రనున్న బ్రహ్మమేననే అనుభూతి కావటమే లాభం. అప్పుడతడు - యజ్ఞ తపసాం భోక్తారం - తానే యజ్ఞానికీ తపస్సునకూ భోక్త అయినట్లూ, యజ్ఞంలో చేయబడే త్యాగం తనకే జరుగుతున్నట్లు అనుభూతి చేస్తాడు. తానే భోక్త. తాను సర్వలోక మహేశ్వరుడు. సృష్టియొక్క వ్యక్తిత్వమైన బ్రహ్మమే తాను కనక, అతడు ప్రభువు. సర్వభూతాలకూ సుహృత్. విడివిడి భావం కలిగిన జీవులందరి హృదయాల్లో నున్నవాడనని అంటుంటాడు. ఇంకెక్కడిదో మోక్షం రావలనే ప్రసక్తి ఉండదు. ఉన్నదల్లా శాంతి-శాంతి. మోక్షం వచ్చేసిందన్నమాట. ఇదే పరమమైనస్థితి. బ్రహ్మమును తెలిస్తే ప్రయోజనమేమిటనే ప్రశ్న లేదు. తెలియడము_అదే అనుభూతిచేయడము_ దానితో సరి. ఇంకనేమీ అక్కరలేదు అప్పుడు. ఈ సంగతి సామాన్యులకు తెలియటం కష్టమే.

అర్జునా! అలా దివ్యుడవైనతరువాత, ఈ సమాజం దాని క్షేమంసంగతీ, యుద్ధం చేయకపోవటమే క్షేమమైనట్టిదనీ ఈ సంగతులన్నీ అల్పమై తెలుస్తవి. ఈప్రపంచంలో జరిగే పనులన్నీ (రొటీన్‌గా) అయిపోయేవిగా కనుపడతవి. సర్వలోక మహేశ్వరుడవయిన నీవు వీళ్ళను చచ్చేవాళ్లగాగాని, చంపేవాళ్లగాగని విచక్షణచేసే పని పెట్టుకొనవుగాక.

ఈ అధ్యాయంవరకూ చెప్పింది మననంచేయాలంటే - వ్యక్తిలోని ఆత్మ, విశ్వస్థాయిని మించిన ప్రభువులోని అంశమే (2 అ). వ్యక్తిచేసే కర్మలన్నీ, ఆ విశ్వస్థాయికి పరమైనట్టి - వాని అనాత్మ ద్వారా జరుగుతున్నట్టివి (3 అ.). కాగా మనసు బుద్ధిలతో వ్యక్తిలోని ఆత్మను అనాత్మనుంచి వేరుచేసి చూడటం జరిగితే అది మంచి సాధన (4 అ ). ఆ తరువాత సర్వత్రనున్న అనాత్మలోకూడ ఆత్మ

కనబడుతునే ఉంటోంది. ఈ ఆత్మ సర్వత్రమున్నదన్న విషయం అవగాహన ఎప్పుడయిందో, బ్రహ్మము అనేదాని లక్షణాలన్నీ ఆత్మ కున్నట్లు అనుభూతి అవుతుంది. అప్పుడెలా ఉంటుందనే విషయం వరకూ ఈ అధ్యాయంలో చెప్పడమయింది.

బుద్ధికి తర్కపూర్వకమయిన విషయం తెలియచెప్పటమయింది. నాల్గవ అధ్యాయంలోని సాధనద్వారా మనసూ, బుద్ధీలను - బుద్ధిని ముఖ్యంగా - సరియైన బాట నడిపించి, విషయగ్రహణం చేయించడ మయింది. కాని, మానవునిలో ఇంకొక "యూనిటు" ఉంది. అది శరీరం. దానిని సాధన చేయించాలి. బుద్ధీ మనసులు ఏకమయి దోవనుపోతున్నా, శరీరం తిరగబడుతూవుంటుంది. మనసును విడ దీసి లాగేస్తుంది. దానినికూడా అదుపులోకి తేవాలి. అందుకే ఆరవ అధ్యాయంలో ఆత్మ సంయమయోగం చెప్పటమయింది భగవానునిచే.

-: ఇది ఐదవ అధ్యాయము :-

శ్రీమద్భగవద్గీతామననము

## ఆరవ అధ్యాయము

(ఆత్మ సంయమయోగము)

### బుద్ధితోపాటు మనశ్శరీరాలనుకూడ ఉద్ధరించడానికే ధ్యానం చేయాలి.

సర్వలోక మహేశ్వరుడుగా మానవుడు తాదాత్మ్యత పొంద మార్గం ఐదవ అధ్యాయంలో చెప్పటమయింది. అయితే అది బు కౌశలంచేత తెలియడం మాత్రమే ఎలాగో చెప్పారు. ఇపుడు మ సుసూ శరీరాన్నికూడ ఎలా బుద్ధితో ఏకంచేసి దోవలోకి తేవచ్చున చెప్పదలచి శ్రీకృష్ణు డంటున్నాడు.

1. మానవుడు ఎవడయితె కర్తవ్యమైన తన కర్మను, ఆ కర్మఫలం ఆశించిన కారణంగాకాక-కేవల కర్తవ్యంఅయిన కారణంగా చేస్తూఉంటాడో అతడినె సన్యాసి అనవచ్చు. అతడినె యోగి అనచ్చు గాక. కాని కర్తవ్యకర్మలయిన అగ్నిక్రియలను మానివేసినమాత్రాన, లేదా యుద్ధం చేయనని కూర్చున్న మాత్రాన, లేదా వర్తకం చేయను గాక అన్నంతమాత్రాన లేదా అలా సమాజసేవ దేనినీ నేను చేయనని అన్నంత మాత్రంచేత సన్యాసి కాడు. యోగికాడు. ఇది గ్రహించక బాహ్యకర్మల నొదలివేయటంవల్ల యోగిగాని, సన్యాసిగాని కాజాలడు. ఇదే ఇక్కడ చెప్పబడె ప్రధాన బోధ. వదలివేయవలసిన కర్మలు యేవో అవే వదలబడవలసినవి. అవి ఏవో వెనకటి అధ్యాయాల్లో చెప్పబడినయి. సంకల్పాత్మకమైన కర్మలూ, నిషిద్దకర్మలూ, కర్తృత్వ భావమూ-ఇవీ వదలివేయవలసినవి.

సన్యాసికిగాని, కర్మయోగికిగాని, సంకల్ప సన్యాసం కావాలి. తర్వాత కర్తృత్వభావం వదలగలిగె మనఃస్థితి కావాలి. ఇవి అవసరం. ఈ సాధన చేసినవాడు సన్యాసే ననబడుతాడు. కనుక నిత్యం చేయ వలసిన కర్మలను వదలివేసినమాత్రాన సన్యాసి నైనాననుకోవటం సరి కాదు. పైన చెప్పిన మనఃస్థితిని పొందినవారు నిరతాగ్నిహోత్రులూ, కర్తవ్యపాలకులూ అయినా - వారు సన్యాసులే అనాలి.

2. అగ్నిహోత్రాలను చేసేవారూ, కర్తవ్యపాలనం చేసే వారూ యోగులెప్పుడవుతారు అనేది విరిచి చెప్తాను విను. అందుకు ఒకానొక ప్రత్యేక మనఃస్థితి ఉండాలి. అది - అసంకల్పాలను సన్యసించిన స్థితి. ఈసంకల్ప సన్యాసం యోగివిషయంలో కూడా తప్పనిసరి అయినదె అసన్న్యస్త సంకల్పుడిని ఎవనినిగాని యోగి అననే అనను. కర్తవ్యం కానట్టిపనిని చేపట్టి ఫలితంకోసం ప్రాకులాడేవాడు సంకల్పాత్మకుడు. అందుచేత అతడిని అసన్న్యస్త సంకల్పుడంటాము. ఇక ఆ సంకల్పాల నన్నిటిని వదలినవాడు సన్న్యస్తసంకల్పుడు. పని చేయవలెననె సంకల్పాన్ని వదలితె "ఇంకా కర్మ చేయి" అనటంలో అర్థమేమిటి అనుకోకూడదు. కర్తవ్యకర్మ చేయ

వచ్చు. చేయాలి. కర్తవ్యకర్మను సంకల్పకర్మనుంచి విడగొట్టి తెలియటం అవసరం. స్వార్థానికయినట్టి సంకల్పంతో ఏ కర్మలూ చేయకపోయినా కర్తవ్యకర్మలు చేయటం తప్పనిసరికదా! ప్రక్కనున్న సామాను తగలబడుతుండె క్షణాన ఇవతలికి లాగి మంటనుంచి తప్పించటం కర్తవ్యకర్మకదా! అది మానేదెలా?

3. కాగా, కర్మయోగి ఒక రౌతు అనుకొంటే కర్మమనేది ఒక గుఱ్ఱంవంటిది. దానిని ఎక్కటానికి అతడు చేసే సాధన కర్మ యోగం. గుఱ్ఱాన్ని ఎక్కే-ముందు గుఱ్ఱపుజూలును పట్టుకొని రికాబులో ఒక పాదం ఉంచి శరీరాన్ని భూమినుండి వేరుచేసి తీసికొనిపోయి గుఱ్ఱపు వీపుమీద వేయాలి. అందుకుగాను రెండవపాదంతో భూమిని తన్ని ఊపుతెచ్చుకొని గుఱ్ఱాన్ని ఎక్కేవరకూ ఈ తన్నివేయడమనే కర్మ చేస్తూఉండాలి. ఈ తన్నివేయటమనేది కర్మఫలత్యాగం వంటిది. అదే ఉన్నతిసందటానికి కర్తవ్యం. గుఱ్ఱాన్ని ఎక్కడం అయిందంటే ఆ కర్మ ఇక చేయనక్కరలేదు. అనగా ఆ భూమిని తన్నివేయవలసిన కర్మ కర్తవ్యం కావటం మానేస్తుందనవచ్చు. అప్పుడు చేయతగినదల్లా వెడల్పాటి ఆ గుఱ్ఱపు నడుముపై కూర్చొని ఉండటంమాత్రమే. కర్మ లేదు. త్యాగంమాత్రం ఉంటుందిగాక మనసులో.

కనక ఆ రురుక్షువుకు-అంటే యోగంలో పై స్థితి నెక్కవలసినవానికి కర్తవ్యకర్మ చేయడం తప్పనిసరి. సాధకుడు కర్తవ్యకర్మను మంచిమనసుతో అంటె-అసక్తతతో చేయాలి అన్నమాట. యోగారూఢుడయిన తరువాత ఎల్లప్పుడూ అసక్తతయే అతని యందుంటుంది. కర్తవ్యకర్మ చేసేసమయంలోనేకాదు. అతని మనసు ఎల్లప్పుడు "శమ"స్థితిలో ఉంటుందికనక కర్తవ్యకర్మ విషయమై చెప్పవలసిన స్థితికాదది. గుఱ్ఱంపై నెక్కి అటూ ఇటూ పడకుండా స్థిరంగా కూర్చొనటమే పని. మనసును దిగజారనీయరాదన్నమాట. అప్పటి కర్తవ్యమంతే. కర్తవ్యకర్మలను చెయ్యాలి. అసక్తతతో చెయ్యాలి

అని చెప్పే సాధన అతడికి అంతవరకేనని అర్థం. అతడి సాధన అతడికే ఉంది.

4. అయితె యోగారూఢుల మయినామా కాలేదా అనే సంగతి తెలియట మేలాగు అనిపిస్తుంది. అందుకయి యోగారూఢుని లక్షణాలు చెప్పుతున్నారు. దానికిగుర్తు ఏమిటంటే ఎప్పుడయితే ఇంద్రియవిషయాల కొరకు ఏకర్మగాని చేయనక్కర లేకపోతుందో అప్పుడు యోగారూఢుని మనస్తత్వం కలిగినట్లు. యోగిసాధన కాలంలో మాత్రమే ఆమనస్తత్వాన్ని సంతరించుతూవుంటాడుగదా. ఆమనస్తత్వం ఎల్లప్పుడూ తనకు ఉంటున్నప్పుడు ఆరూఢుడనవచ్చును. అంటే ఏపరిస్థితులలోగాని ఇంద్రియాలు అతడిని వశంచేసి కోలేని స్థితిఅది అన్నమాట. మరో విధంగా చెప్పాలంటే వ్యక్తిగత స్థాయిని అతడు అధిగమించడ మయిందన్నమాట. ఇంద్రియాతీతుడయినాడని అర్థం. సమాజస్థాయికి లేదా విశ్వస్థాయికి అధిగమించు తున్నాడని అర్థం. కాని 'నా' సమాజం "వారి" సమాజం అనే విచక్షణకూడా పోయివుండాలి. కేవలం కర్తవ్యమె ప్రధానంగా పనులు జరుపుతుండటం అవుతుండచ్చు. అంతేకాదు కర్తవ్యము అనేది అతడికేమిటి? తాను ఉన్నపరిస్థితుల్లో చేయవలసిన కర్మే కర్తవ్యము. తానుఉన్న పరిస్థితి నిశ్చలంగా యోగమనె గుణ్ణం నడుముపై కదలకుండా కూర్చొనడమే అయితే సమాధిస్థితిలో ఉండటమె.(ఈమాటభక్తిషట్కం కూడ పూర్తిగచదివినమీదట అర్థంకావచ్చు) కర్తవ్యము అనవచ్చు.అందుకని యోగారూఢుని లక్షణాలలో మొదటిది "సర్వసంకల్ప సన్యాసత్వము" అని చెప్పారు.బుద్ధిని ఎలాగో ఒప్పించి ఊరుకొనటమేకాదు. మనసుకూడ కర్తవ్యంకాని పనుల వైపునకే చూడకపోవటం యోగారూఢుని లక్షణమవుతుందన్నమాట.

5. మానవుని ఆత్మ,పరమాత్మయొక్క లేదాపరాత్పరునియొక్క అంశ. ఈసంగతి ఐదవ అధ్యాయంలో చెప్పారు. మనసూబుద్ధీలు ఇంకా క్రింది స్థాయిలోవి.వీటి సంపర్కంచేత ఆత్మక్రిందికి లాగబడుతుంటుంది సామాన్యునిలో.అంటె ఈబుద్ధీమనసులతో తాదాత్మ్యతను ఆత్మ పొందు

తున్నట్లు అవుపడుతుందనిధ్వని. కాని యోగారూఢుని స్థితిలో అలా ఆత్మను మనసుబుద్ధీలు క్రిందకిలాగజాలవు. అవి నిరంతర సాధనలో నున్నవై, తామే ఆత్మతో చేరడానికి పైకెక్కి గుట్టం నడుపైనిల్చి ఉంటవని చెప్పవచ్చు. దీనిని తెలిసినట్లయితె-సామాన్యుని సాధనయొక్క పరమార్థం ఎలా ఉంటుందంటే-బుద్ధిచేత మనసు పైకిలాగబడితరువాత, మనసు ఆ బుద్ధిని తిరిగి క్రిందికిలాగడం లేకుండాచూడాలి అనేది ముఖ్యం. "క్రిందకు లాగబడరాదు"="నాత్మా నమవసాదయేత్" అన్నది అందుకే.

6. ఈ మనసూ బుద్ధులే ఆత్మకు-మానవునకన్నమాట-బంధువులూకావచ్చు-శత్రువులూ కావచ్చు. క్రిందికి ఆకర్షిస్తూ, ఇంద్రియముల వైపునకులాగేటప్పుడు శత్రువులు అనాలి-పైకి చూపి పైవైపుకు త్రోయగలిగేటప్పుడు బంధువులు అంటాము. అనాత్మ వైపునకు పోకుండ పురుషోత్తమునివైపుకు పయనించాలనీ అప్పుడె యీ మనసూ ఈ బుద్ధీ ఆత్మకు మిత్రములనీ బోధ.

7. ఇంకా యోగారూఢుడు తన మనసునూ బుద్ధినీ జయించినవాడై ఉంటాడనవచ్చు. ఆత్మస్థాయిలో తనుఉంటూ ఉంటాడనీ ఈ మనోబుద్ధులు అతడిని కదిలింపజాలవని అర్థం. ఈ శీతము, ఉష్ణము, మానము, అవమానము ఇవన్ని క్రిందిస్థాయిలో ఉంటవి. తాను వీటిని మించిన స్థాయిలో ఉన్నట్లు అనుభూతి చేస్తూఉంటాడు. వెచ్చనిగాలిలో దానివిషయమే పట్టించుకోకుండా మనం ఎలాపనిచేసికొనిపోతూ ఉంటామో అలాగె అతడు కణకణలాడే నిప్పుల్నికూడ లెక్కచేయడు. దూరాన మొఱిగేకుక్కను మనమెలా లెక్కచేయమో ఆలాగే అతడు ఎదుటబడి తనను దూషించి అవమానపరచే వానినికూడ లెక్కచేయడు. సమాహితచిత్తుడై ఉంటాడు. ఎందువల్లనంటె-ఈ శీతం ఈ ఉష్ణం ఈ సన్మానం ఈ అవమానం అన్నీభగవంతుని స్వరూపాలుగా పలకరింపులుగా అనుభూతిఅవుతూ ఉంటుంది. అవన్నీ అనాత్మయైన శరీరానివిగనుక ఆత్మయైన తనకు చాల అనవసరమై ఉంటవని అర్థం.

8. **ఆత్మ తనస్థాయి.** అనాత్మక్రిందిస్థాయి. **ఇది** జ్ఞానం. బుద్ధివల్లనె తెలిసికొనబడగలిగినట్టిది. ఇక **తాను** బ్రహ్మమనీ సర్వత్ర నుండే **ఆత్మ**ననీ-అలాగే తాను బ్రహ్మమెట్లాగో యీ అనాత్మకూడ బ్రహ్మమే నని అనుభూతి చేయగలగటం విజ్ఞానం. కేవలం బుద్ధితో కార్యకారణ సంబంధరీత్యా తెలియతగిందికాదిది. తెలిసినవిషయంపై ధ్యానంచేస్తుంటే ఎప్పుడో అధివిద్యుడైన పురుషోత్తముడి అనుగ్రహంతో అనుభూతి అయేదది. పైచెప్పిన జ్ఞానాన్నీ యీ విజ్ఞానాన్నీ కలిగిన వాడు తృప్తిని పొందినవాడై నిర్వికారుడై విజితేంద్రియుడై ఉంటాడు. క్రిందిస్థాయిలో భిన్నభిన్నాలుగా అవుపడేలోహం, రాయి మట్టిపెళ్ల ఆ స్థితిలో బ్రహ్మముగానే అవుపడుతూ అనుభూతిని స్తవి అతడికి.

9. ఎదుట కన్పడే మనుష్యుల్లో అనేకరకాలు ఉంటారుగాక. సుహృత్తులు, మధ్యస్థులు-ఇతరులు-ద్వేషించేవారు,బంధువులు. సాధులు పాపులు ఇలా. కాని యోగారూఢుడు వీళ్లని యీ విధంగా విడదీసిచూడనే చూడడు. అంతా బ్రహ్మమేనని తిలకిస్తూ ఉంటాడు. ఇవీ యోగరూఢుని లక్షణాలు. ఈ లక్షణాలు మనసూ బుద్ధీలను ఒకానొక ఉత్కృష్ట స్థితికిచేర్చి ప్రపంచంలో కర్తవ్యాలనుచేసికొంటూ ఉండటంవల్లకలుగుతవి. వాటిని సంతరించేపద్ధతి అలాగే, ఈ లక్షణాలు కలిగినందువల్ల అతడికి ఈ ప్రపంచవిషయాలలో కలిగే ప్రతిచర్యలో మార్పువచ్చిందనేది గమనీయం. అంతేగాని మనిషి ఆకారంలోగాని శరీరంలోగాని ఒకవిశిష్టమైనభేదం వస్తుందనేదికాదు చెప్పటం. ఉత్కృష్ట మన స్థితిని యోగారూఢుని మనస్థితిచిగూర్చి మాత్రమె ఇక్కడ చెప్పట మయింది.

అయితె మరి శరీరం సంగతేమిటి? శరీరాన్నికూడా సాధన ద్వారా ఉత్కృష్టస్థితికి తీసికొని పోవాల్సి ఉంటుంది. ఆ సాధనకూడ శ్రీకృష్ణులు చెప్తున్నారు. పైచెప్పిన మనస్థితిని సాధనచేస్తూనె ఈ శారీరిక సాధనకూడచేయాలి. అంటే అర్థం మనస్థితిని పైన చెప్పినట్లు సంతరించే ఉద్దేశం లేకుండానే శరీరాన్ని సాధన చేయిస్తాను అని అను

కొన్నందువల్ల ప్రయోజనముండదు అని, అనగా ఆధ్యాత్మిక ప్రయోజనముండదని బోధ. అందుచేత ముందు శ్లోకాల్లో మనస్థితి సంతరించటంతోపాటె శరీరసాధనకూడ కలిపి చెప్పబోతున్నారు

ఓయబ్బో మనసును మనమెక్కడ నిలుపగలుగుతాముగాక ఇంకా పెద్దవాళ్లయినాక చూసుకొందాం అనేవాళ్లకు ప్రయోజనం కలగదు. అలాగే-"మనసు గదా నిలుపవలసింది-అప్పుడప్పుడూ జ్ఞాపకం వచ్చినప్పుడల్లా యీ ప్రయత్నం చేస్తూనే ఉంటానుగాక. ఈ శారీరిక సాధనకోసంరోజూ ఉదయం సాయంత్రం గంట సమయం ఎక్కడ వినియోగిస్తాము? అనేవారికీ పైప్రయోజనం అందదు. అందుకనె ఈ శరీరసాధన విషయంకలిగిన యీ అధ్యాయాన్ని ధ్యానయోగం అని అనటం-వట్టి బుద్ధియోగం అనకుండా.

10. యతచిత్తాత్ముడు ఏకాకిగా సాధన చేయాలి. ఇది శారీరకమైన సాధనకోసం అవసరం. మనసును నియమించటం పదిమందిలో ఉన్నా ప్రయత్నం చేయవచ్చునుగాక. శారీరక సాధనం కోసం ఏకాకిగాకూడ ప్రయత్నం చేయాలి. ఇంకా "నిరాశీరపరిగ్రహః"—ఆశ అనేది ఆ సమయాన మనసులోనుంచి త్రోసివేయాలి. ఎవరేమిచ్చినా గ్రహించకూడదు. అలా తీసికొంటూ కూర్చొని జపం చేస్తుంటే అది చివరకు కొంగజపం అయే అవకాశ ముంటుందికదా! అంతఃకరణాన్ని సమాహితం చేయాలి. వచ్చేలాభాలు లాభాలుగా పరిగణించి అందుకోరాదన్నమాట. అంటే లాభం, నష్టం రెండూ సమముగా గ్రహించటం మనసుకు అలవాటుగా సంతరించుకోవాలి.లాభం ఒకలాభంగా(benifit) పరిగణింపరాదు అనేది కీలకం. ఆత్మను బ్రహ్మమని తెలియాలి. శరీరసాధనలో యీ పైది పరాకాష్ట అనవచ్చు. ఎందుకంటె మనసూ, బుద్ధీకూడా శరీరంవంటి జడాలేకదా, అధిష్ఠానంలో భాగాలేకదా అది సంతరించటానికె ఈ శరీరసాధనం కూడాను అనేది తెలిసికోనాలి.

11. ఇంకా - శుచిఅయిన ప్రదేశంలో స్థిరమైన ఆసనం వేయాలి. మరీ ఎత్తుగాగాని, మరీ క్రిందుగాగాని ఉండరాదు ఆ ఆసనం. కదలకుండా ఉండాలి. దానిమీద దర్భాసనం వేయాలి. ఆపైన జింకతోలు వెయ్యాలి. దానిపై మెత్తని వస్త్రం వెయ్యాలి. అప్పుడు కూర్చొనటానికి ఎంతో సుఖంగా ఉంటుంది ఎలా సుఖంగా కూర్చోకలిగితె అలాగే యేర్పాటు చేసికొని కూర్చొనవచ్చు. జింక తోలు సంపాందించలేదుగనక అభ్యాసం వాయిదావేయమని కాదు.

12. ఆ ఆసనంమీద కూర్చొని, చిత్తాన్ని ఇంద్రియాల్ని నియమించినవాడై మనసు ఏకముఖంచేయటం అభ్యాసం చేయాలి. ఇక చెప్పబోయే 'నిట్టనిలువుగా కూర్చోటం' మొదలయిన శరీరసాధనకు ప్రాతిపదికగా మనసును ఏకముఖం చేయాలి అనే 'ఆశయం' ముందు పెట్టుకోవాలి బుద్ధిలో. ఏకముఖమంటే ఏమని? యోగం అభ్యాసం చేయటమన్న మాట. ఆ సంగతివెనక చెప్పారు. ఆత్మ అన్ని వస్తువుల్లో వెలసిఉన్నదని అనుభూతిచేయటం. దేనిని తలచినా ఆత్మప్రత్యక్షం అవుతుంటే నిజానికి ఆస్థితి పైస్థితి. అది కలిగేదాకా అలా ఏకముఖమైన మనసుకోసం సాధన చేస్తూ కూర్చోవాలి. అలా కొంత కాలమయింతరువాత, అంతటా ఆత్మే అనేది అనుసంధానమయితే అంతటా బ్రహ్మమే ఉన్నాడు అనే అనుభూతేకాకుండా అంతటా జరిగే క్రియలు-పనులు అన్నీ బ్రహ్మమే చేస్తున్నాడు, నేనుచేసే యీ ధ్యానమూ ఆ బ్రహ్మమే చేస్తున్నాడు అనే విజ్ఞానం కలుగుతుంది. అప్పటికి యీ శరీరం మనసూ, బుద్ధీ ఏకముఖమై శుద్ధి అవుతవి. ఇంకా శారీరకంగా ఏంచేయాలంటె—

13-14 కాయం, శిరస్సు, మెడ నిట్టనిలువుగ స్థిరంగా నిలపాలి. దృష్టిని లోకంమీదకు వెళ్లనీయకుండా తన ముక్కుచివర చూస్తున్నట్లుగా ఉంచాలి. కాని, మనసును ముక్కుపై నుంచమని అర్థముకాదు మనసుకు ఆత్మానాత్మ విచారణము, ఆత్మే సర్వత్ర ఉంటూంరటము,ఆదే బ్రహమై ఈ ప్రపంచాన్ని నడుపుతుందటమూ ఇవి

ధ్యానంచేస్తూ, అభ్యాసంచేస్తూఉండే పని ఉండనేఉన్నది. అది అను భూతి అయినప్పుడు శాంతి కలిగితె దానిని అనుభవిస్తూ ఉండాలి. ఏ భయమూ మనసులో ఉండరాదు భయమెందుకుంటుంది అనుకోవద్దు. బాహ్యకారణా లుండవచ్చు దానికి. ఆఫీసుకు వేళ్ళే సమయం అయి పోతోందేమోనని-మొదలైనవి. అంతరంగికంగా కూడ ఉండవచ్చు - ఉన్నతికి చేసే యీ ప్రయత్నాలు ఎలా ఫలిస్తాయోనని. దీనికి ఫలితం వస్తుందని తెలిసే ఈ ప్రయత్నం చేస్తున్నా - ప్రయత్నం చేయటం ఆరంభించింతరువాత ఇది కర్తవ్య కర్మగా చేయాలిగాని, ఏదో కామ కర్మగా అనుకొని ఫలితంమీద బుద్ధి ఉంచరాదన్నమాట కర్తవ్య కర్మ అన్నప్పుడు చేయటమే కర్జము - దాని ఫలితం ఏమొచ్చినాసరే- అనే తత్త్వం జీర్ణం కావాలన్నమాట మనసులో. అప్పుడే అంతరంగిక మైన అలాంటి భయం ఉండకుండా పోయేది.

ఇంకా - బ్రహ్మచారివ్రతం సలపాలిట. అంటే ఇంద్రియాల నన్నిటినీ నియమితమైనంతవరకే మసలనీయటం. ఇది శారీరకమైన బ్రహ్మచర్యం. ఎంతవరకు అవసరమో అంతవరకే నాలుకతో మాట్లా డడం. ఏ సంగతులు అవసరమో అవే వినడం. ఇలా ఏవి అవస రమో అవి. అంటె-ఎలాగ తెలియటం? అన్నీ అవసరంకావా? అనిపి స్తుంది. కర్తవ్యకర్మను చేయడానికి ఏవేవి అవసరమో అవిమాత్ర మేనని అనచ్చు ఒకవిధంగా. అన్ని జ్ఞానేంద్రియాల విషయం ఇలా చెప్పుకోవచ్చు. ఇక అంతరింద్రియాలసంగతి:- మనసు-ఇది ఎల్ల ప్పుడూ బ్రహ్మపదార్థతత్త్వమునందే చరించుతూ ఉన్నట్లయితే అది బ్రహ్మచర్యమవవలె. అలా మనసు ఎల్లప్పుడూ ప్రవర్తిస్తుంటే ఇంద్రి యాలుకూడ దానిని దాటివెళ్ళే అవకాశం తక్కువ అవుతుంది. అందుకే శారీరక బ్రహ్మచర్యం చేయమని చెప్పటమేగాక, "మచ్చిత్తోయుక్త ఆసీతమత్పరః" అనికూడ చెప్పటం అయింది. మచ్చిత్తః, మత్పరః అంటే "నేను"లో లగ్నమయియుండటం అనచ్చు. లేదా భగవంతుడే "నేను" అంటున్నాడుకనక అతనిలో లగ్నంకావటం అనచ్చు. ఆత్మ- విదిగా అనుభూతి అవుతున్నప్పుడు, అది సర్వత్ర ఉంటూఉండేది

అంటున్నప్పుడు అదే బ్రహ్మము. దానికి ప్రత్యేక ప్రతిపత్తి ఉన్న దని తెలిసిన విజ్ఞానస్థితిలో అదే భగవంతుడు. ఇలా ఆ పరమాత్మను తెలిసికొనటం-అదే ధ్యానం. ఇలా మనసుతో ధ్యానం చేస్తున్నప్పుడే బ్రహ్మచర్యమనే నియమం దానంతటది లభ్యమవుతుంది. కేవలం శారీరక బ్రహ్మచర్యం చేసినవాళ్ళందరకూ అలాటి మనసు రాకపో వచ్చుగాని, అలాటి మనసు ఉన్నంతవరకూ బ్రహ్మచర్యం ఉండితీరు తుంది. అత్యావసరమైన దేదో గుర్తించడానికి ఈ బోధ తెలియాల్సి ఉంటుందనిపిస్తుంది.

అలా యోగి యెల్లప్పుడూ మనస్సును బ్రహ్మముతో కలిపివుంచే - నియ తమానసుడై మనసును సమాధానపరచిఉంచితే శాంతిని పొందుతాడు. ఇక్కడ మనసుకు చెప్పిన యీ కసరత్తు బుద్ధికి లెమ్మనుకోవద్దు. ఎల్ల ప్పుడూ ఇంద్రియాలద్వారా పనిచేస్తుండేది మనసే. అది బ్రహ్మముతో -యుంజన్-అంటే కలిసిఉండాలి. బుద్ధి తర్క-వితర్కాలు చేసి విషయం తెరిసి ఒప్పుకోవటంవరకె. అది 5వ అధ్యాయంవరకూ అయింది. ఇక్కడ మనసూ శరీరంకూడ గాడికో పడాలని బోధ. ఎల్లప్పుడూ ఏ పని చేస్తున్నా మనసు బ్రహ్మమందు లగ్నమయియుం డటం బుద్ధితో కేవలం ఎరుకకలిగి యుండటంకన్న గొప్ప సాధన. ఈ మనసునకయినా సాధన నిలవడానికే శారీరక సాధనకూడ కలపాలి. లేకపోతే శరీరం మనసుకు వ్యతిరేకంగా తిరగబడటం కద్దు.

ఇంతకూ ఈసాధకుడు "నా" యధీనమయిన పరమశాంతిని పొంద గలడు అన్నాడు భగవాన్ కృష్ణుడు. ఇక్కడ 'నా' అనటంలో శ్రీకృష్ణుడు, తనలోని 'నేను'ను బ్రహ్మముగ ఎరిగినవా డవడంచేత పురుషోత్తముడుగా, ప్రభువుగా, విభుడుగా అనుభూతిచేస్తూ 'నా' అధీన మన్నాడా? అనిపిస్తుంటుంది. భగవంతుడు అనే నమ్మిక కలిగే వరకూ, నిర్వాణముఅనేది, ఈ 'నేను, అనే దాని అధీనము అని అర్థం చేసికొన్నా తప్పులేదు. (అహంకారం నశించి యుండటంకూడ అవ సరం అవుగాక).

16. శరీరసాధన అనంగానే తిండి గుర్తుకొస్తుంది. ఏం తినాలి. ఎలాతినాలి. ఎప్పుడు తినాలి అని. ఎలాంటి జాగ్రతలు తీసి కొనాలో ఈ శ్లోకంలో చెప్తున్నారు. అతిగా తినరాదు. మరీ తక్కువ తినరాదు. అతిగా నిద్రపోరాదు. అసలు నిద్రేపోను అని కూర్చొన రాదు. అన్నింటిలో సంయమనం అవసరం. (ఇదే బ్రహ్మచర్యానికి మరో పేరుకదా).

17. యుక్తమైన ఆహారం, నిద్ర, పని కర్మ విశ్రాంతి ఇలా అభ్యాసంచేసే యోగికి అది సంసారదుఃఖనాశనం చేసే ధ్యానమే అవుతుంది. "యుక్త" అంటె "సరైన" అని ఒక అర్థం. ఏది సరైనది? సరిపడే ఆహారం సరియైనదనుకొంటే అనుకోవచ్చు. ఎవరైతే మాత్రం తనకు సరిపడని ఆహారం తింటారా? సరిపడని పని చేస్తారా? అయితే మరి ఈ యుక్త అనటంలో ప్రత్యేకార్థమేమీ లేదా అనే ఆలోచనచేస్తే-సర్వమూ బ్రహ్మమే అనే అనుభూతివైపునకు తీసికొనిపోయే-ఈ బోధయొక్క సారాంశం, యీ 'యుక్త' అనే పదంలో పెట్టినారనిపిస్తుంది. ఆహార విహారాలతో పాటు భగవంతుని కలపవలసిందని బోధ. వైద్యుడు చెప్పిన ఆహారవిహారాలు శరీరాన్ని కొంత కాలం కాపాడుతవిగాక. శాశ్వతసుఖంకోసంచేసే యీ ధ్యానయోగంలో అదేం చాలుతుంది? మనసూ, బుద్ధీకూడ బ్రహ్మముతో ఐక్యమై అనగా యీ ఆహారం బ్రహ్మ - ఈ తినటం బ్రహ్మ - నాలో ఇది పచనం కావటంకూడ బ్రహ్మమేఅనే స్థితిని అనుభూతి చేయవలసిందని అర్థం. అదే యుక్తాహారమవుతుంది. అలా నిరంతరంచేయబడే ధ్యానమే దుఃఖహారమైన యోగమవుతుంది. తినబోయేముందు ద్విజులు ఆపోశనమని పట్టుతుంటారు. దాని అర్థం అదే.

18. యుక్తుడు ఎప్పుడూ అన్నిపనుల్లోనూ బ్రహ్మాన్ని జతపరచి అనుభూతి చేయాలని చెప్పినారుగదా! వ్యక్తి ఎప్పుడు 'యుక్తుడు' అని పిలువబడగలడనేది శ్రీకృష్ణభగవానుడు స్పష్టంగా చెప్తున్నాడీ శ్లోకంలో. ఎవడు చిత్తాన్ని నియమించి ఆత్మయందే నిలిపి సర్వ

కామ సంకల్పాలనుంచీ నిస్పృహుడై ఉంటాడో అతడు యుక్తుడుసుమా అన్నారు. మనసు ఎల్లప్పుడూ బ్రహ్మమందే లగ్నమై ఉంటుంది. ఆహారం విహారం సహా అన్నిసందర్భాల్లోనూ బ్రహ్మమే సాక్షాత్కరిస్తూ ఉంటుంది. అప్పుడు విషయాలలో ఆసక్తి ఉండదు. అలా ఆసక్తి ఉండకపోవటమే గుర్తు యుక్తుడైనాడా లేదా అనే సంగతి తెలియడానికి. అతడు అప్పుడే బ్రహ్మముతో యుక్తుడై ఉన్నాడన్న మాట. ఈ స్థితికి రావడం పరాకాష్ఠ.

19. ఆ స్థితియొక్క ధర్మాలు-అంటే-లక్షణాలు నాల్గుశ్లోకాల్లో చెప్తున్నారు. ఆ లక్షణాలను సంతరించాలి అనే ఆశయం బుద్ధిలో పెట్టుకొని, వాటిని 'ధర్మాలు'గా, అంటే 'కర్తవ్యాలు'గా చేయటం మనసు, బుద్ధుల పని. అదే మానవునకు సాధన. అవి సాధించిన మీదట అవి అతడి స్థితియొక్క లక్షణాలు అనబడుతవన్నమాట. ఈ లక్షణాలతో తనకుగల సాధనాస్థితి ఎలా సరితూగుతోంది అనేది ధ్యాన యోగికి తెలియడానికి ఇవి చెప్పబడినయి.

ఆ యోగియొక్క మనసు గాలిలేనిచోట దీపము ఎలా కదల కుండా, చైతన్యపూర్ణంగా, ప్రకాశమానంగా ఉంటుందో అలా బ్రహ్మము వైపునకు తిరిగిఉంటూ ఉంటుందిట.

20. చిత్తం ఉపరమించి నిలిచిఉంటుంది. యోగము ఆచరించియున్న కారణంవల్లనే ఆ ఉపరతినందటాన్ని అతడు సంతరించినాడన్నమాట. ఇంకా-మనసు శుద్ధమయి ఉంటుంది. దానివల్లనే ఆత్మను చూస్తూ ఉండగలుగుతుంది. ఇక్కడ మనసూ ఆత్మ అనే పదంతోనే సూచిస్తూ అది ఆత్మనే చూస్తూఉంటుందనీ, ఆత్మయందే అలా సంతుష్టినందుతూ ఉంటుందనీ అంటున్నారు శ్రీకృష్ణులు. ఈ మాటలకు అర్థం ఎన్నిమాటల్లో చెప్పుకొన్నా ప్రయోజనం కొద్దిపాటిది, అది అభ్యాసం చేసి, అనుభూతి చేసినవారికే తెలియగలిగినట్టిది అనిపిస్తుంది. నిజానికి శరీరం ఆరోగ్యంగా ఉంటుందికనక మనసు క్రిందికి లాగబడదు. మనసు నియమితమైంది కనక బయటి ప్రేరణ

వైపునకు అది వెళ్ళదు. బ్రహ్మమునందే ఉంటుంది. విశేషమేమిటంటె, లోక వ్యవహారం చేసేటప్పుడుకూడ మనసు బ్రహ్మమునందే ఉంటుంది. మనిసి సిగరెటు కాలుస్తూఉన్నా తన ఆలోచనలను ఎక్కడో పెట్టుకొంటూ ఉన్నట్లే - కాముకుడు జనసమ్మర్దములో నడిచి వెళుతున్నా మనసు భార్యపైనున్నట్లే అనవచ్చు. అందులో ఇంకా విశేషమేమంటే, ఏ పనిచేస్తున్నా మనసు బ్రహ్మములో లగ్నం అవజేయటానికి ఎక్కువ అవకాశం ఉంది. ఆలోచన బ్రహ్మమునుగూర్చి కనక, బ్రహ్మమును ఆ పనితో లంకెవేసి మరీ నిలుపవచ్చుకదా మనసును - అనిపిస్తుంది. ఆ స్థితికి రావాలని అర్థం.

21. ఇందువల్ల ఆత్యంతికమైన సుఖం కలిగివుంటుంది. బ్రహ్మమే ఆనందంకనక చేసే ప్రతి పనిలోనూ బ్రహ్మాన్నే అనుభూతి చేసేవాడికి ఆత్యంతికమైన సుఖంగాక ఏమవుతుంది? మామూలుగా కలిగే యింద్రియసుఖం కాదన్నమాట. లడ్డుతీపి ఒక్కటేకాదు. బ్రహ్మమే నాకు ఈ తీపిగా అయింది అనే అనుభూతివల్ల వచ్చే సుఖం గొప్పదన్నమాట. ప్రియురాలు ఇచ్చే కాఫీకి, పగవారు ఇచ్చే కాఫీకి తేడా ఉన్నట్లు. ఒకటి ఇంద్రియాతీతమైన సుఖం కాగా, రెండవది కేవలం ఇంద్రియసుఖం మాత్రమే అవుతుంది. అందుకు అది ఆత్యంత సుఖమైనదనటం. ఇది మనసుకు, బుద్ధికి తెలియాలి బాగా. అలా తెలిసి నప్పుడే కార్యకారణ సంబంధాల స్నాయువుల బిగింపులో ఇతఃపూర్వం నలిగిపోతుండే వ్యక్తి-మానవుడు-(నేను)-బుద్ధిచేత రెండోవైపునకు లాగ బడటం జరగదు. అందుకనే అప్పుడు స్థిరత్వం వస్తుంది అని చెప్తునారు శ్రీకృష్ణులు. చలించని అనుసంధానం కలుగుతుంది. ఈ స్థితిని పొందాలన్నమాట.

22. ఇలా ఉన్నప్పుడు ఎంతటి దుఃఖసందర్భాలు కలిగినా అతడు తల్లడిల్లిపోవటం ఉండదు. ఏ స్థితి లభ్యంకావటంవల్ల కలిగే లాభం అన్నిలాభాలకంటే ఎక్కువైందో అది లభించిందని అర్థం. ఎన్ని లాభాలను కోరుకొంటున్నా అవన్నీ సుఖాన్ని కలిగించడానికే

గవా. ఆత్యంతికమైన సుఖం కలిగినతరువాత ఇంకా ఇతర లాభాల కోసం దేవులాడటం ఉండదు. దుఃఖాలు వచ్చి అతడిని విచలితుడిని చేయవు. ఇది గొప్ప స్థితి.

23. ఈ దుఃఖం కలుగుతుండే ప్రపంచలక్షణం వ్యక్తినుంచి వదిలించివేయకలిగే యీ "యోగ"మనేదాన్ని తెలిసి సాధకుడు విసుగు లేని చిత్తంతో, పట్టుదలతో అభ్యసించాలి. ఈ వేదాంతవిషయం మన కిప్పుడెక్కడ పాటించడమవుతుందీ అంటూ. రిటైరుమెంటు సమయానికి త్రోసివేయకూడదనే సంగతి ఈ శ్లోకంలో గర్భితమైఉంది. విషయం బుద్ధితో తెలుసుకోవాలి. అది ప్రతివారు చేయతగిన పని. ముందు బుద్ధికి తెలిస్తె ఆతరువాత ఆచరణలో పెట్టవచ్చు. ఆ ఆచరణఎలాపెట్టాలో ఈ అధ్యాయంలోనే చెప్తున్నారు. ముందు యోగం సంగతే తెలియకపోతే ఆచరణలో పెట్టేప్రశక్తి రాదు. ఆచరణ చేయవలసింది శరీరం, మనసున్నూ బుద్ధికి ముందు తెలిసిఉండాలి. కనుకనే ఐదవ అధ్యాయంవరకు చెప్పిన విషయాలన్నీ బుద్ధికి అవగతం కావల్సినవి. అవి తెలిసినందు మూలాన కలిగే ఫలితం సాధన చేయాలి అనిపించటమే. బ్యాంకులో ఇన్ని లక్షలరూపాయల మూలధనం ఉన్నది తెలియుట మేలాంటిదో ఇదీ అంతె. తెలిసినదానిని వినియోగించుకొనటమే ఆచరించటం. అదేలాగో ఈ అధ్యాయంలో ముందుశ్లోకాల్లో చెప్పబోతున్నారు. దానివల్లనే బుద్ధితోపాటు మనసూ శరీరంకూడ జ్ఞానపూర్ణమైన ఆత్మను దర్శించి మానవుడ్ని దుఃఖంనుంచి కాపాడటం జరుగుతుందని బోధ.

కనుకనే ఐదవ అధ్యాయంవరకు చెప్పింది గహనమైన గుహ్యమైన విషయమనీ, ఆరవ అధ్యాయంలో చెప్పిన శరీర మనోసాధనలు- గుహ్యతరమైనవనీ, ఆతరువాత అధ్యాయంల్లో చెప్పే భగవత్సంబంధమైన సాధన గుహ్యతమమైనదనీ అంటారు విజ్ఞులు. ఇక సాధన యథాతథంగా చెప్పబోతున్నారు.

మూడవ అధ్యాయంలో కర్మ చేస్తూనే ఉండాలీ అన్నారు. ఇక్కడ శరీరం, మనసూ, బుద్ధీలు కలిసినవై కర్మ చేస్తుండాలి అని సూచించారు. ఏకర్మ చెయ్యాలి? కర్తవ్యకర్మ. ఏది కర్తవ్యం? దుఃఖాన్ని హరింపజేసి (మోక్షాన్ని) ఆత్యంతికమైన సుఖాన్ని పొందటం కర్తవ్యం. దానికి మార్గం యీ యోగం. ఈ యోగం తెలియుట మనేది-పై అధ్యాయాలలో చెప్పినదన్న మాట. అది అర్థమైనవారికి దానిని చేయటమే కర్తవ్యమవుతుంది మిగతావారి మాటేమిటని అడగ నక్కర్లేదు. వారు కర్తవ్యమనుకొని నమ్మి చేస్తుంటే అది మరీమంచిది. ఆ నమ్మిక లేకపోవటంఅనేది అడ్డువచ్చినందువల్లనేకదా మొదటి ఐదధ్యాయాల్లో జ్ఞానం కలిపి కర్మచేయటం సంగతి బుద్ధికి అవగతంకావడానికి గాను ఇంతగా చెప్పింది !!

-: ఇక సాధన :-

24. ఎలాంటి ఆసనంమీద కూర్చోవాలో వెనక చెప్పారు. ఇప్పుడిక ముందు చేయవలసిన పని చెప్తున్నారు. ముందుగా మన సునూ, ఇంద్రియాలనూ నియమించాలి. దేనిచేత? బుద్ధిచేత. ఇంద్రియాలు కోరికలను కోరుతూ ఉంటవి నాలుక ఊరుతూఉంటుంది. కండ్లు అందమైనవాటిని చూస్తామంటూ ఉంటవి. మనసు (ఇదీ ఇంద్రియమే. అంతరింద్రియము) సంకల్పాలు చేస్తూవుంటుంది. లాటరీలో నెగ్గాలనీ, ఇలా అనుకొంటూ ఉండటమే పని మనసులకు. ఇవన్నీ సంకల్పప్రభవమైన కామాలు. అనగా, కర్తవ్యంకనక చేయాలనే నియమం లేదన్నమాట. కర్తవ్యం మోక్షాన్ని సంపాదించటమేననేది పై అధ్యాయాలు మననం చేసినవారికి కలిగివుంటుంది. - వ్యావహారిక కర్తవ్యంకూడ కర్తవ్యమే సాధకుడికి సందేహం లేదు.- కనక సంకల్ప ప్రభవమైన కామాలను ముందుగా పోగొట్టాలి. దానికి ప్రయత్నం చేయాలి. దృశ్యం ఎదురుగా ఉంటే చూడాలనిపిస్తుంది అందుకని కళ్లు మూసుకోనటం మంచిది. లడ్డూ తిను బండారాలు కనపడితే తిన బుద్ధిఅవుతుందేమోనని కళ్లుమూసుకోమన్నారు. కళ్ళుమూసుకొంటె నిద్ర వస్తుందేమోనని ముక్కుచివర చూస్తున్నట్లుగా ఉండమన్నారు. ఇలా

బాహ్యేంద్రియాలను కొంతవరకు జయించవచ్చు. కాని అది చాలదు. బాహ్యేంద్రియాలను జయించడానికికూడ మనసు పరువెత్తకుండా ఉండటం అవసరం. దానికి సాధనం అభ్యాసమేతప్ప మరొకటి లేదు. ఏమని అభ్యాసం చేయవలెనంటే—ఒకేఒక ఆలోచనను పెట్టుకొని అనుసంధానం చేయాలి. కళ్లుమూసుకొన్నా, రూపాలు కనబడతయి మనసుకు వెంటనే ఇంద్రియాలు ప్రేరేపింపబడుతయి. అందుకని మనసుకు వివిధ రూపాలు అవుపడకుండా ఒకేఒక ఆలోచనచెప్పి దాని పైనే మనసు లగ్నంచేయటం అనేది అభ్యాసం చేయాలి.

25. అందుకని, బుద్ధిఅనేదాని ధైర్యపు పట్టుదలను ఉపకరణంగా చేసి, మనసును ఆత్మయందే అనుసంధానం చేయవలసింది. ఒకే ఆలోచన పెట్టుకొన్నాం. ఏదో ఒక శివలింగంఆకారం మనసులో పెట్టుకొని అది భగవంతుడనుకోటం, లేదా "నేను"అనేది నా హృదయ కుహరంలో ఉన్నదని, దానిమీదనే ధ్యాసఉంచటం ఇలా ఒకేఒక ఆలోచనను మళ్ళీమళ్ళీ అనుసంధానం చేయాలి. ఒక ఆలోచనకీ మళ్ళీ అదే ఆలోచించేదానికి మధ్యలో మనసు ఎక్కడికో వెళ్ళిపోవటం కద్దు. అలా వెళ్లిపోయింది అని బుద్ధికి తెలుస్తుంది ఎప్పుడో. అప్పుడు మళ్లీ మనసును తెచ్చి ఆ ఆలోచనలో పెట్టాలి. ఇలా అభ్యాసం చేయాలి. బుద్ధి, ధైర్యంగా ఈ పని చేయించుతుండాలి మనసుచేత, నెమ్మదినెమ్మదిగా బుద్ధి ఇలా మనసుచేత ఆత్మయందు ఉపరతి నందేటట్లు చేయించాలి. ఇంతే. ఇంతకంటే ఎక్కువపను లేవీ లేవు చేయాల్సినవి. ఇది సంపూర్తిగా చేస్తే చాలు. "నకించిదపిచింతయేత్"అన్నారు.

ఏవో ఉపాధులూ, రూపాలూ మనసుకు కనపడటం సహజం. శివలింగం మనసులోకి వచ్చినాకూడ అది అర్ధనారీశ్వర శివలింగమా లేదా కోలగా ఉన్నదా, గుండ్రంగా ఉన్నదా ముక్కూచెవులూ ఉండరాదా అనే ఆలోచనలు వస్తూవుండటం కద్దు. ఏ రూపమయినా అది ఆత్మే-బ్రహ్మమే-నని బుద్ధి తెలిసికొన్నదానిని మనసునకు అలవాటుచేస్తే కేవలం

బ్రహ్మముయొక్క లక్షణాలే అనుసంధానమవుతుంటవి. ఇదీ ధ్యాన రూపం మొదట్లో,

26. ఏ ఏ విషయంవైపునకు మనసు వెళ్లబోతే ఆయా విషయం నుంచి తిరిగి ఆత్మవైపునకు మనసును తేవాలి. ఆయా విషయాల్లో నే ఆత్మ వ్యాప్తమై ఉన్నదనే సంగతి జ్ఞాపకం చేయాలి మనసుకు. అప్పుడు తిరిగి ఆత్మను ధ్యానించటం ఆరంభిస్తుంది ఆ మనసు. ఇలా కళ్లు మూసుకొన్నప్పుడేకాదు. తెరచినా అంతే చేయాలి. సాధకుడు కొంత సాధన అయినప్పటినుంచి మనసును అలా ఆత్మయందే లయింప చేయవలసి ఉంటుంది గాక, ధ్యానసమయం అయిపోయిం తరువాతను కూడ.

27. ఈ లాగా అభ్యాసం చేసే యోగికి ప్రశాంత చిత్తము, రజోగుణ విక్షేపాలు ఉండని తనము, పాపము లేకుండటము, బ్రహ్మ భావాన్ని పొందటమూ ఈ లక్షణాలు స్థిరమవుతవి. అప్పుడు అతడు పరమమైన శాంతిని తానే పొందగలడు. నూనెపోస్తున్నప్పుడు ఎలా ఎడతెగని ధారపడుతుంటుందో అలా ఈ బ్రహ్మభావం ఈ శాంతిని నిలిపి అనుభూతి ఇస్తూ ఉంటుంది. అందుకని ఆ పరమ శాంతి స్థిరంగా అతనికి ఉంటుంది.

28. అట్లు మనసును సర్వదా యోగమందుంచి, పాపములే లేకుండా యోగి, అనాయాసంగా బ్రహ్మాన్ని సాక్షాత్కరించుకొంటూ, నిరతిశయమైన సుఖాన్ని పొందుతాడు - అన్నారు శ్రీకృష్ణులు.

29. తాను చూచిన, తాకిన, విన్న, వాసనచూసినట్టి అన్ని టిలో, ఆత్మను ఎప్పటికప్పుడు అనుభూతి చేస్తూ ఉంటుంటే, ఆత్మ సర్వ భూతస్థమయినదని అవగతమవుతూ ఉంటుంది - సర్వత్రనిండియున్న ఆత్మలోనే అన్ని భూతాలు ఉన్నయిఅనేది అనుభూతి చేస్తాడు. శరీరంలో చేతులు, వ్రేళ్లు, కాళ్లు, యిలా అన్నీ ఎలా ఉంటున్నాయో అలా ఆత్మలోనే యీ ప్రపంచం అంతా వుంటూవున్నదనేది అనుభూతి చేస్తాడు.

30. ఇదీ యోగం. ఇలాయోగి "నేను" అనేదాని విషయం తెలిసి యోగం ఆచరిస్తున్నప్పటినుండి ఆ "నే..." సర్వత్ర నున్నదని, సర్వత్ర నున్న బ్రహ్మమే ఆ "నేనని" చూడగలిగిన యీ స్థితికి వచ్చే టప్పటికి, ఇది సాధనకు పరాకాష్ఠ అని చెప్పబోతున్నారు. శ్రీకృష్ణుడు —అంటున్నాడు "నేను" ఎప్పుడూ— (అతడికి "అహంకారి"గా ఉండే స్థితిలోకూడ) తిరోహితుడను కాను అన్నాడు. పంచభూతాలు, మనోబుద్ధులూ, అహంకారములతో కూడుకొన్న యీ యంత్రాంగంలో మిగిలిపోయిన అహంకార విషయంలోకూడ అనుభూతికలిగిస్తాను నేను అనిపురుషోత్తముడైన శ్రీ కృష్ణుని వాగ్దానం అనిపిస్తుంది. సాధన అంత వరకూ వెళ్లిన తరువాత ఆపైన పైకిలాగడమనేది భగవంతుని 'చిత్' శక్తియొక్క చెయిదమనేది ఇక్కడ సూచన అనిపిస్తుంది ఈ శ్లోకంలో.

31. సర్వ భూత స్థితుడైన నన్ను—ఆత్మను—బ్రహ్మమును —తనతో సహా ఒకడేననే సంగతిని అనుభూతిచేసి, అభావమున ప్రతి ష్ఠితుడైయుండి భజించుతున్నట్లయితె, సర్వావస్థల్లోనూ కూడ అతడు కర్మలయందు ప్రవర్తిల్లుతున్న వాడైనప్పటికీ అతడు "నా" యందె వర్తించు తున్న వాడవుతాడు. ఆత్మయందే మనోబుద్ధులను ఉంచి వ్యవహారాలు కూడ చేసికొనటం అలవాటు చేసి కొన్నవాడు, అహంకారాన్ని కూడ ఆత్మయందేలయింప జేసిన వాడవుతున్నాడు. ఇప్పుడు- కేవలం బుద్ధితో ఈసంగతులు మననం చేస్తున్న మనకు అలాంటిస్థితి ఉండటం సంభవమా అనిపిస్తుంది. అది యోగిఅయినప్పుడె తెలిసికొనాల్సినట్టిది. ఇప్పటికి యోగారూఢులు చెప్పిందిమనకు ప్రమాణం. మెట్టునెక్కలేని వాళ్లం మేడ మీద సంగతులెలా తెలిసికొంటాము మనం?

32. అన్నిచోట్ల కూడ భూతాలన్నిట్లో కూడ ఆత్మస్థితిని, "నేను" ఉన్న స్థితిని, తాను ఉన్న స్థితిని అనుభూతి చేస్తూ సుఖంగాని దుఃఖంగాని కలిగితె రెంటినీ సమభావనతో దర్శిస్తూ ఉండే యోగి పరమ శ్రేష్ఠుడు సుమా అన్నాడు శ్రీకృష్ణుడు.

33—34. ఇన్ని సార్లు మననం చేసినా "అవును సాధన చేయాల్సిందే. ఇప్పటినుంచీ చేస్తాముగాక-అనే నిర్ణయం మనబుద్ధి తీసికొనటం"-పట్టుదల పూర్వకంగా జరగటల్లేదేమోనని పిస్తుంది. అది మన సంస్కార బలంలోని న్యూనతేనేమో. అర్జునుడు మాత్రం శ్రీకృష్ణుడు చెప్పినట్లు ధ్యానం చేయడానికి తక్షణ ప్రయత్నం చేశాడా అనిపిస్తుంది. కాని, ఎదురుగ ఉన్న శ్రీకృష్ణుడ్ని చూసి, ఆత్మ అనటంకంటె భగవంతుడను బుద్ధి కావటం, గాండీవంచూసి ఆత్మ అందామంటే అది క్రిందకు జారిపోయి తానెలాంటి స్థితిలో నున్నాడో జ్ఞాపకం చేస్తూ "ఆత్మ" అననీయకపోవటం ఈ ఆలోచనలు వచ్చినవై మనసును ఏకాగ్రం చేయటం అసంభవమనిపించి ఉంటుంది బహుశ. అందుకని. అంటాడు—

"శ్రీకృష్ణా! మధువనె రాక్షసుని చంపినవాడా। నా మనసులోని చంచలత్వాన్ని నేను చంపలేకపోతున్నాను. అసలు మనసునకు అచంచలమైనస్థితి ఉంటుందనేది నమ్మలేకపోతున్నాను. ఈ మనసును నిరోధించటం వాయువును నిరోధించటంకంటె కష్టతరమనిపిస్తోంది ఎలా?" అన్నాడు.

35. అందుకు సమాధానంగా శ్రీ కృష్ణుడు "ఓ! ఆ మాటయితే వాస్తవమె పొమ్మన్నాడు. అయితె "కాని—" అని ఆరంభించాడు. నాడులన్నీ కృంగిపోయి ఉన్న అర్జునుడికి ఈ "కాని"తో మళ్లీ ఊపిరి వచ్చింది. వింటున్నాడు—"మనసును నిగ్రహించటం కష్టమేకాని అసంభవం కాదయ్యా! వైరాగ్యంవల్లా అభ్యాసంవల్లా మనసు నిగ్రహింపబడగలదు" అన్నాడు. వైరాగ్యం, బుద్ధిచేత తెలిసి అనుసరింపబడేది. అభ్యాసం శరీరమనసులచేత ఆచరింపబడేది. ఒకటి లోపలి అభ్యాసం. రెండవది బాహ్య అభ్యాసం. ఈ అభ్యాసాలు ఆచరింపబడటంవల్ల శరీర మనోబుద్ధులు సత్స్థితికి వచ్చి యోగారూఢత కలుగుతుందని బోధ.

36. సంయమనం లేనివానికి మాత్రం ఇది అసంభవమైనదె. సంయమన మంటె ఇంద్రియ సంయమనం. మనసు పరుగెత్తి ఏ సుఖా

న్నో ఆసిస్తుందిగాక. అదిసరి కాదనీ— ఒకానొక నియమము ననుస రించి చేయబడేది మాత్రమె—ముఖ్యంగా కర్తవ్యమైనట్టి కర్మ మాత్రమే చేయాలి అనీ తెలిసి ఆ నియమాన్ని అనుసరించటం—ఆశయంగా పెట్టు కొని మనసును, ఇంద్రియాలను నిలపడం చేయగలిగినవాడికి పై చెప్పిన యోగం కష్టతరమైందేమీకాదు. పొందశక్యమైనదె సుమా నా ఉద్దేశ్యంలో అన్నాడు శ్రీ కృష్ణుడు.

37. అర్జునుని భావాన్ని (reaction) ఇక్కడ సర్వ సామా న్యునితో సమానంగా చిత్రించారు వ్యాసులవారు. అతడడుగుతున్నాడు. "కృష్ణా ఈ యోగానికి శ్రద్ధకావాలి. అంటె అంతరంగంలో నుంచి ఆరంభించినది కావాలని అర్థం. నియమాన్ని అనుసరించాలి అని శ్రద్ధగా ప్రయత్నం చేస్తున్నా ఎప్పుడైనా ఒకప్పుడు నియమం తప్పటం జరగటం సంభవమనిపిస్తుంది. ఎన్నాళ్ళో ఎంతో నియమంగా నిల చిన సాధకుడు నియమం తప్పినవేళ ఏగతిలో పడతాడో ఊహించ లేకుండా ఉన్నాను. యోగసంసిద్ధి కలగదుగాక. కాని పాప కూపంలో పడి నశించిపోతాడేమో కదా!

38. అటు సిద్ధికలగదు. ఇటు ఇన్నాళ్లూ నియమంగా ఉంటూ ఉన్నందుకు గల కష్టమే తప్ప ఫలితము లేకపోతె, రెంటికీ చెడిన రేవడ కాడా? "బ్రహ్మ" పథంలోనుంచీ తప్పకు పోయినవాడు,ఝంఝూ మారుత తరంగం ఒక్క తన్ను తన్నితె చెదరిపోయే మొగిలు కన్నెలా- ఛిద్రుపలు ఛిద్రుపలై పోడా? ఇదీ సందేహం.

39. ఈ సంశయం సశేషంగా తీసివేయ కలిగిన వాడవునీవే, నాకు చెప్పవలసింది. ఇంకెవరికి దీని సంగతి చెప్పగలిగిన శక్తి ఉం టుంది గనక! నీవు యోగీశ్వరేశ్వరుడవు గనక నీవే స్వానుభవంతో చెప్పగలవని అభిప్రాయము.

శ్రీ కృష్ణుని బోధను కర్తవ్యంగా గ్రహించదానికి వెంటనే మనకు బుద్ధి కలగదుగాక. ఓయబ్బో ఇది మనకయింది కాదులె అనటం

కదు. ఆ పై చెప్పిన సందేహమె అంతరాంతరాల్లో నున్నదై=తీరక మనసును వేధిస్తూ ఉండటంచేత మనం దానిని కర్తవ్యంగా పరిగ్రహించ టల్లేదనిపిస్తుంది. మనకుగల సంస్కారం చాలక ఈ సందేహం తీరుటలేరు. ఎవరి సంస్కారంవారిది కనుక సుసంస్కారాన్ని సంత రించుకోవటం అవసరం. దానికయి శ్రీ కృష్ణుడు చక్కనిబోధ చేస్తున్నాడు. ఆశ చూపిస్తున్నాడు=

40. శ్రీ కృష్ణుడు చెప్తున్నాడు:- పార్థా! సుసంస్కారాన్ని సంతరించుకోవటమె నియమ పూర్వకంగా యోగాన్ని ప్రారంభించటం, ఆలా అరంభించినవాడు, కళ్యాణకృత్-మంచిని చేసేవాడే, ఒకటి జ్ఞాపకముంచుకొను, మంచినిచేసేవాడు ఎన్నడూ దుర్గతికి దింపబడడు సుమా!

ఈ మాట ఎంతోగొప్పమాట కర్మలన్నీ కర్తవ్య కర్మలూ సంకల్పకర్మలూ నిషిద్ధకర్మలూ అని విభాగం చేశారు ఇప్పుడు మంచి చెయ్యాల్సింది. నీకు మంచి సంస్కారం కలుగుతుంది- యోగంలో గెలుపొందుతావు-అంటాడు ఏమిటీ మంచి? కర్తవ్య కర్మలు చేయటమె మంచి అని చెప్పుకోవచ్చు. కర్తవ్యం అనేది ఇంకా అస్పషం (vague) గా మాత్రమే అర్థమయినట్లయితె, మంచీ-చెడూ బుద్ధిమంతులు ఎలా చేపితెఅలా అనుకొనవచ్చుననిపిస్తుంది. చెడుఅని తనకు తెలిసి నట్లయితె ఆ పనిని చేయకపోవటం సుసంస్కారం. మంచి అని తనకు తెలిసిన పనిని కర్తవ్యం అవునా అని విచారించి చేయటంకూడ సుసం స్కారాన్ని సంతరించటమె. ఇదీ కీలకం.

మరొక విశేషం. ఈక్షణాన ఒక పని చేయబుద్ధి అవుతుంది. ఆకలిగొన్నవానికి హోటల్‌లో అన్నం పెట్టిద్దామనిపిస్తుంది. ఈ పని చేయటంవల్ల తాను అడుగుకు దిగజారినాడు అనేది ఉండదు శ్రీకృష్ణుని ఉద్దేశ్యంలో. ఎందుకనంటె అదిమంచిపని. అది చాలు సుసంస్కారం వైపుకు అతడిని త్రోయడానికి. కాని కొంతసేపయినాక, పారేసిన విస్త రాకుల్లోని అన్నంతినే కుక్కను నిష్కారణంగా తరిమేదామనిపిస్తుంది.

ఇది సుసంస్కారం వైపుకు సాధకుణ్ణి త్రోయకపోగా రెండోవైపుకు నెట్టుతుంది. అంటే ఏ క్షణానికాక్షణం మనం ఒకసారి ఒక వైపుకూ మరొకసారి మరొకవైపుకూ నెట్టుకొంటూ ఉంటాం మనసంస్కారాన్ని. శ్రీకృష్ణుడు కేవలం ఈ నిజాన్ని చెప్పాడు—ఒకే పక్షంగా మాట్లాడుతూనే. నీవు నీజీవితంలోని ప్రతి పనినీ మంచిదిగా చూచి చేస్తుంటే నీకు సుసంస్కారం అలవడుతుందిగాని దిగజారట మనేది ఉండదయ్యా అని! ఇది తెలియని నిజం కాదుగాని బుద్ధిలో స్థిరమై నిలుపుకో లేనివాడు, మర్చిపోయే నిజం.

41. శ్రీకృష్ణుడు జీవితంలోని క్షణక్షణం మెట్టునెక్కేమార్గం చెప్పివేశాడు. కాని అర్జునుడు "ఏగతికి" పోతాడు అనటంలో శరీర పతనం తరువాత నరకానికే పోతాడా అన్న భావం అతడికి కలిగిందేమో ననేది జ్ఞాపకంవచ్చి ఒక చక్కని ఆశ చూపెట్టు తున్నాడు ఈ శ్లోకంలో—యోగం ఆరంభించి-మంచిపని చేస్తూనె యోగభ్రష్టుడయి నట్లయితే కూడా పుణ్యలోకాలకె వెళ్లి తిరిగి వచ్చినవాడై శుచిమంతులూ శ్రీమంతులూ అయిన వాళ్ల ఇళ్లల్లో తిరిగి పుట్టుతాడు అన్నాడు. అంటే ప్రతి వాడూ ఒకనొక (పూర్వ) సంస్కారంతో పుట్టుతాడని ధ్వని. అసలు శరీరం చచ్చేలోగానే మనసూ బుద్ధీలు బహుజన్మ నెత్తినవై సరి యైన స్థితికి వచ్చి యోగసంసిద్ధిని పొందటానికై ఇన్ని అధ్యాయాలు చెప్పి నీరసంనుంచి తేరుకోలేని అర్జునునికిముందు జన్మయందు సక్తిని కలిగిస్తున్నాడు, కృష్ణుడు. అర్జునునికి ఇంకా మనకులాగానే మూఢత్వం వదలక పోవటంవల్ల, "నబుద్ధిభేదం జనయేత్" అనే సూక్తిని తానై అనుసరిస్తున్నాడా శ్రీకృష్ణుడు అనిపిస్తుంది.

42-43 ఇంకా చెప్తున్నాడు శ్రీకృష్ణుడు: "జ్ఞానులు, ఇంకా విజ్ఞానాన్ని ఎరుగని వారియొక్క బుద్ధిమంతులయొక్క ఇండ్లలోనే పుట్టతారుగాక. అలా పుట్టి పూర్వజన్మలో తాము విడిచిన యోగ బుద్ధిని తిరిగి పొందుతారు. ఆ ప్రేరణచేత సిద్ధిని పొందటానికి పూర్వముకంటె ఎక్కువగ ప్రయత్నిస్తారు" అన్నాడు.

ఇక్కడ ఒక సూక్ష్మమైన విషయం జ్ఞాపకం చేసికొనవచ్చు. పూర్వజన్మ ఉత్తరజన్మ ఉంటవనే సంగతి శ్రీకృష్ణుడు ఇక్కడనె ప్రసంగించాడు. రెండవ అధ్యాయంలో ఇలా చెప్పలేదు. పుట్టిందేదో చావక మానదు. చచ్చిందేదో పుట్టక మానదు. ఈ పుట్టటం చావటం ప్రకృతి ధర్మంగాని ఆత్మలైన 'నీ' ధర్మం కాదు- అన్నాడు. ఇప్పుడు యోగభ్రష్టుడు మంచి జన్మనే పొందుతాడు అంటున్నా ఆ జన్మ ప్రకృతిదేను "నా" అనే మానవుడిది కాదని చెప్పదేమి అనిపిస్తుంది.

శ్రీకృష్ణుడు ఈ ఆత్మ సంయమయోగంలో సాధకునకు ఒక వెలుగు చూపించడానికి ఇలా చెప్తున్నాడు. ఆ వెలుగు ఏమిటంటే-

ఉత్తరజన్మ అన్నప్పుడు శరీరం చచ్చిన తరువాత తిరిగి క్రొత్త శరీరం వచ్చినప్పుడు, అది ఉత్తరజన్మ అనుకొంటాం. అది ఒక భావం. ఈ జన్మలు ప్రకృతివిగాని ఆత్మవికావనేది నిజం. ప్రకృతిలో శరీరం, మనసు, బుద్ధికూడ ఉన్నాయి. మనసు మారి మరో ఆలోచనవస్తె అప్పుడు మానసికంగా మరోజన్మ కలిగినట్లేననేది తెలియటం అవసరం. బుద్ధికి క్రొత్తవిషయం నచ్చచెప్పినపుడె క్రొత్తజన్మ కలిగిందనటం మాత్రం న్యాయంకాదా? ఈ మూడింటితో తాదాత్మ్యంపొందినవాడై పరమాత్మ - లేదా ఆత్మ-క్షణక్షణానికి తానే జన్మనెత్తుతున్నట్లు భ్రమచేత అనుభూతి చేస్తుంటుందిగాక. ఉత్తరజన్మమనేది ఇలా అర్థం చేసికొనటం సబబు ఈ సందర్భంలో

శరీరం వృద్ధిపొందుతోంది. శిథిలమవుతోంది. నేను ముసలి నయ్యానంటున్నాడు- మాట భేదంగాని-జన్మక్రొత్తదే. ఇక ఈ సాధన వల్ల మనసు మెట్లునెక్కుతున్నది. బుద్ధిమేడల నెక్కుతున్నది. నిన్నటి మనిషికాడు ఈవేళ మాట్లాడేవాడు.

మానవుడు తాను ఈ ప్రకృతికి భిన్నమైనవాడనే భావన అట్లుండగా - అది అలావదిలి - అజ్ఞానియై ఈ క్షణక్షణాత్మకమైన మార్పు తనదెననుకొంటున్నాడు. ఈ విధంగా చూస్తె క్షణానికొక

క్రొత్తజన్మ వచ్చిపడుతున్నది. పాత స్థితి పోతున్నది. బాల్యం, యౌవ్వనం, కౌమారం, వార్ధక్యం, బ్రహ్మచర్యం, గారవాత్యం, వానప్రస్తం, సన్యాసం- ఇలా ఎన్నో మార్పులు ఇవన్నీ జన్మలే. ఎన్నో జన్మలు! శ్రీకృష్ణుడు ఎన్నోజన్మలు వస్తవి అనటంలో ఇవన్నీ కూడ ఇమిడి ఉన్నవని తెలియటంసబబు. శరీరంచచ్చి క్రొత్తశరీరం వచ్చినప్పుడేగాక, శరీరం మారినప్పుడల్లా, మనసుమారినప్పుడల్లా, బుద్ధిమారినప్పుడల్లా, ఆ శరీరం, ఆ మనసు, ఆ బుద్ధి, క్రొత్తజన్మను ఎత్తుతున్నది అనే విషయం తెలిసికొనాలి. అలా అనుకొంటే ఆ చెప్పిన జన్మలు- మంచి పని చేసేవాడి విషయంలో-ఎప్పుడూ కూడ ఉచ్చకే పోతవి కల్యాణమె అవుతుంది. దుర్గతిరాదు అని శ్రీకృష్ణునిబోధ అనిపిస్తుంది.

ఎలాగంటె మంచిచేస్తే మంచివైపుకు మెట్టు నెక్కుతాము. నిజానికి కార్యకారణ సంబంధరీత్యా ఫలితం మంచికె ఉంటుందిగాని చెడ్డకు దోవతీయదుగదా! వెనకటి జన్మకంటె మంచిజన్మ అప్పటి కప్పుడు వచ్చేసిందన్నమాట! శ్రీకృష్ణుడు, శరీర నిర్యాణం తరువాత ఎప్పుడోవచ్చే జన్మవిషయం మాత్రమే ప్రసంగిస్తూ "నహిదుర్గతిం గచ్ఛతి" అని చెప్తున్నాడనుకొనవద్దు. ఆయన చెప్పేది- ఎప్పుడు మంచిచేస్తే అప్పుడే మెట్టునెక్కుతావు అని, అప్పటికప్పుడు నీ మనసు శుద్ధి అవుతుంది. నీ పరిసరాలు మెరుగవుతవి. నీ యోగబుద్ధి ఎక్కువవవు తుంది. క్షణక్షణానికీ మంచికి పోవటం మంచి జన్మను పొందటం జరుగుతుందని శ్రీకృష్ణుడు చెప్తున్నాడు.

ఎంతవరకు సాధనచేస్తే అంతవరకూ "నీవు"అనే దానిచుట్టూ నున్న ప్రకృతికి మంచి- మంచిజన్మ- సంక్రమిస్తూనే ఉంటుంది. క్షణ క్షణం. సాధన ఆగిపోయినా ఆ స్థితిలోనే ఉంటుంది గాక- నీవు తిరిగి చెడ్డపనులు చేస్తేతప్ప

ఇలా చెప్పుకొనక పోయినట్లయితె రెండవ అధ్యాయంలోనూ ఐదవ అధ్యాయంలోనూ చెప్పుకొన్న మాటలతో ఈ మాటల భావం

సమన్వయంకాదు. ఐదో అధ్యాయంలో ఏమన్నారు? ఈ ఐహికంలోనే కామక్రోధోద్భవాల వేగం తగ్గించి వాటిని జయించి సామ్యస్థితినందిన వాడు బ్రహ్మమందేస్థితుడై బ్రహ్మమే అయిపోతాడు అన్నారు. బ్రహ్మ స్థితికలిగిన వానికి చావుపుట్టుకలులేవు. శరీరానికి అవి తప్పవుగాక. శరీరపుచావు పుట్టుకలు ఆత్మయొక్క ప్రయాణంలో మైలురాళ్లు మాత్రమే కదా! అవి అతడికి అంటవని అర్థం. అప్పుడు ఒకప్రక్క తన శరీరం చస్తున్నా నేను చావటల్లేదు అనే భావిస్తాడని అర్థం. కాని అప్పటిదాకా మార్పులన్నీ తనవిగానే భావిస్తాడుగనక జన్మలు అని శ్రీకృష్ణుడు వాటిని అంటున్నాడు. ఈ అన్వయం నిస్సందేహంగా అర్థం అయితె బాగుండును.

44-45 ఇంకా చెప్తున్నాడు శ్రీకృష్ణపరమాత్మ-అభ్యాసవశం చేత ప్రత్యేక ప్రయత్నంలేకుండానే యోగసాధనచే ఆకర్షింపబడి, దానినే సాగిస్తాడు. యోగభ్రష్టుడు తాత్కాలికంగా దిగజారినవాడైనా తరువాత ఎప్పుడో తిరిగి మంచి సాగటానికి ఏఅభ్యంతరమూ లేదని ధ్వని. శరీరం పోయి క్రొత్త శరీరం వచ్చింతరువాతైనా ఇదెఫలితం.

అలా ముందుకు పోయినవాడై వేదకర్మల ఫలాన్నికూడచుల్కన చేసి అతిక్రమించకలుగుతాడు. వేదకర్మలను చుల్కనచేస్తాడనటం సరి కాదు. వాటిఫలాలయందు మనసుండదనిధ్వని. క్షణక్షణా నికీకలిగే యీ బహుజన్మల తరువాత కలిగే ఫలంగా జ్ఞానాన్నిపొందుతాడని అర్థం. వాల్మీకి బుద్ధుడు ఒక్కశరీర జన్మలో బ్రహ్మస్థితి నెలాపొందారు? పుట్టినప్పుడు అజ్ఞానులె. క్షణక్షణానవారు, వారి మనసూబుద్ధిలు పొందిన మార్పులు అంతతీవ్రమైనవిగనక అంతస్థితికి ఎక్కనారు, బ్రహ్మస్థితిని పొందారు.

46-47 యోగి అందర్లోకి గొప్పవాడు. ఆత్మానాత్మ వివేకం ఎరిగి సర్వత్ర ఆత్మ దర్శనం చేసికొన్నవాడు యోగి. కేవలం ధ్యానంచేసే తపస్వికూడ ఇలాదర్శనం చేసికొన్నప్పుడే యోగిఅవుతాడు. అలాకాని తపస్వికంటే-అంటే-అంతశ్చక్రాలమీద ధ్యానంచేసి ఊరుకొనే

తపస్వి కంటే-యోగియే అధికుడు అంటున్నారు శ్రీకృష్ణులు. అలాగే జ్ఞానిఅయ్యుండి కూడ, సామాజిక కర్మలను అంటే స్వధర్మమునుకర్తవ్యకర్మగా చేయక రాయిలా ఉంటె అతడు యోగికంటె నిమ్నస్థితిలో నున్నవాడేనుట. ఇంకా కర్మిష్టిఎవరైనా కర్మయోగికి చెప్పబడినజ్ఞానంతో కర్మ చేస్తేనేతప్ప అతడి కంటెకూడ యోగియే అధికుడని బోధచేస్తున్నారు.

ఇంకా యోగులందరిలోకూడ ఎవడైతే శ్రద్ధాయుక్తుడై "నా" యందాసక్తమైన చిత్తంతో నన్ను "నేనును" లేదా పురుషోత్తముడనైన నన్నుభజించుతాడో అతడు సర్వశ్రేష్టుడు అతడు, నాకుప్రియమైనవాడు, సమ్మతుడున్నూ అనితెలిసికో అన్నాడు శ్రీకృష్ణభగవానుడు.

ఈ ఆరవ అధ్యాయంలో యోగారూఢుని లక్షణాలు ముందు చెప్పి, ఆస్థితి గమ్యస్థానంగా తీసికొని దానికయి ఎలాసాధన చేయాలో చెప్పటంప్రధానం. ముఖ్యమైన లక్షణంమనస్సంయమనం అదిఎలాచేయాలంటే అభ్యాసంవల్లనూ వైరాగ్యంకలిగి యుండటం ద్వారానూ అని చెప్పారు. అభ్యాసమెలా చేయాలోశరీరమనో బుద్ధులను ఏకముఖంచేసి, ఎలా సంయుతుడు కావాలోచెప్పారు. అలా అభాస్యంచేసేవాడు ధ్యానగృహంలోనేగాక బయటి ప్రపంచంలోకూడ అదే అభ్యాసం నిరంతరం చేయటం ఈసాధనలోని పరాకాష్ట. అలాచేసినపుడు, అతడు బ్రహ్మస్థితినిపొంది బ్రహ్మమె కాగలడని వాగ్దానం చేశాడు శ్రీకృష్ణులు.

ఇంతకూ "తత్త్వమసి" అనే మహావాక్యార్థం వివరించడంలో "త్వం" యొక్క అర్థమేదో అదిచెప్పబడింది యీఆరు అధ్యాయాల్లో. ఇక తరువాతి ఆరు అధ్యాయాల్లో "తత్'' యొక్క విశేషం చెప్పబోతారు. చివరి ఆరుఅధ్యాయాల్లో ఈ"త్వం" "తత్'' ఎలాఅవుతుందో-కావాలో ఆమార్గం "అసి" అనేదాని విషయం చెపుతారు.

ఈకర్మషట్కంలో - అర్జునుడు యుద్ధంచేయను అన్నందుకు, సమాజసేవఏది నీవుచేయవలసి వుంటుందో అది చేయకతప్పదనీ- ఆకర్మ భగవంతుడి కర్మఅనీ నీకుకర్తృత్వం పెట్టుకో వద్దనీ-అనాత్మ సర్వమూ చేయటంచూస్తూ ప్రతిచోటా ఆత్మఉన్న సంగతి గమనించాలనీ - కర్మలను కౌశలంగా ఎలాచేయాలో తెలిసికొనమనీ - కర్తవ్యం కనక - కర్మలను చేయవలసియే ఉంటుందనీ - కర్తవ్య కర్మను చేస్తేమంచిదా చేయకపోతే మంచిదా అని నీవు సమస్య లేవదీయటం తెలివితక్కువఅనీ వ్యర్థమయినదానిని పట్టుకుకూర్చోవటమె అవుతుందనీ అన్నారు. కర్మలను సుకరంగా ఎలాచేయాలో ఆ సాధన 4వ అధ్యాయంలో చెప్పారు. ఇకముందు అధ్యాయాల్లో అర్జునుడు కర్మ ఎందుకు చేయాలి అనేసందేహం లేవదీయ లేదెప్పుడూను. ఇక మీదట అర్జుననకు వచ్చే సందేహాలు కర్మవిషయంకాదు భగవంతుడి విషయం. అందుకని ఇకముందు చెప్పబోయేది భగవంతుడెవరు భక్తిఏమిటి అనేసంగతి. అందుకని అదిభక్తిషట్కం అంటాను. పరమాత్మషట్కం. పరమార్థ తత్త్వ విషయికమైనషట్కం.

(ఇదిఆరవ అధ్యాయం)

ఓం తత్సత్

# శుద్ధ పత్రము

| వరస | ఉన్న పదములు | శుద్ధమైనవి |
|---|---|---|
| 11 | నమయ లవి | సమయాలవి |
| 21 | శుఖేచ్ఛా | శుభేచ్ఛా |
| చివరి వరస | ఈ రెండిలో | ఈ రెంటిలో |
| 1 | నిర్ట్లయించాలి | నిర్ణయించాలి |
| 8 | మనసు పల్ల | మనసు వల్ల |
| 14 | మైనదనటం | మైనదనటం, రెండవది అతీంద్రియాత్మకం |
| 28 | అసమర్థుడు | అసమర్థుడూ |
| 9 | బేదపూర్వక | భేదపూర్వక |
| 22 | వారనీ | వారినీ |
| 25 | తిన్నిగా | తిన్నగా |
| శీర్షములో | ౧-నర్జుల విషానయోగం | ౧-అర్జున విషాదయోగం |
| 2 | తీరా లిప్పుడు | తీరాలి ఇప్పుడు |
| 14 | యుద్ధం మొదయే | యుద్ధం మొదలయే |
| 9 | సహాజపరమైన ధర్మం | సమాజపరమైన ధర్మం |
| 10 | యిద్ధం చేయటమనేది | యుద్ధం చేయటమనేది |
| 2 | విమర్శ తోలగింప | విమర్శతో లగింప |
| 4 | ఆ స్థితితో | ఆ స్థితిలో |
| 7 | అనేవీ లేవని | అవేవీ లేవని |
| 11 | అతతు | అతడు |
| 13 | లేదనేటి | లేదనేదీ |
| 17 | పువ్వు నిశించి ఫలమపు | పువ్వు నశించి ఫలమవు |
| 21 | సంబధం | సంబంధం |
| 8 | అచారంతో | ఆచారంతో |
| 17 | వ్యక్తిగత లాభలను | వ్యక్తిగత లాభాలను |

| | | | |
|---|---|---|---|
| 33 | 22 | కానికోరికలుఅవి ఫలించవు | కానికోరికలు అవి. ఫలించవు. |
| 36 | 22 | అలంకార్థకంగా | ఆలంకారికంగా |
| 37 | 6 | ఇంతకూ మాత్రం | ఇంతకూ సూత్రం |
| | 22 | కామయే | కామమే |
| 38 | 9 | ఈ"పైన"పైన | ఈ 'పైన' పైన |
| 39 | 1 | నిషామకర్మ | నిష్కామకర్మ |
| | 15 | నిషామకర్మ | నిష్కామకర్మ |
| | 17 | నాకు చెపుతుంది | నాకు ఏమి చెపుతుంది |
| | చివరి వరస | బుద్ధియేగమ నీదానివల్ల | బుద్ధియోగమనే దానివల్ల |
| 40 | 4, 5, 7 | స్థితిప్రజ్ఞు | స్థితప్రజ్ఞు |
| 44 | 3 | ఉండనవి | ఉండవవి |
| | 20 | సాయిది | స్థాయిది |
| 47 | 21 | తనవారైనా నరే | తనవారైనా సరే |
| 51 | 9 | ములం | మూలం |
| | 10 | అ "జ్ఞానం" | ఆ "జ్ఞానం" |
| 52 | 19 | చూచిన అతడికి | చూచినా అతడికి |
| 53 | 16 | అసించబడి కేవేలం | ఆశించబడి కేవలం |
| | 19 | సమాజానికీ గామ | సమాజానికి గాను |
| 55 | 2 | దేవకీనందమునిగా | దేవకీ నందనునిగా |
| | 11 | చేసేవాడిలో | చేసేవాడిలా |
| 61 | 20 | ఆజ్ఞానం | ఆ జ్ఞానం |
| 62 | 2 | ఇవి ఇండటం | ఇవి ఉండటం |
| 67 | 9 | అంటని కారణంచేతనె | అంటనికారణం అందుచేతనే. |
| 69 | 23 | మనం ఇచ్చిన వాళ్ల అవి వానికి స్వహజ లక్షణాలు అవుతామా? | మనం ఇచ్చినవాళ్ల మవుతామా? అవి వాటికి సహజ లక్షణాలు |
| 74 | 4 | న్యవహార | వ్యవహార |
| | 8 | కర్మయః | కర్మ యః |

| | | | |
|---|---|---|---|
| 74 | 14 | ఉండాలి? | ఉండాలి. |
| 75 | 18 | వర్జించమనేది | నర్జించటమనేది |
| 76 | 17 | ఏన్ని | ఎన్ని |
| | 20 | సబ్ధు | స్తబ్ధు |
| 79 | 17 | ముక్తిలేదు. | ముక్తిలేదు సక్తిలేదు |
| | 20 | వస్త్వను భవ | వస్త్వనుభవ |
| 80 | 19 | పలితం | ఫలితం |
| | 25 | ఒకశే. | ఒకటినీ. |
| 82 | 12 | వెళ్లినాస్తుందంటే | వెళ్లినా వస్తుందంటే |
| 84 | 2 | సన్న్యాసిన్నీ అస | సన్న్యాసిన్నీ అని |
| చివరి మూడు వరసలు | | "భేదం"...నుంచి "ఉంటారు" వరకూ | భేదం లేదు. ఆత్మ అని యోగి న్నీ భగవంతుడని సన్న్యాసిన్నీ ఆరాధిస్తూ ఉంటారు. పేరు మాత్రమే భేదం. |
| 85 | 15 | ఉదయిస్తోంది నీలో ఆత్మ] | ఉదయిస్తోందినీలో. ఆత్మ |
| | 24 | కర్మలనీ | కర్మలన్నీ |
| 86 | 3 | అన్నతాడు | అన్నవాడు |
| 87 | 5 | పనివె ఫలం | పనికి ఫలం |
| | 8 | ఆ యుక్తుడికి | అయుక్తుడికి |
| | 9 | విశయం | విషయం |
| | 11 | క్లేదనటం | లేదనటం |
| | 12, 13 | "మెట్టు ఇక" నుంచి "ఇంకాచెప్పాలంటే" వరకూ | మెట్టు. ఇక మూడవది- సర్వత్రనుండే ఆత్మే ప్రత్యక్షమై పనులను జరుపుతున్నట్లు తెలిసినప్పుడు బ్రహ్మమే సర్వకర్మలూచేసి కొంటున్నాడు అని తన కర్తృత్వ భావం నశింపు చేయటం సాధ్యమవుతుంది. ఇదిమూడవ మెట్టు. ఇంకా చెప్పాలంటె |

| | | | |
|---|---|---|---|
| 88 | 11 | చెప్పబడలేదు | చెప్పలేదు |
| 91 | 8 | భగవంతుడని | భగవంతు డనే |
| 92 | 22 | కృష్టిచేత | దృష్టిచేత |
| | | ఈ నాహాన్ని | ఈ అహాన్ని |
| | 23 | జ్ఞాము | జ్ఞానము |
| 93 | 7 | పరాకాష్ట,అనంగానే | పరాకాష్ట, బ్రహ్మము అనగానె |
| 94 | 9 | చేయగలుగుతవే | చేయ గలుగుతుందే |
| | 16 | బ్రహ్మస్థికులై | బ్రహ్మస్థితులై |
| | ,, | సాధ్మ | సాధన |
| 95 | 2 | జరగదు అంతరీద్రియా | జరగదు. అంతరింద్రియా |
| 97 | 2 | పొందగలిగేవారిని | పొందగలిగేవారి సంగతిని |
| 100 | 17 | కాడు | కాదు |
| | 21 | అసంకల్పాలను | సంకల్పాలను |
| 101 | 22 | ఆసక్తత యే | అసక్తత యే |
| | 23 | సమయంలోనేకారు. | సమయంలోనే కాదు. |
| 104 | 3 | అత్మ నసీ | ఆత్మ నసీ |
| 108 | 18 | మనసున కయిన | మనసున కయిన |
| 111 | 20 | రెండోవైపునకు | ఆవైపునకు |
| 112 | 13 | మనసున్నా బద్ధికి | మనసుకున్నా బుద్ధికి |
| 116 | 14 | అభావమున | ఆ భావమున |
| 119 | 2 | మసను | మనను |
| | 4 | తీరుటలేరు | తీరటల్లేదు |
| 120 | 11 | వతనం | పతనం |
| | 17 | బహుజన్మనెత్తి | బహుజన్మల నెత్తి |
| 121 | 5 | ఆత్మలైన | ఆత్మవైన |
| 123 | 2 | గారహాత్యం | గార్హపత్యం |

—o—